# అపరాధ పరిశోధన

రు. 4 | నవంబర్ '79

సప్లిమెంట్

71

'PRABHAKAR'



# నాలుగు నవలలు

(మీకోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న

మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## పగటి దొంగలు?

రచన: టెంపోరావ్

## పాపి - పతివ్రత

రచన: వసుంధర

## ఆర్తనాదం

రచన: ఏ. వీ. మోహన్రావ్

## రూపరాణి

రచన: వాణిశ్రీ

**అడుగు ముందుకు వేస్తే చస్తావ్!**

పదకొండవ భాగము—రచన: వసుంధర

**అపరాధ పరిశోధన సప్లిమెంట్ — 71**

నవంబరు, 1979

వెల: రు. 4-00

ఏడాది చందా 49 రూపాయలు

జీవిత చందా 325 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:

**శ్యామదామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:

**టెంపోరావ్**

**శ్యాంబాబు**

**రమణశ్రీ**

**ఏ. వీ. మోహన్రావ్**

**సుజనశ్రీ**

**వసుంధర**

**విద్వాన్ షీలాదేవి**

కార్యాలయం:

**అపరాధ పరిశోధన కార్యాలయం**

నారాయణగూడ, హైదరాబాదు-29

ఫోన్-64843

ముద్రణ:

**క్రాంతి ప్రెస్,**

2, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్, మద్రాసు-1.

# పగటి దొంగలు?

## టెంపోరావ్

రాజాచంద్ర ఆ యింటిముందు ఆగాడు. అతడి చేతిలో నల్లటి ప్లాస్టిక్ బ్యాగ్ వుంది.

భయపడుతూ అతడు తెరచివున్న గుమ్మంవైపు చూశాడు. గురవయ్యశెట్టి దొంగ వస్తువులను కొంటాడని అతడు విన్నాడు. అది ఎంతవరకు నిజమో అతడికి తెలియదు.

రాజాచంద్ర మెల్లిగా ముందు హాల్లోకి వెళ్ళాడు. పడక కుర్చీలో గురవయ్యశెట్టి కూర్చుని వున్నాడు. శెట్టి వయస్సు అరవై దాటి వుంటుంది. పంచ, జుబ్బాలో వున్నాడతను. బొగ్గు నలుపు. పొట్టిగా లావుగా వున్నాడు.

అతడు రాజాచంద్రవైపు సూటిగా చూశాడు.

"ఏం కావాలి?" అడిగాడతను.

"నా దగ్గర విలువయిన వస్తువులున్నాయి. అమ్మడానికొచ్చాను."

అతడివైపు తదేకంగా చూశాడు శెట్టి. అతడు యువ

కుడు. వయస్సు ఇరవై వుండొచ్చు. పచ్చగా, అందంగా వున్నాడు. పాంట్, స్లాక్ ధరించాడు. కాళ్ళకు బూట్లు వున్నాయి.

"చూపించు!" అన్నాడు శెట్టి అధికార ధోరణిలో.

రాజాచంద్ర తన ప్లాస్టిక్ బాగ్‌లోని వస్తువులను నేల మీద పడేశాడు. కొన్ని వెండిపాత్రలు, ఒక వాచ్, ఒక ట్రాన్సిస్టర్, ఒక స్టెతస్కోప్.

"ఏ డాక్టర్ యింట్లోనుంచో యివన్నీ కొట్టేసి వుంటావు!"

రాజాచంద్ర మాట్లాడలేదు. మౌనంగా వున్నాడు. గురవయ్యశెట్టి నేలమీద వస్తువులను పరీక్షించాడు. వాటి విలువ వెయ్యిపైగా వుంటుంది.

"వీటికి రెండువందలిస్తాను" అన్నాడు శెట్టి.

రాజాచంద్ర వులిక్కిపడ్డాడు.

"చాలా తక్కువ!" అన్నాడతను.

"ఇదంతా దొంగసొత్తు. దొంగసొత్తును అమ్మడంలో ఎన్నో ప్రమాదాలున్నాయి. అంతకంటె యివ్వలేను!"

"ఇవ్వండి," అన్నాడు రాజాచంద్ర.

తనకు డబ్బు అర్జంటుగా కావాలి. ఎంతొచ్చినా ఫర్వాలేదు. శెట్టి డబ్బును వెంటనే యివ్వలేదు. అతడి వైపు సూటిగా చూశాడు.

"నువ్వు ఎక్కడ వుంటున్నావు?"

రాజాచంద్ర భయపడ్డాడు. తన యెడ్రెస్ అతడి కెందుకు? తనని పోలీసులకు అప్పగిస్తాడా?

"నా ఎడ్రెస్ చెప్పను," అన్నాడతను.

"మిస్టర్, నన్ను నీ శత్రువుగా భావించకు. నేను నీ

మిత్రుడిని. నీ గురించి యెప్పుడూ యెవ్వరికీ చెప్పను. కాని నువ్వు ఎవరో, ఎక్కడుంటున్నావో నాకు కావాలి. యిటుపైగా నువ్వు దొంగిలించే వస్తువులన్నీ నాకే అమ్మాలి!"

క్షణకాలం రాజాచంద్ర ఆలోచిస్తూ వుండిపోయాడు.

"నా పేరు రాజాచంద్ర. నేను నెంబర్ 10, మురుగమ్మన్ వీధిలో వుంటున్నాను."

"నీతో ఎవరుంటున్నారు?"

"అమ్మ నాతో వుంటోంది. ఆమె తప్ప నాకెవ్వరూ లేరు."

"ఆమె పేరు?"

"మంగమ్మ."

గురవయ్యశెట్టి కుర్చీలోంచి లేచాడు. ఇనప్పెట్టెవైపు వెళ్ళాడు. ఇనప్పెట్టెను తెరిచి రెండు వందలయాభై రూపాయలు రాజాచంద్రకు యిచ్చాడు.

"నేను చెప్పిందానికంటె యాభై ఎక్కువిస్తున్నాను. నువ్వు సంతోషంగా వెళ్ళాలని నా వుద్దేశం," అన్నాడు శెట్టి.

రాజాచంద్ర సంతోషించాడు. నోట్లను పాంటు జేబులో దాచుకున్నాడు. "చాలా థాంక్స్. వెళ్ళొస్తాను సార్," అన్నాడతను.

"రాజా! దొంగతనాలు చేసేటప్పుడు జాగ్రత్తపడు! నువ్వు ఎన్నడూ పోలీసులకు చిక్కకూడదు. నువ్వు ఎప్పుడేం తెచ్చినా నేను కొంటాను. నువ్వు ఒకవేళ పట్టుబడితే, నా పేరు ఎప్పుడూ చెప్పకూడదు!"

"చెప్పను," అన్నాడతను.

6

"అనేకమంది అలాగే అంటారు. పోలీసులు చావ గొడ్తే నిజం చెప్పేస్తారు" అన్నాడు శెట్టి.

రాజాచంద్ర నవ్వాడు.

"నేను పట్టుబడను. నన్ను హింసించే అవకాశం పోలీసులకు దొరకదు. మీకు బెంగ అనవసరం," అన్నాడు అతను.

"గుడ్, అలాగే వుండాలి" అన్నాడు గురవయ్య శెట్టి.

## 2

కమల, విమల రోడ్డమ్మట నడుస్తున్నారు. ఇద్దరూ నల్లగా వున్నారు. ఓసారి వాళ్ళనుచూస్తే మళ్ళా అటు వైపు చూడ బుద్ధి కాదు. ఇద్దరి చేతుల్లోనూ పెద్దబాగ్స్ వున్నాయి.

వాళ్ళు ఒక ఇంటిముందు ఆగి, మెల్లిగా లోపలకు వెళ్ళారు. ముందు తలుపు గుమ్మం యెదుట నిలబడి తలుపును తట్టారు. రెండు నిమిషాల తర్వాత తలుపు తెరవబడింది. బంగారమ్మ వాళ్ళవంక చూసింది.

బంగారమ్మ వూదారంగు చీర, రవిక వేసుకుంది. చేతికి అందమైన వాచ్ వుంది. ఆమె చాలా లావయిన మనిషి. చేతికి బంగారం గాజులు, వేలికొక వుంగరం వున్నాయి. ఆమె వయస్సు అరవై వుంటుంది. తెల్లటి జుత్తు.

"అమ్మాయిలూ, ఏం కావాలి?" అడిగిందామె.

"మేం రఘు అండ్ కంపెనీ తరఫున పనిచేస్తున్నాం. ఇంటింటికీ వెళ్ళి ఈ డిటర్జెంట్ వాషింగ్ పౌడరు అమ్ముతున్నాం" అంది కమల.

"నలుగురు మెంబర్లున్న కుటుంబానికి కిలో పాకెట్ నెలరోజులు వస్తుంది. గుడ్డలు తెల్లగా వుంటాయి. మురికి మాయమవుతుంది," అంది విమల.

బంగారమ్మ వాళ్ళవైపు దయతో చూసింది. ఈ ఆడ పిల్లలు ఎండలో తిరుగుతున్నారు.

"మంచినీళ్ళు కావాలా?" అడిగిందామె.

"ఇవ్వండి బామ్మగారూ," అంది కమల.

"లోపలకొచ్చి కూర్చోండి. నీళ్ళు తెస్తాను," అని ఆమె లోపలకు వెళ్ళింది.

కమల, విమల హాల్లోకి వెళ్ళారు. ఇద్దరూ నలు వైపులా చూశారు. టేబుల్ మీద పెన్నుంది.

కమల టేబుల్ దగ్గరకెళ్ళింది. పెన్నును బాగ్‌లో పడేసుకుని సొరుగు లాగింది. లోపలున్న రిస్ట్‌వాచ్‌ని బాగ్‌లో వేసుకొని, విమల సంజ్ఞలు గుర్తించి వచ్చి కుర్చీలో కూర్చుంది.

బంగారమ్మ తెచ్చిన నీళ్ళు వాళ్ళు దాహంతో తాగేరు.

"చాలా థాంక్స్ బామ్మగారూ," అంది కమల.

"ఒక పాకెట్ కొనండి. వెల 10-50. మార్కెట్లో యిదే పాకెట్ 12-50 కి అమ్ముతున్నారు," అంది విమల.

"మనవడు లేడు. వాడుంటే తప్పక కొనమనేదాన్ని" అంది బంగారమ్మ.

"ఆయన ఎప్పుడు వస్తారు?" అడిగింది కమల.

"ఆరింటికొస్తాడు" అందామె.

"మళ్ళా వస్తాం, బామ్మగారూ" అని వాళ్ళు బయ టకు నడిచారు.

వాళ్ళు బయటకు వెళ్ళాక బంగారమ్మ తలుపుమూసి

గడియలు బిగించి తన బరువయిన శరీరాన్ని మెల్లగా పడ గ్గదిలోకి చేర్చి, మంచంమీద వాలింది.

కమల, విమల ఆ రోడ్డులోని మరే యింటికి వెళ్ళ లేదు. శరవేగంగా రోడ్డమ్మట నడచి వెళ్ళిపోయారు. రోడ్డు మలుపులో మోటర్ సైకిల్ పక్కనే రాజాచంద్ర నిలబడి సిగరెట్ పీలుస్తున్నాడు.

సమీపంలో ఎవ్వరూ లేరు. వాళ్ళు అతని పక్కనే ఆగారు. కమల తన బాగ్ లోంచి వస్తువులుతీసి అతడి బాగ్ లో పడేసింది. విమల మరికొన్ని వస్తువులు యిచ్చింది. అతడు బాగ్ ను మోటర్ సైకిల్ కి తగిలించుకొని వెళ్ళి పోయాడు.

వాళ్ళిద్దరూ వెనక్కి తిరిగారు, అదే రోడ్డులోని మరి కొన్ని యిళ్ళకు వెళ్ళటానికి.

# 3

చిన్న యిల్లు.

పడగ్గదిలో రాజాచంద్ర కుర్చీలో కూర్చుని వున్నాడు. నేలమీద రెండు చాపలు పర్చివున్నాయి. వాటిమీద ఆరుగురు యువతులు కూర్చొని వున్నారు.

అతడు నవ్వుతూ వాళ్ళవైపు చూశాడు.

"మైడియర్ ఫ్రెండ్స్, ఇవాళ ఏడో తారీఖు. గత నెలలో మనం దొంగిలించిన వస్తువులకు మొత్తం మూడు వేలు వచ్చింది. మన అగ్రిమెంట్ ప్రకారం అందులో సగం నాది. మిగిలినది మీకు పంచేస్తున్నాను. ఒక్కొక్కళ్ళకి 250 వస్తుంది," అన్నాడతను.

వాళ్ళందర్కి అతడు డబ్బు యిచ్చేశాడు. వాళ్ళ ముఖాలవైపు చూశాడు. ముగ్గురి ముఖాలు సంతోషంగా

వున్నాయి. కమల, హేమ, గాయత్రి ముఖాల్లో సంతోషం లేదు.

"మీరు ముగ్గురూ ఎందుకలా వున్నారు?" ప్రశ్నించాడతను.

"మా శ్రమకు వచ్చింది తక్కువ!" అంది కమల.

"దొంగిలించేది మేము. మాకింకా ఎక్కువ రావాలి," అంది గాయత్రి.

"నేనూ అలాగే అంటాను" అంది హేమ.

రాజాచంద్ర విల్స్ ఫ్లేక్ కింగ్ సైజు సిగరెట్ వెలిగించాడు. కోపంగా వాళ్ళవంక చూశాడు.

"మీరందరూ గుడిసెల్లో జీవిస్తున్నారు. దమ్మిడీ ఆదాయం లేదు. మీకు నేను ట్రయినింగ్ యిచ్చి యీ పనిలోకి దింపాను. ప్రస్తుతం నెలకు 250 వస్తోంది. భవిష్యత్తులో యింకా ఎక్కువగా రావచ్చు. మీకు ప్రమాదం రాకుండా మీరు దొంగిలించిన వస్తువులను నేను వెంటనే తీసుకుపోతున్నాను - అయినా మీరు సంతోషించడం లేదు!" అరిచాడతను.

"గత మాసంలో మేం దొంగిలించిన వస్తువుల విలువ ఎంత వుంటుంది?" అడిగింది కమల.

"పన్నెండువేలు వుండొచ్చు?" అన్నాడతను.

"అదమ్మితే నీకు మూడువేలు మాత్రం వచ్చింది!" అంది కమల.

"గురవయ్యశెట్టి నీకు తక్కువిచ్చి నిన్ను మోసం చేస్తున్నాడు" అంది గాయత్రి.

"కనీసం సగం ధరకు నువ్వు అమ్మాలి" అంది హేమ.

"నేను ప్రయత్నించాను - గురవయ్యశెట్టి అంతకంటె యివ్వడు."

# 10

"ఇటుపైన అతడికి కమ్మొద్దు!" అంది గాయత్రి.

రాజాచంద్ర సిగరెట్ పొగ పీల్చి వదుల్తూ వుండి పోయాడు. గురవయ్యశెట్టికి తను అమ్మితీరాలి. తన పేరు, అడ్రస్ అతడికి తెలుసు. మరెవరికేనా అమ్మితే గురవయ్య శెట్టి తనని కష్టాల్లో యిరికించవచ్చు!

ఇదంతా అతడు వాళ్ళకు వివరంగా చెప్పాడు.

"తెగించి దొంగతనం చేసేవాళ్ళం గురవయ్యశెట్టికి భయపడాలా?" అంది గాయత్రి.

"దొంగసొత్తును కొనేవాళ్ళు యీ పట్నంలో ఎందరో వున్నారు. వాళ్ళు యింకా ఎక్కువ యిస్తారు" అంది కమల.

"నీకు తెలిసినవాళ్ళు ఎవరేనా వున్నారా?" అడిగాడతను.

"ఉమాపతి వున్నాడు. అతడు ఎక్కువగా ఇస్తాడు" అందామె.

"ఈసారి అతడిదగ్గర కెళ్తాను" అన్నాడు రాజాచంద్ర.

గదిలోని యువతులందరూ వెళ్ళిపోయారు. రాజాచంద్ర బ్రాందీ సేవిస్తూ ఆలోచిస్తూ కూర్చున్నాడు. తను వుమాపతి దగ్గరకు వెళ్ళేముందు ఒకసారి గురవయ్యశెట్టితో మాట్లాడ్డం మంచిదనిపించింది.

గదిలోకి వచ్చిన తల్లివంక అతను నవ్వుతూ చూశాడు

"బాబూ, ఎలావుంది నీ వ్యాపారం?" అడిగిందామె.

"జయప్రదంగా నడుస్తోంది" అన్నాడతను.

మంగమ్మ మంచి మనిషి. ఆమె భర్త స్కూల్ మాస్టర్ గా పనిచేస్తూ హృద్రోగంతో మరణించాడు. బి.ఎ.

చదువుతూ రాజాచంద్ర చదువు మానేశాడు. ఎక్కడా వుద్యోగం దొరక్క, పెక్కు సినిమాలు చూసి నేర్చుకున్న యీ దొంగజీవితంలోకి దిగాడు.

అతడేం చేస్తున్నాడో తల్లికి నిజం తెలియదు. డిటర్జెంట్ సోప్ పాకెట్లు పంపిణీ చేస్తున్నాడని ఆమె అనుకుంటోంది.

రాజాచంద్ర గదిలోంచి బయటకు కదిలాడు.

తన మోటర్ సైకిల్ని గురవయ్యశెట్టి యింటివైపు పోనిచ్చాడు.

## 4

హాల్లో ఫ్లోరసెంట్ లైట్ ప్రకాశవంతంగా వెల్గుతోంది. గురవయ్యశెట్టి కుర్చీలో కూర్చుని వున్నాడు.

"రాజా, కూర్చో!" అన్నాడతను.

అతడి కెదురుగా రాజాచంద్ర కూర్చున్నాడు. క్షణకాలం గదిలో నిశ్శబ్దంగా వుంది.

"మళ్ళావేమైనా తెచ్చావా?"

"లేదు."

"నేనెలావున్నానో చూడ్డానికి వచ్చావంటే నమ్మను!" అన్నాడు గురవయ్యశెట్టి.

"పనిమీదే వచ్చాను."

"ఏమిటది?"

"ఇటుపైన దొంగవస్తువులను మీ కమ్మను."

"నీ యిష్టం" అన్నాడు శెట్టి.

"వుమాపతి సగం ధర యిస్తానన్నాడు" అన్నాడు రాజాచంద్ర.

"నువ్వతడిని కల్సుకున్నావా?"

# 12

"నా మనుషులు కల్సుకున్నారు."

గురవయ్యశెట్టి అతడి వంక ఆశ్చర్యంగా చూశాడు.

"నువ్వొక్కడివే యిదంతా చేస్తున్నావని ఇంతవరకూ అనుకున్నాను. నీకు సహచరులున్నారని యిప్పుడే వింటున్నాను!"

"వుంటే పోయిందేమిటి?"

అతడివంక సూటిగా చూశాడు శెట్టి.

"ఈనాడు నీతో చెయ్యి కలిపినవాళ్ళు తర్వాత నీ గుండెలమీద గుద్దుతారు!"

"ఆ భయం లేదు నాకు. నన్నెవరూ ఎదిరించరు!"

"రాజా, నీ విశ్వాసం గొప్పది. దాన్నిగురించి నేను ప్రస్తుతం ఏమీ చెప్పను. కాని వుమాపతి గురించి చెప్తాను. అతడు సగం ధర యిస్తానని వస్తువులను తీసుకుంటాడు. చివరకి పదో వంతుకూడా యివ్వడు. నిన్ను బ్లాక్ మెయిల్ చేసి, భయపెట్టి చౌకగా వస్తువులను కొట్టేస్తాడు. అతడి దగ్గరకెళ్ళిన వాళ్ళెందరో నా దగ్గరకు తిరిగి వచ్చారు" అన్నాడు గురవయ్యశెట్టి.

గురవయ్యశెట్టి చెప్పింది నిజమేమో! కమలకు ఉమాపతి విషయం బాగా తెలియదేమో! కొంతసేపు రాజాచంద్ర ఆలోచిస్తూ వుండిపోయాడు.

"మీరు యింకా ఎక్కువగా యియ్యగలరా?"

గురవయ్యశెట్టి పక్కనున్న టీపాయ్ వైపు చూశాడు. ప్లేటులో ద్రాక్షపళ్ళు, ప్లమ్స్ వున్నాయి. పళ్ళను తింటూ కొంతసేపు వుండిపోయాడు.

"రాజా, నీ కింతవరకూ నాల్గోవంతు యిస్తున్నాను. ఇటుపైన నీకు మూడోవంతు యిస్తాను. అంతకంటె అధి

కంగా యివ్వలేను. పోలీసులకు నేను మామూళ్ళివ్వాలి. దొంగ వస్తువులు నేను కొంటానని వాళ్ళకి తెలుసు. ఇవ్వ వలసింది యివ్వకపోతే నా యింటిమీద రెయిడ్ చేసి వాళ్ళంతా పట్టుకుపోతారు."

రాజాచంద్ర ఆలోచిస్తూ వున్నాడు. ఉమాపతి పేరు ఎత్తగానే గురవయ్యశెట్టి తనిచ్చే మొత్తాన్ని యెక్కువ చేశాడు. బేరం ఆడితే యింకా హెచ్చిస్తాడేమో!

"మూడోవంతుకు నా మనుషులు ఒప్పుకోరు!"

"ఎంతకు ఒప్పుకుంటారు?"

"వాళ్ళకు సగం ధర కావాలి,"

గురవయ్యశెట్టి ఆలోచిస్తూ కళ్ళు మూసుకున్నాడు.

"నూరు రూపాయల విలువగల వస్తువులకు నలభై యిస్తాను. 40 పర్సెంట్. అంతకుపైన యివ్వను, యివ్వ లేను."

రాజాచంద్ర కుర్చీలోంచి లేచాడు. తన బేరం ఫలిం చింది. ఇప్పుడు తనకు ఎక్కువగా వస్తుంది. తనతో పని చేసేవాళ్ళు సంతోషిస్తారు.

"ఆల్ రైట్ సార్, ఆ విధంగా మీకు యిస్తాను," అని రాజాచంద్ర బయటకు వెళ్ళబోయాడు.

"రాజా!" పిల్చాడు గురవయ్యశెట్టి.

"నువ్వు మరెవ్వరికీ అమ్మలేవు! అమ్మితే నీ గురించి నేను పోలీసులకు చెప్తాను. నీమీద దాడిచేస్తారు!"

"నేను మరెవ్వరికీ అమ్మను" అన్నాడతను.

"అంత సులువుగా నన్ను వదలలేవు. అది గ్రహించు" అన్నాడు శెట్టి.

"తెలుసు" అని రాజాచంద్ర బయటకు పరుగెత్తాడు.

# 5

గాయత్రి, సుమతి రోడ్డమ్మట నడిచి ఒక యింటి ముందు ఆగారు. వీధి తలుపుమూసి వుంది. వాళ్ళు తలుపును తట్టారు.

వెంటనే తలుపు తెరవబడింది. గళ్ళలుంగీ, బనియన్ లో వున్న కన్నబాబు వాళ్ళవంక నవ్వుతూ చూశాడు. అతడి తలమీద వెంట్రుకలు లేవు. తిరపతి వెళ్ళి బోడిగుండు చేయించుకొచ్చాడు. అతడి వయస్సు యిరవై ఐదు దాటి వుంటుంది. ఆడపిల్లల్తో మాట్లాడే అనుభవం అతడికంతగా లేదు.

ఎదురుగా నిలబడిన యువతులను చూడగానే అతడి గుండె దడదడలాడింది.

"ప్లీస్, లోపలకు రండి" అన్నాడతను.

వాళ్ళిద్దరూ హాల్లోకి వెళ్ళారు. ఇంట్లో అతడు తప్ప ఎవ్వరూ లేరు. నాన్న ఆఫీసుకు వెళ్ళాడు. అమ్మ పిండి మరకు పోయింది.

"నేను మీకు ఏం చేయగలను?" అడిగాడతను, ఖంగారుగా.

గాయత్రిమీద అతడి చూపు కేంద్రీకృతమైంది. ఆమె వయస్సు పధ్దెనిమిది వుంటుంది. ఎర్రగా, బొద్దుగా వుంది. బిగువైన ఆమె స్తనాలు కొట్టొచ్చినట్లు పైకి కనిపిస్తున్నాయి, జాకెట్ లోంచి!

"మేం రఘు అండ్ కంపెనీ తరఫున వచ్చాం. ఈ డిటర్జెంట్ వాషింగ్ సోప్ పౌడర్ను అమ్ముతున్నాం. కిలో పాకెట్ ధర 10.50. మార్కెట్ లో యిది 12.50కి అమ్ముతున్నారు" అంది గాయత్రి.

"ఎన్ని కిలోలు నేను కొనాలి?" అన్నాడు కన్న బాబు.

"రెండు కిలోలు కొనండి" అంది సుమతి.

"రెండు నెలలుదాకా మీకు సరిపోతుంది" అంది గాయత్రి.

డబ్బు తేడానికి అతను లోపలకు వెళ్ళాడు. కన్న బాబు సదర్న పెయింట్స్ కంపెనీలో పనిచేస్తున్నాడు. నెలకు నాల్గువందలు జీతం వస్తుంది. తల్లికి మూడొందలిచ్చి వంద తన ఖర్చులకోసం వుంచుకుంటాడు.

అతడు తిరిగొచ్చేలోపల హాల్లోని వస్తువులను గాయత్రి తన బాగ్ లో పడేసుకొంది. అతడొచ్చి యిరవై ఒక్క రూపాయలు వాళ్ళకిచ్చాడు. రెండు పాకెట్లు తీసు కొన్నాడు.

అతడు గాయత్రి వంక ఆత్రంగా చూశాడు.

"మీరు తరచూ మా యింటికి వస్తూ వుండాలి" అన్నాడతను.

"వస్తాం లెండి" అంది గాయత్రి.

వాళ్ళిద్దర్నీ బయటకు సాగనంపి అతడు తలుపు మూశాడు. అతడికి చాలా ఆనందంగా వుంది. గాయత్రి ముఖం అతడికి జ్ఞప్తికొస్తోంది. ఆమె అతడి కళ్ళకు చాలా అందంగా కనిపించింది.

అతడు హాల్లోని కుర్చీలో కూర్చున్నాడు. అతడిచూపు టేబుల్ మీదకు వెళ్ళింది. కాసెట్ టేప్ రికార్డర్ ఏమైంది? అది టేబుల్ మీద వుండాలి! దానికోసం అతడు అన్నిచోట్లా వెతికాడు. కాని కాసెట్ ఎక్కడా కనపడ లేదు!

వాళ్ళిద్దరూ దాన్ని పట్టుకుపోయారా? అనుమానం అత

డిని పీడించింది. అతడు వెంటనే బయటకెళ్ళి తలుపు మూశాడు. రోడ్డమ్మట వేగంగా కదలసాగాడు.

వాళ్ళు ఎక్కువ దూరం వెళ్ళివుండరు. వాళ్ళను తను పట్టుకోవచ్చు! అతడు వీధి చివరదాకా నడిచాడు. ఆ యువతులిద్దరూ అతడికి ఎదురయ్యారు. అతడాగి వాళ్ళ వైపు చూశాడు. గాయత్రి అతడిని చూసి తీయగా నవ్వింది.

ఆమెను అనుమానిస్తున్నందుకు అతడు విచారించాడు.

"మా హాల్లోని టేబుల్ మీద కాసెట్ టేప్ రికార్డర్ వుండాలి. అది లేదు" అన్నాడతను.

గాయత్రి ప్రక్కనున్న సుమతివంక చూసింది.

"సుమతీ, మన బాగ్స్ ఆయనకు చూపించు!" అందామె ఉక్రోషంగా.

వాళ్ళ చేతుల్లో వున్న రెండు బాగ్‌లను తెరిచి చూపించారు. వాటిలో కాసెట్ లేదు. సోప్ పౌడర్ పాకెట్లు వున్నాయి.

"మిమ్మల్ని అనుమానించినందుకు నన్ను క్షమించండి! నాన్న కాసెట్‌ని పట్టుకెళ్ళి వుంటాడు" అని అతడు వెనక్కి తిరిగి వెళ్ళిపోయాడు.

అతడు కొంచెం దూరం వెళ్ళాక గాయత్రి సుమతి చెయ్యిని పట్టుకుని నవ్వింది.

# 6

ఎదురుగా కూర్చున్న ఆరుగురు యువతులవైపూ అతడు చూశాడు. "గత మాసంలో మనం దొంగిలించిన వస్తువుల విలువ పదిహేను వేలు వుంటుంది. గురవయ్యశెట్టి రేటు హెచ్చించి 40% యిచ్చాడు. మనకు ఆరువేలు వచ్చింది.

నా వాటా పోగా, మీకు మూడు వేలు పంచుతున్నాను. తలో ఐదువందలూ వస్తుంది" అన్నాడతను.

అందరి మొహాల్లోనూ సంతోషం కనిపిస్తోంది.

"వుమాపతి ఎక్కువిస్తాడని మీరన్నారు. కాని అతడు మంచి మనిషి కాడని విన్నాను!" అని అతడు కమల వంక చూశాడు.

"సగం ధర అతడు యిస్తాడని విన్నాను. అది నీకు చెప్పాను" అంది కమల.

"అతడితో నీకు పరిచయముందా?"

"లేదు."

"పరిచయంలేని వాడికంటె బాగా పరిచయమున్న గురవయ్యశెట్టినే మనం నమ్మొచ్చు. ఎన్ని నెలలనుంచో శెట్టి నా దగ్గర వస్తువులను కొంటున్నాడు. నేను శేరం చేయగానే రేటు పెంచాడు! అతడే త్వరలో మనకు సగం ధర యివ్వొచ్చు!" అన్నాడతను!

"ఇదే బాగుంటుంది" అంది హేమ.

గాయత్రి అతడివంక సీరియస్‌గా చూసింది.

"ఈ దొంగతనాలు యిదే విధానంలో యింకా ఎంత కాలం చెయ్యగలం? తన కాసెట్ టేప్ రికార్డర్ కనపడ్డం లేదని కన్నబాబు మా వెనకనే పరుగెత్తుకొచ్చాడు. అదృష్టవశాత్తూ కాసెట్‌ను అప్పటికే నీ కిచ్చేశాం. మా బాగ్స్ అతడికి ధైర్యంగా చూపించాం. దొంగిలించిన వస్తువులు నీకిచ్చే లోపల ఎవరేనా మా వెనక పడితే మేం చిక్కుకుపోతాం" అంది గాయత్రి.

"ఆ ప్రమాదం మీకు రాదు. మీరు బయటకొచ్చిన కాస్సేపటిదాకా వాళ్ళు కనుక్కోలేరు. ఈ లోపల నేను

అదే వీధి మలుపులో మీకోసం సిద్ధంగా వుంటాను. భయ పడకండి" అన్నాడతను.

గదిలో రెండు నిమిషాలపాటు నిశ్శబ్దంగా వుంది. రాజాచంద్ర సిగరెట్ వెలిగించి, పొగవదుల్తూ వాళ్ళ వంక చూశాడు.

"మిమ్మల్ని అనేక ప్రదేశాల్లో నేను తిప్పుతున్నాను. అందువలన ఎవ్వరూ మిమ్మల్ని అనుమానించే అవకాశం లేదు."

అతడు వాళ్ళకు డబ్బిచ్చాడు. అందరూ సంతోషంగా డబ్బును అందుకున్నారు. సుమతి అతడివైపు నవ్వుతూ చూసింది.

"ఇటుపైన నేను యీ పనికి రాను" అందామె.

"ఎందువలన?"

"రాజారామ్ అనే యువకుడితో నాకు పరిచయమైంది. మేం యిద్దరం ప్రేమించుకొంటున్నాం. ఈ వారంలో మా పెళ్ళి జరగబోతోంది."

"గుడ్ న్యూస్, సంతోషం. రాజారామ్ నీకెలా తటస్థపడ్డాడు?" అడిగాడు రాజాచంద్ర.

"అతడింటికి మేం వెళ్ళాం. అతడి యింట్లోంచి రెండు వాచీలను కొట్టేశాం. తర్వాత మేం కల్సుకున్నాం. అతడు నన్ను గుర్తుపట్టాడు. నన్ను హోటల్స్‌కీ, బీచ్‌కీ తీసుకు వెళ్ళేవాడు. ఆ విధంగా మా ప్రేమ పెరిగింది" అంది సుమతి.

రాజాచంద్ర ఆమెవంక సూటిగా చూశాడు.

"అతడికి మా గురించి నువ్వు చెప్పొచ్చు!"

"ప్రాణం పోయినా చెప్పను" అందామె.

"నేను నమ్మలేను. నువ్వేలాగూ వెళ్ళిపోతున్నావు. నీ కిచ్చిన ఏదువందలు నాకు వాపసు చేయి. అతి తతిమా వాళ్ళకు పంచేస్తాను. భర్త దొరికినందుకు నువ్వు తృప్తి పడు!"

ఆమె తృళ్ళిపడింది.

"గత మాసంలో నేనూ పనిచేశాను. ఈ డబ్బు నాది" అందామె.

"మాతో వుంటే నీదే? మమ్మల్ని వదిలేస్తే నీది కాదు!" అన్నాడతను గంభీరంగా.

క్షణకాలం సుమతి ఆలోచిస్తూ వుండిపోయింది.

"నేను మిమ్మల్ని వదలను. పెళ్ళయినాక కూడా యీ పని చేస్తాను" అందామె.

"నీ భర్తకు యిదంతా చెప్పకూడదు!"

"చెప్పను" అందామె.

"చెప్తే నువ్వు ప్రమాదంలో పడ్తావు" హెచ్చరించాడతను, ఆమెవైపు భయంకరంగా చూస్తూ.

## 7

ఇన్‌స్పెక్టర్ శింగ్ వయస్సు ముప్ఫయి దాటింది. చాలా వుషారైన వ్యక్తి. పోలీస్ జీప్‌లోంచి దిగి అతడు లోపలకు వెళ్ళాడు. ముగ్గురు కానిస్టేబుల్సు జీప్ దగ్గర నిలబడ్డారు.

కమలాకర్ నవ్వుతూ యిన్‌స్పెక్టర్ని కూర్చోమన్నాడు.

"ఏమైందో చెప్పండి" అన్నాడు యిన్‌స్పెక్టర్ శింగ్.

కమలాకర్ వయస్సు నలభై దాటింది. అతడుకూర్చున్న కుర్చీ వెనక భార్య మధుమతి నిలబడి వుంది. కమలాకర్ ఐ.సి.ఎఫ్.లో వుద్యోగం చేస్తున్నాడు.

"నిన్న నేనూ, నా భార్యా మేటనీకి వెళ్ళాం. ఇంట్లో మా అమ్మా, యిద్దరు పిల్లలూ వున్నారు. ఆ టేబుల్ మీదరికో మిక్సర్ వుండాలి. అది మాయమైంది" అన్నాడు కమలాకర్.

"ఇంట్లో దానికోసం వెతికి చూశారా?" అడిగాడు శింగ్.

"అన్నిచోట్లా వెతికిచూశాం. ఎక్కడా లేదు. మేం ఎవ్వరికీ యివ్వలేదు" అన్నాడతను.

"మీరు నిన్నే ఎందుకు మాకు రిపోర్టివ్వలేదు?"

"మేం తిరిగొచ్చేసరికి ఎనిమిది దాటింది. తిండి తిని పడుకున్నాం. మిక్సర్ మాయమైనట్లు యివాళ పొద్దుటే కనుక్కున్నాం. వెంటనే మీకు ఫోన్ చేశాను, పక్కింటి లోంచి" అన్నాడతను.

"మీ అమ్మగార్ని యిలా రమ్మనండి!"

కమలాకర్ లోపలకు వెళ్ళలేదు. వెనకనున్న భార్యవైపు చూశాడు. ఆమె లోపలకు వెళ్ళి కాస్సేపట్లో ఒక వృద్ధురాలితో తిరిగి హాల్లోకొచ్చింది.

ఇన్స్పెక్టర్ శింగ్ ఆమె వంక పరీక్షగా చూశాడు. ఆమె వయస్సు అరవైపైన వుంటుంది. తెల్లచీర, రవిక వేసుకొంది. కళ్ళజోడును ధరించింది.

"మీరు ఇంట్లో వుండగా నిన్న ఎవరైనా వచ్చారా?"

"రాలేదండి" అందామె.

"టేబుల్ మీదున్న మిక్సర్ని మీరు చూశారా?"

"నేను చూశాను" అందామె.

"ఎవ్వరూ తీయకుండా అదెలా కదుల్తుంది? జ్ఞాపకం తెచ్చుకోండి. ఎవరెవరు యింటికొచ్చారో చెప్పండి" అన్నాడు యిన్స్పెక్టర్.

ఆమె కాస్సేపు ఆలోచిస్తూ కుర్చీలో కూర్చుంది.

"మూడింటికి పాలపాకెట్ తెచ్చి పనిమనిషి యిచ్చి వెళ్ళిపోయింది. తర్వాత బాబీ వచ్చి అబ్బిగాడిని ఆటకు తీసుకుపోయాడు. ఇంట్లో నేనూ, రమా వున్నాం" అందామె.

"అబ్బిగాడు మా పెద్దబ్బాయి" చెప్పాడు కమలాకర్.

"రమా నిద్రపోతోంది. అప్పుడు యిద్దరు యువతులు వచ్చారు. వాషింగ్ సోప్ పౌడరు అమ్ముతున్నారు వాళ్లు, ప్రతి యింటికీ వెళ్ళి."

"మీరు కొన్నారా?"

"వాళ్ళను చూస్తే నాకు జాలివేసింది. కిలో పాకెట్ కొన్నాను. వాళ్ళకు 10.50 యిచ్చాను. వాళ్ళు వెళ్ళిపోయారు. తర్వాత మరెవ్వరూ రాలేదు" అందామె.

"ఆ యువతులు యిక్కడ ఎంతసేపు వున్నారు?"

"ఇలా వచ్చి అలా వెళ్ళిపోయారు! వాళ్ళకు మంచినీళ్ళు యిచ్చాను. తాగి, నేనిచ్చిన డబ్బు తీసుకొని, నాకు నమస్కరించి వెళ్ళారు" అందామె.

"వాళ్ళు వెళ్ళిపోయాక మిక్సర్ టేబుల్ మీద వుందా?"

"నేను చూడలేదండి" అందామె.

"మీరు కొన్న పాకెట్ నాకు చూపించండి" అన్నాడు యిన్స్పెక్టర్ శింగ్.

మధుమతి లోపలకు వెళ్ళింది. ఒక పాకెట్‌ను తెచ్చి అతడికిచ్చింది. పోలీథీన్ పాకెట్‌లో వాషింగ్ పౌడరు వుంది. పాకెట్ మీద ముద్రించిన పేర్లను యిన్స్పెక్టర్ శింగ్ జాగ్రత్తగా చూశాడు.

"వైట్ ఫోమ్ డిటర్జెంట్ వాషింగ్ పౌడరు, మాన్ ఫాక్చర్డ్ బై రఘురామ్ అండ్ కంపెనీ, సోల్ డిస్ట్రిబ్యూటర్స్ రఘు అండ్ కంపెనీ" అని పాకెట్ మీద ముద్రించి వుంది.

ఇన్‌స్పెక్టర్ శింగ్ ఆ కంపెనీల పేర్లను తన డైరీలో రాసుకున్నాడు.

"ఆ యువతులు మీతో ఏం చెప్పారు?"

"ఆ కంపెనీ తరఫున పని చేస్తున్నామన్నారు. సోప్ పౌడరు పాకెట్ చూపించారు. దయదల్చి ఒక పాకెట్ కొన్నాను" అందామె.

"మీరు మంచినీళ్ళు తేడానికి వెళ్ళినప్పుడు వాళ్ళిద్దరూ యీ గదిలో వున్నారా?"

"ఈ హాల్లోవాళ్ళు కూర్చున్నారు. చెంబుతో నేను తెచ్చిన నీళ్ళను పూర్తిగా తాగేశారు. పాపం, యెంత దాహమో! ఆ వయస్సులో వున్న ఆడపిల్లలకు మా కాలంలో పెళ్ళిళ్ళు అయిపోయేవి. రోజులు మారాయి. ఇప్పుడు వాళ్ళు సోప్ పౌడరు అమ్ముతూ వీధులమ్మట తిరుగుతున్నారు," అందామె.

"మీరు వెళ్ళి విశ్రాంతి తీసుకోండి" అన్నాడు యిన్‌స్పెక్టర్.

ఆమె మధుమతితో లోపలకు వెళ్ళిపోయింది. ఇన్‌స్పెక్టర్ శింగ్ కమలాకర్ వంక చూశాడు.

"మీరు మాకు రిపోర్టు రాసి యివ్వండి. మేం దర్యాప్తు చేస్తాం."

కమలాకర్ వివరంగా రిపోర్టురాసి యిన్‌స్పెక్టర్‌కి యిచ్చాడు.

రిపోర్టును తీసుకుని ఇన్‌స్పెక్టర్ శింగ్ జీప్‌లో కూర్చు న్నాడు. పది నిమిషాల్లో జీప్ పోలీస్ స్టేషన్‌కు చేరు కుంది.

ఇన్‌స్పెక్టర్ శింగ్ తన కుర్చీలో క్షణకాలం కూర్చు న్నాడు. అతడి మెదడులో ఆలోచనలు సాగుతున్నాయి. టెలిఫోన్ డైరెక్టరీ చూసి అతడు రఘు అండ్ కంపెనీ నెంబర్ని రాసుకున్నాడు. ఆ నెంబర్కి ఫోన్ చేశాడు.

"రఘు అండ్ కంపెనీ" అందొక స్త్రీ కంఠం అటు వైపు నుంచి.

"ఇన్‌స్పెక్టర్ శింగ్ హియర్! మీ కంపెనీ యజ మానితో మాట్లాడాలి!" అన్నాడతను.

"హోల్డాన్ సార్" అందామె.

కాస్సేపట్లో ఒక పురుషకంఠం అటువైపునుంచి విన పడింది. "ఐయామ్ జయరామ్, యీ కంపెనీ యజ మానిని" అన్నాడతను.

"మిస్టర్ జయరామ్, వైట్ ఫోమ్ డిటర్జెంట్ వాషింగ్ సోప్ పౌడరు మీరు అమ్ముతున్నారా?"

"అమ్ముతున్నాం, సార్."

"యువతులను వీధులమ్మట పంపించి అమ్ముతున్నారా" జయరామ్ ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

"మా తరఫున ఏ యువతులూ వీధులమ్మట తిరగటం లేదు. మేం షాపులకు విక్రయిస్తున్నాం," అన్నాడతను.

"ఏ యువతులూ మీ కంపెనీ తరఫున పనిచేయడం లేదా?"

"లేదు సార్."

"మానుఫాక్చరర్ రఘురామ్ అండ్ కంపెనీ యువ తులను పంపుతుందేమో?"

"నో సార్. కర్ణాటకా, కేరళా, తమిల్ నాడ్, ఆంధ్రాలకు మేము పంపిణీదార్లం. ఈ రాష్ట్రాల్లో మే మే అమ్మాలి. మాకు తెలియకుండా యేమీ జరగదు," అన్నాడు జయరామ్.

"మిస్టర్ జయరామ్, మీ ప్రోడక్ట్ని ఈ పట్నంలో యువతులు వీథులమ్మట తిరిగి అమ్ముతున్నారు. మీ కంపెనీ తరఫున పని చేస్తున్నామని వాళ్ళు చెప్తున్నారు" అన్నాడు ఇన్స్పెక్టర్.

"మా దేశ్ళ క్రితం అలా మేం అమ్మించాం. మా వాషింగ్ సోప్ పౌడర్ కి చాలా డిమాండ్ ఏర్పడింది. ప్రస్తుతం మేం అలా చెయ్యడం లేదు."

"థాంక్స్," అని శింగ్ రిసీవర్ని పెట్టేశాడు.

కుర్చీలో వెనక్కి వాలి ఆలోచిస్తూ శింగ్ సిగరెట్ వెలిగించాడు. ఒక విషయం తేట తెల్లగా తెలుస్తోంది. రఘు అండ్ కంపెనీ యువతుల చేత యీ వాషింగ్ పౌడర్ని అమ్మించడం లేదు!

అయితే యీ వాషింగ్ పౌడర్ని ఎవరు అమ్ముతున్నారు? వాషింగ్ పౌడర్ని అమ్ముతున్నట్లు నటిస్తూ వాళ్ళు దొంగతనాలు చేస్తున్నారా? వాళ్ళకు వాషింగ్ పౌడర్ అమ్మటం ప్రధానం కాకపోవచ్చు! ఏదో అమ్ముతున్నట్లు నటిస్తేగాని వాళ్ళు యిళ్ళలోకి వెళ్ళలేరు. ఇన్స్పెక్టర్ శింగ్ చాలాసేపు ఆలోచిస్తూ వుండిపోయాడు.

అరగంట తర్వాత అతడు మేలుకొన్నాడు, తన ఆలోచనల్లోంచి. ఇప్పుడతనికంతా అర్థమయింది. తను తెలివిగా వాళ్ళను వలలో యిరికించి పట్టుకోవాలి!

అతడు పోలీస్ హెడ్క్వార్టర్స్కు ఫోన్ చేశాడు.

ఇటువంటి దొంగతనాలు మరేమైనా జరిగేయేమో అతడు తెల్సుకోవాలి!

## 8

రాజాచంద్ర యిచ్చిన వస్తువులను గురవయ్యశెట్టి చూశాడు.

"వీటి విలువ రెండు వేలుంటుంది. కాని ప్రస్తుతము నేను కొనలేను," అన్నాడతను.

రాజాచంద్రలో గాభరా పుట్టుకొచ్చింది. ఇన్ని వస్తువులనూ రహస్యంగా మరోచోటుకు మోసుకెళ్ళాలి. సాధారణంగా దొంగిలించిన వస్తువులను అమ్మేటప్పుడే దొంగ పట్టుబడ్తాడు!

"ఇంత హఠాత్తుగా కొనసంటే ఎలాగ? నేను ఎక్కడికెళ్తాను."

గురవయ్యశెట్టి టీపాయిమీదున్న ప్లేటులోని ద్రాక్షపళ్ళను తింటూ అతడివంక చూశాడు.

"దొంగ వస్తువులను కొనడం ప్రమాదంతో కూడినదని నీకు యింతకుముందే చెప్పాను. ఇన్‌స్పెక్టర్ శింగ్ నా దగ్గర కొచ్చాడు. రికో మిక్సర్ని ఎవరో దొంగిలించినట్లు రిపోర్టు వచ్చిందట. రికోమిక్సర్ రెండురోజులక్రితం నువ్వు నా కమ్మావు. గుర్తుందా?"

అతడు తలాడించాడు.

"పోలీసులు నీ కోసం వెతుకుతున్నారు. వాళ్ళ కళ్ళు నీమీద పడ్డాక నువ్వమ్మే వస్తువుల్ని ఎవ్వరూ కొనరు!"

రాజాచంద్ర ఆలోచించ సాగాడు. ఇన్‌స్పెక్టర్ శింగ్ ఏం తెల్సుకున్నాడో కనుక్కోడం మంచిది.

"ఇన్స్పెక్టర్ శింగ్ ఎంతవరకు మా గురించి తెల్సు

కున్నాడు?"

"మీకు దగ్గరవుతున్నాడు. రేపో, మాపో అతడు నీకు ఎదురవ్వొచ్చు."

రాజాచంద్ర వులిక్కిపడ్డాడు. ఇంతవరకూ అంతా జయప్రదంగా సాగిపోతూంది. పట్టుబడనంతకాలం నేరస్తులు సుఖంగా జీవిస్తారు. పట్టుబడే స్థితి వచ్చేసరికి అల్లల్లాడి పోతారు!

రాజాచంద్ర బ్రతిమాలుతున్నట్లు అతడివైపు చూశాడు.

"ఈ ఒక్కసారి తెచ్చినవి కొనండి. ఇటుపైన రాను."

"మునుపటి రేటు ఇవ్వలేను."

"ఎంతిస్తారు?"

"పదోవంతు. నువ్వు యింటికి తెచ్చావని కొంటున్నాను. ఆ రేటు నీకు సమ్మతమైతే చెప్పు!"

తను తెచ్చిన వస్తువులను తీసుకొని బయటకు వెళ్ళే ధైర్యం లేదతనికి. ఇన్‌స్పెక్టర్ శింగ్ మనుషులు ఎక్కడేనా దాక్కొని వుండొచ్చు, తనకోసం!

"ఇవ్వండి" అన్నాడతను.

గురవయ్యశెట్టి గెండువందలు అతడికిచ్చాడు.

"ఈసారికి యిలా పోనీ! పరిస్థితులు విషమించాయి. ఈ దొంగతనాలు ఎలా చేస్తున్నారో, నీకు సహచరులు ఎందరున్నారో నాకు తెలియదు. ఇటుపైన నువ్వు చాలా జాగ్రత్తగా వుండాలి. ఇక్కడికొచ్చిన యిన్‌స్పెక్టర్ శింగ్‌ని బయటకు పంపేసరికి తలప్రాణం తోక్కి వచ్చింది."

"నేను యిక్కడ అమ్ముతున్నానని అతడికి తెల్సా?"

"తెలియదు, దొంగ వస్తువులు నేను కొంటానని

మార్కెట్‌లో పేరుందిగా! పెద్ద పెట్టున దొంగతనాలు జరిగుతే నా దగ్గరకువచ్చి దర్యాప్తు చేస్తారు. వాళ్ళకు నా దగ్గర ఏ వస్తువులూ దొరకవు! వాళ్ళ కళ్ళల్లో కారం ఎలా కొట్టాలో నాకు తెలుసు" అన్నాడు శెట్టి.

రాజాచంద్ర గాభరాగా లేచాడు.

"నేను వెళ్తానండి."

"కొంతకాలం పోయాక పరిస్థితులు మారవచ్చు. నువ్వు యిప్పటిలాగే వచ్చి నన్ను చూడు. సమయం మంచిదైతే నీకు ఎక్కువరేటు నేను యివ్వొచ్చు" అన్నాడతను.

"చూస్తాను," అని రాజాచంద్ర బయటకు నడిచాడు.

తన మోటర్ సైకిల్ పక్కన నిలబడి నలువైపులా చూశాడు. రోడ్డమ్మట ఎవరెవరో వెళుతున్నారు. వాళ్ళలో ఎవరయినా యిన్‌స్పెక్టర్ శింగ్ మనుషులు కావచ్చు. అతడి గుండె వేగంగా కొట్టుకుంటోంది.

అతడు మోటర్ సైకిల్‌ని శరవేగంగా పోనిచ్చాడు.

## 9

రాజాచంద్ర బాగా బ్రాందీ సేవించి నిషాలో వున్నాడు. సిగరెట్ పీలుస్తూ వాళ్ళవంక చూశాడు. ఎదురుగా ఐదుగురు యువతులే వున్నారు.

"సుమతి రాలేదు!" అన్నాడతను.

"గతవారం రోజులుగా ఆమె రావటం లేదుగా!" అంది కమల.

"మనతో అబద్ధం చెప్పి తన వాటాకురావల్సిన డబ్బును పట్టుకుపోయింది. నన్ను మోసగించిన వాళ్ళను నేను మన్నించను!" అర్చాడతను.

అందరూ మౌనంగా వుండిపోయారు. రాజాచంద్ర

కళ్ళు ఎర్రగా వున్నాయి. ఈనాడు అతడినిచూస్తే అందరికీ భయంగా వుంది.

అతడు వాళ్ళవంక సూటిగా చూశాడు.

"మీకు నేను ప్రస్తుతం యెక్కువగా యివ్వలేను. ఈ మధ్య మనం దొంగిలించిన వస్తువులకు నాకు వెయ్యిరూపాయలు మాత్రం వచ్చింది. నా వాటాపోతే మీకు తలొక వందా వస్తుంది."

గాయత్రి గాయపడిన పులిలా లేచింది.

"వందరూపాయలా?" అర్చిందామె.

ఆమెవైపు అతడు సూటిగా చూశాడు.

"మనం చేసిన దొంగతనాల్ని గురించి పోలీసు రిపోర్టులివ్వబడ్డాయి. ఇన్‌స్పెక్టర్ శింగ్ దర్యాప్తు చేస్తున్నాడు. గురవయ్యశెట్టి యింటిమీదకు అతడు దాడిచేశాడు. నేను పట్టుకెళ్ళిన వస్తువులను అతడు కొననన్నాడు. అతడిని బ్రతిమాలి చివరికి కొనిపించాను. పదోవంతు యిచ్చాడు. చాలా తక్కువని నాకు తెలుసు. మరేం గత్యంతరం లేక యిచ్చింది తీసుకుని తిరిగి వచ్చాను," అన్నాడు రాజాచంద్ర.

"నీతో పని చెయ్యడం యిటుపైన వుపయోగపడదు!" అంది కమల.

"మీరందరూ నన్ను వదిలేస్తారా?" ప్రశ్నించాడతను.

"ఫలితం లేనప్పుడు పని చేయడం దేనికి?" గాయత్రి అంది.

రాజాచంద్ర గ్లాసులో బ్రాందీ పోసుకుని హాట్‌గా తాగేశాడు. మరో సిగరెట్ వెలిగించాడు.

"మీరు నన్ను వదలొద్దు. త్వరలో పరిస్థితులు బాగుపడ్తాయి."

"మేం ధనవంతులం కాము. అందుకే తెగించి నీతో పనిచేస్తున్నాం. పోలీసులకు మేం దొరికిపోవచ్చని ఒక వైపునుంచి భయం మమ్మల్ని పీడిస్తున్నా, మా ధైర్యాన్ని మేం కోల్పోలేదు. ఇన్‌స్పెక్టర్ రంగంలోకి దిగాడని విన్నాక మాకు భయంగా వుంది" అంది విమల.

తను తాగిన బ్రాందీ అతడికి ధైర్యాన్నిచ్చింది. తనతో పనిచేసే యువతులు భయపడకుండా చూడాలి! వాళ్ళు వుంటేగాని యీ దొంగతనాలను తను చేయించలేడు. వాళ్ళు తన్ని వదిలేస్తే తనకు ఆదాయం వుండదు.

"మీరు భయపడకండి. నేను గురవయ్యశెట్టితో మాట్లాడాను. అతనికి పోలీసు వాళ్ళందరూ తెలుసు. అతడు ఇన్‌స్పెక్టర్ శింగ్‌ను లొంగదీస్తాను అన్నాడు. ఇన్‌స్పెక్టర్ శింగ్ మన్ని ఏమీ చెయ్యడు. అతడికి ఇయ్యవలసింది గురవయ్యశెట్టి యిస్తాడు. మనపనికి భంగం కలగదు!"

"అలా అయితే ఫర్వాలేదు," అంది హేమ.

"కాని మనం చేసేదానిలో కొన్ని మార్పులను నేను తీసుకొస్తున్నాను. ఇటుపైన డిటర్జెంట్ సోప్ పౌడర్ మీరు అమ్మరు. తిలక్ అండ్ కంపెనీవారు వక్కపొడిని తయారు చేస్తున్నారు. ఇటుపైన మీరు వక్కపొడుంని అమ్మాలి. పోలీసులు డిటర్జెంట్ సోప్ పౌడర్ పాకెట్లు అమ్మేవాళ్ళకోసం చూస్తూవుంటారు. వక్కపొడుం అమ్మే వాళ్ళను వాళ్ళు పట్టుకోరు. ఆ కంపెనీవాళ్ళు యువతుల చేత వక్కపొడుం పాకెట్లు అమ్మిస్తోన్నారు. అది మనకు ఉపయోగపడుతుంది. ఎలావుంది నా ఐడియా?"

"ఫైన్," అంది కమల.

"మరొకటి. ఇంతవరకూ మీరు అమ్మిన ప్రదేశాలకు ఇప్పుడు మీరు వెళ్ళరు. వేరే ప్రదేశాలకు మిమ్మల్ని పంపిస్తాను."

"నువ్వేం చెప్పినా మేం చేస్తాం. మాకు ప్రమాదం రాకుండా నువ్వు చూడాలి," అంది కమల.

"మీకు భయంలేదు. నేనున్నానుగా!" అన్నాడతను బ్రాందీ నిషాలో.

# 10

పోలీస్ డిపార్టుమెంటులో ఇన్‌స్పెక్టర్ శింగ్ చాలా తెలివైన యువకుడు. దేశం బాగా క్షేమంగా వుండాలని అతడి ఆశయం. డబ్బుకు లొంగేమనిషి కాడతను.

వైట్‌ఫోమ్ డిటర్జెంట్ వాషింగ్ సోప్ పౌడర్ పాకెట్లు అమ్మిన ప్రదేశాల్లో తిరగమని కొందరు మనుషులను అతడు నియమించాడు.

రోజల్లా అతడు తన కుర్చీలో కూర్చునే వుంటున్నాడు. తన మనుషులు అతడికి రిపోర్టులు పంపుతున్నారు. తను అనుకొన్న విధంగా ఏమీ జరగటంలేదు.

టెలిఫోన్ మ్రోగింది. అతడు రిసీవర్ని ఎత్తాడు.

"ఇన్‌స్పెక్టర్ శింగ్," అన్నాడతను.

"ముకుంద్ రిపోర్టింగ్ సార్."

"చెప్పు."

"ఈ ప్రదేశంలో డిటర్జెంట్ సోప్ పాకెట్లు అమ్మేవాళ్ళు నాకు కనిపించలేదు. ఇద్దరు యువతులు వక్కపొడుం పాకెట్లు అమ్ముతున్నారు."

ఇన్‌స్పెక్టర్ శింగ్ కుర్చీలోంచి తృళ్ళిపడ్డాడు.

"మిస్టర్ ముకుంద్! వక్కపొడుం పాకెట్లను అమ్మే

వాళ్ళను వెంటాడు" అన్నాడతను.

"అలాగే, సార్" అన్నాడు ముకుంద్.

ఇన్‌స్పెక్టర్ శింగ్ కుర్చీలో వెనక్కి వాలి సిగరెట్ వెలిగించాడు. డిటర్జెంట్ సోప్ పాకెట్లు అమ్మేవాళ్ళ కోసం తను అన్వేషిస్తున్నట్లు వాళ్ళకు తెలిసి వుండొచ్చు. దొంగలముఠా ఇప్పుడు వక్కపొడుం పాకెట్లు అమ్ముతూ వుండొచ్చు!"

దొంగతనం చేసేవాళ్ళు పోలీసులు ఎలా వ్యవహరిస్తున్నదీ కనుక్కుంటారు. పోలీసులకు దొరకకుండా వుండేందుకు వాళ్ళ పద్ధతులను మార్చుకుంటారు! ఇన్‌స్పెక్టర్ శింగ్ జీవితంలో యిటువంటివి ఎన్నో చూశాడు.

ఒంటిగంట ప్రాంతంలో మళ్ళీ టెలిఫోన్ మోగింది. అతడు రిసీవర్ని యెత్తాడు.

"హలో, ఇన్‌స్పెక్టర్ శింగ్" అన్నాడతను.

"ముకుంద్, సార్," అంది అటువైపు కంఠం.

"చెప్పు!"

"ఇద్దరు యువతులను నేను ఆపుచేసి యిక్కడ వుంచాను. రాజా మెడికల్ స్టోర్స్, రామయ్యర్ వీధిలో నేను వున్నాను. మీరు వెంటనే యిక్కడకు రండి."

"వస్తున్నాను," అన్నాడు ఇన్‌స్పెక్టర్ శింగ్.

## 11

రాజా మెడికల్ స్టోర్స్ ముందు పోలీస్ జీప్ ఆగింది. ముకుంద్ షాపు బయట నిలబడి వున్నాడు. అతడి కెదురుగా కమల, విమల వున్నారు.

జీప్‌లోంచి దిగి ఇన్‌స్పెక్టర్ శింగ్ వాళ్ళ దగ్గరకు నడిచాడు. ఇద్దరు యువతులూ గాభరాగా అతడివైపు

చూశాడు.

"ఇన్‌స్పెక్టర్ గారూ, యిది అన్యాయం. పొట్టకోసం గోడమ్మట తిరిగి మేం వక్క-పొడుం పాకెట్లు అమ్ముకొంటుంటే, మమ్మల్నిలా ఆపి మా నోట్లో మట్టి కొట్టడం అన్యాయం" అరిచింది కమల.

"మీరు కంగారుపడకండి. మిమ్మల్ని వదలేస్తాం" అని యిన్‌స్పెక్టర్ శింగ్ ముకుంద్‌తో కొంచెం దూరంగా జరిగాడు.

ముకుంద్ వైపు అతడు చూశాడు.

"నువ్వు యీ ప్రదేశాని కెందుకొచ్చావు?" ప్రశ్నించాడు.

"మీరు నన్ను తిరగమన్న ప్రదేశాల్లో ఎవ్వరూ కనపడలేదు. అందుకని యిలా వచ్చాను" అన్నాడు ముకుంద్.

"వాళ్ళ బ్యాగ్‌లో ఏవేనా వస్తువులున్నాయా?"

"బాగ్స్‌లో వక్క-పొడుం పాకెట్లు తప్ప మరేమీ లేవు."

ఇన్‌స్పెక్టర్ ఆలోచిస్తూ క్షణకాలం వుండిపోయాడు.

"ముకుంద్, వాళ్ళ బాగ్స్‌లో వున్న ఒక పాకెట్ ఇలా పట్రా."

ముకుంద్ వాళ్ళ దగ్గరకు వెళ్ళి పాకెట్‌తో తిరిగి వచ్చాడు.

పాకెట్‌ను యిన్‌స్పెక్టర్ పరీక్షించాడు. తిలక్ అండ్ కంపెనీ వక్క-పొడాన్ని తయారుచేస్తోంది. ఇన్‌స్పెక్టర్ పాకెట్‌ను యిచ్చేశాడు.

"ముకుంద్, వాళ్ళతో నువ్వు మాట్లాడుతూ వుండు!" అని అతడు పెద్ద అంగట్లో రాజా మెడికల్ స్టోర్స్ లోపలకు వెళ్ళాడు.

టెలిఫోన్ డైరక్టరీ చూసి తిలక్ అండ్ కంపెనీ నంబర్ను డయల్ చేశాడు.

"తిలక్ అండ్ కంపెనీ, సార్" అందో కంఠం అటువైపునుంచి.

"ఇన్స్పెక్టర్ శింగ్ స్పీకింగ్, మీ యజమానితో మాట్లాడాలి?"

"వుండండి."

అటువైపునుంచి ఒక స్త్రీ కంఠం వినపడింది.

"హలో సార్, నా పేరు రాజమ్మ. ఈ కంపెనీ నాదే."

"యువతులను వీధులమ్మట తిప్పి మీరు వక్కపొడుం పాకెట్లు అమ్మిస్తున్నారా?"

"అమ్మిస్తున్నాం సార్. మాది కొత్త కంపెనీ. అలా ప్రచారం చేస్తేగాని మా వక్కపొడుం పాప్యులర్ కాదు."

"ఎంతమంది యువతులు పని చేస్తున్నారు?"

"ఇరవైమంది. వాళ్ళందరికీ అమ్మకాన్ని బట్టి కమీషన్ యిస్తాం."

ఇన్స్పెక్టర్ శింగ్ ఆలోచిస్తూ వుండిపోయాడు. ఆమెను క్షణం వుండమని అతడు బయటకు పరుగెత్తాడు. ఆ యువతులతో మాట్లాడివెళ్ళి రిసీవర్ని అందుకున్నాడు.

"మీ తరఫున పనిచేసే వందమందిలో కమల, విమల వున్నారా?" అడిగాడతను.

"కాస్సేపాగండి, లిస్టుచూసి చెప్తాను" అందామె.

"ఆ పేర్లతో ఎవ్వరూ లేరు!" అందామె, కొంత సేపయ్యాక.

"థాంక్స్" అని యిన్‌స్పెక్టర్ శింగ్ రిసీవర్ని పెట్టేశాడు.

టేబుల్ మీద యాభై పైసలు పడేశాడు.

"ఫోన్ కాల్‌కి డబ్బు వద్దుసార్" అన్నాడు షాపు యజమాని.

"డబ్బివ్వకుండా నేను ఎన్నడూ ఫోన్ చేయను" అని యిన్‌స్పెక్టర్ శింగ్ బయటకు నడిచాడు.

వాళ్ళిద్దరి దగ్గరకూ వెళ్ళాడు శింగ్.

"జీప్‌లో కూర్చోండి" అన్నాడతను.

గుండెదడతో వాళ్ళు జీప్‌లో కూర్చున్నారు. జీప్ కదిలింది.

ఇన్‌స్పెక్టర్ శింగ్ వాళ్ళవంక చూశాడు.

"మీరు ఎవరి తరఫున వక్కపొడుం పాకెట్లు అమ్ముతున్నారు?"

"తిలక్ అండ్ కంపెనీ" అంది కమల.

"ఆ కంపెనీకిఫోన్ చేసి మాట్లాడాను"అన్నాడుశింగ్.

కమల వులిక్కిపడింది. విమల భయంతో అర్చింది.

"ఇంతకు ముందు డిటర్జెంట్ సోప్ పౌడరు పాకెట్లు అమ్మేవారా?"

"లేదు సార్. మేం వక్కపొడుం అమ్ముతున్నాం" అంది కమల.

జీప్ డ్రయివర్తో ఏదో చెప్పాడు యిన్‌స్పెక్టర్. కాస్సేపట్లో కమలాకర్ యింటిముందు జీప్ ఆగింది.

వీధి తలుపు తెరిచే వుంది. మధుమతి గుమ్మంలో నిలబడి వుంది.

"సుబ్బాయమ్మగార్ని ఒకసారి బయటకు రమ్మనండి!" అన్నాడు శింగ్.

మధుమతి లోపలకు వెళ్ళింది. సుబ్బాయమ్మతో ఆమె తిరిగి వచ్చింది.

"జీప్‌లో వున్న ఆ యువతులవైపు చూడండి!" అన్నాడు శింగ్.

కొంచెం ముందుకెళ్ళి సుబ్బాయమ్మ యువతుల వంక చూసింది. "దొంగముండలు, వాళ్ళే!" అర్చిందామె.

తటాలున ఇన్‌స్పెక్టర్ శింగ్ జీప్‌లో కూర్చున్నాడు. జీప్ కదిలింది. ఇన్‌స్పెక్టర్ శింగ్ వాళ్ళవైపు సూటిగా చూశాడు.

"ఇహ మీరు అబద్ధం ఆడి లాభం లేదు. నిజం చెప్పండి!" గర్జించాడతను.

విమల ఏడ్వసాగింది.

"మాకేం తెలియదు సార్. ఆ రాజాచంద్రగాడు మిమ్మల్ని పనిలోకి దింపాడు."

"అతడు ఎక్కడుంటాడు?"

"ఇల్లు చూపిస్తాం, పదండి" అంది కమల.

ఇన్‌స్పెక్టర్ శింగ్ విజయవంతంగా సిగరెట్ వెలిగించాడు. జీప్ రోడ్డమ్మట వేగంగా సాసుకుపోయింది.

"ఆ యిల్లే!" అర్చింది కమల, మోటర్ సైకిల్ బయట నున్న యిల్లు చూపిస్తూ.

## 12

జీప్ ఆగింది. ఇన్‌స్పెక్టర్ శింగ్, ముకుంద్ కిందకు దిగారు. ముందా తలుపుమీద తట్టారు.

తలుపు తెరిచి మంగమ్మ భయంతో యిన్‌స్పెక్టర్ వైపు చూసింది.

"ఏం కావాలి?" ప్రశ్నించిందామె.

"రాజాచంద్ర కావాలి" అన్నాడు యిన్‌స్పెక్టర్ శింగ్.

"మా అబ్బాయి ఏదేనా నేరం చేశాడా?" అడిగింది మంగమ్మ.

క్షణకాలం యిన్‌స్పెక్టర్ శింగ్ ఆమెవైపు చూశాడు. అమాయకపు స్త్రీ. ఆమెను చూస్తే అతడికి జాలివేసింది.

"అతడితో మాట్లాడాలమ్మా" అన్నాడతను.

"అబ్బాయి ఆ గదిలో వున్నాడు" అందామె.

ఇన్‌స్పెక్టర్ శింగ్ లోపలకు వెళ్ళాడు. కుడివైపున్న గది తలుపు మూసి వుంది. తలుపుతోసి అతడు లోపలకు వెళ్ళాడు.

రాజాచంద్ర చాపమీద బాగా తాగి పడివున్నాడు. పక్కనే మెక్‌డోవెల్స్ బ్రాందీబాటిల్ వుంది.

ఇన్‌స్పెక్టర్ శింగ్, ముకుంద్ గదంతా వెతికారు. దొంగిలించిన కొన్ని వస్తువులు వాళ్ళకు దొరికాయి.

"ముకుంద్, యితడిని యిలాగే పోలీస్ స్టేషన్‌కి చేర్చాలి" అన్నాడు శింగ్.

ఇద్దరు కానిస్టేబుల్స్ గదిలో కొచ్చి రాజాచంద్రను మోసుకుపోయి జీప్‌లో పడేశారు.

ఇన్‌స్పెక్టర్ శింగ్, ముకుంద్ గదిలోంచి బయటకు వచ్చారు. తలుపు మూసి యిన్‌స్పెక్టర్ తాళంవేశాడు.

ముందు హాల్లో నేలమీద కూర్చుని మంగమ్మ వెక్కి, వెక్కి ఏడుస్తోంది. ఆమె వంక జాలిగా చుశాడు యిన్‌స్పెక్టర్ శింగ్.

"ఒకోసారి యింటికి అపకీర్తి తెచ్చేవాళ్ళు కుటుంబంలో పుడ్తూ వుంటారు. అది విధమ్మా, ఏడ్చి లాభం లేదు" అని యిన్‌స్పెక్టర్ శింగ్ బయటకు నడిచాడు.

—:ఐపోయింది:—

# పాపి - పతివ్రత

## వసుంధర

"శకూ! నీకు నామీద ఎటువంటి అభిప్రాయముందో నిర్మొహమాటంగా చెప్పాలి" అన్నాడు వెంకట్రావు.

"మీ దగ్గర నాకు మొహమాట మేమిటండీ" అని నవ్వి "నాకు మీమీద వేరే అభిప్రాయమంటూ ఏమీ లేదు. మీరూ నేనూ వేరన్న భావం నాకు లేదు. మీకు నామీద వున్న అభిప్రాయాలే నాకు మీమీద వుంటాయి" అంది శకుంతల.

"అదికాదు శకూ! నా జీవితాన్ని కలవరపరుస్తున్న సమస్య ఒకటుంది. దానికి పరిష్కారం నీవల్లనే జరగాలి. కానీ అందుకు నువ్వొప్పుకుంటావని నాకు తోచదు. అందుకే ఇంతగా అడుగుతున్నాను. నేనేపని చెప్పినా ఖచ్చితంగా అమలు జరపగలవా?" అన్నాడు వెంకట్రావు.

"మీ మనసుకు నచ్చినదీ, నా చేతనైనదీ ఏమైనా చేస్తాను...."

వెంకట్రావు సాలోచనగా తల పంకించి "నా మనసుకు

నచ్చిన దానో కాదో అప్పుడే చెప్పలేను. కానీ అది నీ చేత నైనది మాత్రమేనని తప్పక చెప్పగలను" అన్నాడు.

"మీ సమస్యకు పరిష్కారమైనది మీ మనసుకు నచ్చని దెందుకవుతుంది? నేను మాత్రమే చేయగల పని ఏమిటో చెప్పండీ?" అంది శకుంతల కుతూహలంగా.

"తప్పకుండా చేస్తానని మాటిస్తే చెబుతాను" అన్నాడు వెంకట్రావు.

"భార్య భర్తకు మాటివ్వడమేమిటండీ?" అంది శకుంతల నవ్వుతూ.

"అదంతే!" అన్నాడు వెంకట్రావు.

"మిమ్మల్ని చూస్తే నాకు నిజంగానే నవ్వొస్తోంది. మాటివ్వడానికి మీరేమైనా పరాయివారా నాకు-నచ్చక పోతే సారీకూడా చెప్పకుండా ఇచ్చిన మాట వెనక్కు తీసేసుకుంటాను."

"నచ్చకపోతే అనక్కర్లేదు. నేను చెప్పే పని నీకు నచ్చదు. నచ్చాలనికూడా నేను అనుకోవడం లేదు. నచ్చ లేదంటేనే నేను ఎక్కువ సంతోషిస్తాను. అయినప్పటికీ నువ్వా పని చేయాలి. తప్పదు" అన్నాడు వెంకట్రావు.

శకుంతల ముఖంలో నవ్వు మాయమైంది. ఆమె ఆలోచనలో పడింది. ఎంత ఆలోచించినా ఆమెకు భర్త ఉద్దేశ్యం అంతుపట్టలేదు - "సరే__చెప్పండి!" అంది.

"చెప్పేక నన్ను తిట్టకూడదు. అసహ్యించుకోకూడదు" అన్నాడు వెంకట్రావు.

"మీరు చెప్పిన పని చేయడానికి మిమ్మల్ని అసహ్యించుకోడం మెందుకూ?"

"ఎందుకా?...." అని ఒకక్షణం తటపటాయించి__

"నేను చెప్పేపని అలాంటిది. నువ్వు ఒక్క రాత్రి మరో పురుషుడితో గడపాలి. అదే నా సమస్యను పరిష్కరిస్తుంది" అన్నాడు.

శకుంతల భ్రమాన్వడిపోయింది.

## 2

"మీరేమంటున్నారో మీకు తెలుసా?" అనడిగింది శకుంతల.

"తెలుసు" అన్నాడు వెంకట్రావు స్పష్టంగా.

"భర్త భార్యకు చెప్పవలసిన పని కాదిది."

"అదీ తెలుసు నాకు."

"అయితే ఎందుకు చెప్పారు? నన్ను పరీక్షిస్తున్నారా?"

"భార్యను పరీక్షించే దౌర్భాగ్యం పురాణపురుషులదే కానీ నాది కాదు."

"ఇది మాత్రం పురాణపురుషుల దౌర్భాగ్యంకాదా?"

వెంకట్రావు గొంతు సవరించుకుని - "శకుంతలా! శీలం గురించిన నీ అభిప్రాయాలు నాకు తెలియవు. కానీ మరో పురుషుడితో వున్నంతమాత్రాన ఆడదాని శీలం పోతుందని అనుకోవడంలేదు నేను. ఒకే ఒక్కరాత్రి నువ్వు నేను చెప్పిన పురుషుడితో గడుపుతావు. ఆ తర్వాత మనమిద్దరమూ ఎప్పటిలాగే సంసార జీవితం గడుపుతాము. మళ్ళీ ఎప్పుడూ నిన్నటువంటి పనికి నియోగించను" అన్నాడు.

తన శరీరమంతా అసహ్యంతో కంపించుకుపోతున్న విషయం గురించి భర్త అంత తాపీగా చెప్పడం శకుంతలకు నచ్చలేదు "అసలు విషయ మేమిటో చెప్పండి!" అంది.

"అంటే?"

"మీ సమస్య ఏమిటి? దానికి ఇటువంటి పరిష్కార

మార్గం ఎందుకు ఎన్నుకున్నారు? మనమిద్దరం కూలంకషంగా చర్చించి ఇంకో మార్గముందేమో వెతుకుదాం" అంది శకుంతల.

"లేదు శకూ! నా జీవితంలో నీకు సంబంధించని ఏకైక వ్యక్తిగత సమస్య ఇది. ఇది నీకు నేను చెప్పుకోలేను. ఈ విషయం నీతో చర్చించలేదు. నేను సామాన్యుణ్ని. నాకు ఇంతకుమించిన పరిష్కార మార్గంలేదు. నువ్వు కాదంటే జీవితాంతం కుమిలిపోయే వ్యథ ఒక్కటే మిగుల్తుంది నాకు."

"ఎవరైనా మిమ్మల్ని బ్లాక్ మెయిల్ చేస్తున్నారా?" అనడిగింది శకుంతల.

"లేదు."

"మీకంటే శక్తిమంతుడైన వ్యక్తి ఈ విషయమై మిమ్మల్ని ఆజ్ఞాపించాడా?"

"లేదు. నేను నియోగించే పురుషుడిదీ వూరు కాదు. ఇంతవరకూ మీరిద్దరూ ఒకరి నొకరు చూసుకుని వుండరు. ఇంకా చెప్పాలంటే అతనికి నువ్వు నా భార్యవని తెలియదు. తెలియకూడదు. అతని దగ్గరకు నీ అంతట నువ్వే వెళ్ళి ఎలాగో అలా మెప్పించి ఒప్పించి ఒకరాత్రి అతనితో గడపాలి" అన్నాడు వెంకట్రావు.

శకుంతల కళ్ళలో నీళ్ళు తిరిగాయి - "నన్నొక బజారు వేశ్యగా మార్చాలనుకుంటున్నారా? మిమ్మల్ని నమ్మి మీతో గడపడానికి వచ్చిన ఇల్లాలికి మీరు చేసే మర్యాద ఇదేనా?" అంది.

"నాకు తెలుసు—నువ్విలా అనుకుంటావని. అందుకే ముందే అన్నాను. నువ్వీ పనికి అంగీకరించవని. పోనీ లే—

జీవితాంతం నన్నిలాగే కుమిలిపోనీ" అన్నాడు వెంకట్రావు.

"ఏ విషయమైనా ఒకడికంటే ఇద్దరు ఆలోచించడం వల్ల మెరుగైన పరిష్కారాలు తోచే అవకాశాలు పెరుగుతాయి. మీరు ఒక్కరూ ఆలోచించి ఏదో నిర్ణయానికి వచ్చారు. ఇప్పుడు మనమిద్దరమూ కలిసి ఆలోచించి ఇంకా మంచి పరిష్కారం దొరుకుతుందేమో చూద్దాం. దయచేసి అసలు విషయం నాకు చెప్పండి" అంది శకుంతల. ఆమె కంఠంలో అభ్యర్ధన వుంది.

"నీ దగ్గర ఏ రహాశ్యమైనా దాచలేను కానీ ఇది మాత్రం చెప్పుకోలేను. చెప్పుకుని బ్రతకలేను. నేను మనస్ఫూర్తిగా నిన్ను కోరుతున్నాను. నాకు నువ్వీ సహాయం చేసిపెట్టాలి. నా జీవితాశయం నెరవేరే పద్ధతి ఇదొక్కటే. నువ్వు అంగీకరించినందుకు నేను ఏ విధంగానూ తప్పుపట్టను. నీ మనసులో పాడు ఊహలున్నాయని నేను అనుకోను. కేవలం నా కారణంగా నువ్వు ఇందుకు అంగీకరిస్తున్నావని మనస్ఫూర్తిగా విశ్వసిస్తాను...."

"మీ సంగతి బాగానే వుంది. మరి నా సంగతేమిటి? మనసా, వాచా మిమ్మల్నే ఆరాధిస్తున్న నేను మీ మాట మీద మాత్రం మరో పురుషుడికి నన్ను నేనెలా అర్పించుకోగల ననుకున్నారు? వివాహమైనప్పట్నించీ నా మనసు కూడా మరో పురుషుడిమీదకు పోలేదే—అటువంటిది నా శరీరాన్ని మలినం చేయాలనుకుంటున్నారు—అది నాకెంత అసంతృప్తిని కలిగిస్తుందో ఆలోచించగలిగేరా?"

ఈ విధంగా ఇద్దరూ చాలాసేపు చర్చించారు. అయితే వెంకట్రావు శకుంతల చెప్పిన అన్ని పాయింట్లూ అంగీకరించాడు కానీ తన కోరిక నుపసంహరించుకోలేదు. శకుం

తల ఏడ్చింది. మొత్తుకుంది. ఏనా చిట్టచివరకు శకుంతలకు భర్త కోరికను అంగీకరించక తప్పలేదు.

"మీ సంతోషం కోసం నాకు చేతకాని, నా మనసుకు ఏ మాత్రమూ నచ్చుబాటుకాని ఈ పని చేయడానికి అంగీకరిస్తున్నాను. సరే—వివరాలు చెప్పండి" అంది శకుంతల. అలా అన్నప్పుడు ఆమె కంఠస్వరం బాగా వణికింది.

"నేను చెప్పిన మనిషిని నువ్వు ఎల్లుండి రాత్రి అశోకా హోటల్లో ఆరో నంబరు గదిలో - రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతాల కలుసుకోవాలి" అన్నాడు వెంకట్రావు.

తనకు వస్తున్న దుఃఖాన్ని అణిచిపెట్టుకుంటూ—"ఆ సమయానికి నేనక్కడికి వస్తానని అతనికి ముందుగానే తెలుస్తుందా?" అనడిగింది శకుంతల.

"తెలియదు—ఒక గదిలోకి వెళ్ళబోయి పొరబాటున ఆ గదిలోకి వెళ్ళినట్లు నటించాలి. అలాగని వెంటనే అక్కణ్నించి బయటపడకూడదు. అతన్నెక్కడో చూసినట్లుందని మాటలు కలపాలి. అతనిపట్ల ఆకర్షించబడినట్లు నటించాలి. వీలైనపుడల్లా అతన్ని రెచ్చగొట్టాలి. ప్రయత్నిస్తే అందుతావనే అభిప్రాయం అతనికి కలిగించాలి. వీలైతే అప్పుడే అతనికి లొంగిపోవాలి—పూర్తిగా—నిస్సంకోచంగా—అతనికి లొంగిపోవాలి—" అన్నాడు వెంకట్రావు.

భర్త మాటలు ములుకుల్లా గుచ్చుకున్నాయి శకుంతలకు-"ఎంతో మంచివాడనుకున్న నా భర్త యిలాఎందుకు ప్రవర్తిస్తున్నాడు? అతను కోరిన విధంగా మసలడం నావల్ల అవుతుందా? అలా మసిలేక నా భావిజీవితం ఎలా వుంటుంది?"—

ఇలాంటి ఆలోచనలతో శకుంతల మెదడు గందర గోళంగా తయారయింది.

## 3

శకుంతల తనకున్న వాటిలో మంచి చీర కట్టుకుంది. మ్యాచింగ్ బ్లౌజ్ వేసుకుంది. అదే రంగు బొట్టు, గాజులు.

"అప్సరసలా వున్నావు" అని మెచ్చుకున్నాడు వెంకట్రావు.

"వెళ్ళేదికూడా అలాంటి పనేకదా" అంది శకుంతల పొడిగా.

వెంకట్రావు ఏమీ మాట్లాడలేదు. శకుంతల అతని కళ్ళలోకి చూసింది. అతని కళ్ళలో ఆత్రుత వుంది కానీ బాధ లేదు.

"వెడుతున్నాను...." అంది శకుంతల.

"అలా అనకూడదు. వెళ్ళి వస్తాననాలి. రాత్రి నీకోసం ఆత్రుతగా ఎదురు చూస్తూంటాను నువ్వు మోసుకు వచ్చే శుభవార్తకోసం—"

"శుభవార్తా అది" అని నిట్టూర్చింది శకుంతల. తరు వాత ఆమె ఇల్లు కదిలింది. కొంతదూరం నడిచి రిక్షా ఒకటి బేరమాడి ఎక్కింది. అశోకా హోటల్ దగ్గర దిగింది. తిన్నగా రిసెప్షనిస్టు దగ్గరకు వెళ్ళి తను రూం నెంబర్ ఆరులోకి వెళ్ళాలనుకుంటున్నట్లు చెప్పింది.

రిసెప్షనిస్టు ఫోన్ చేసి కనుక్కొని "వెళ్ళండమ్మా— ఆయన గదిలోనే వున్నారు" అన్నాడు.

శకుంతల వళ్ళు జలదరించింది. ఇప్పుడు తను ఎవరు? సమాజంలో తనను ఏ పేరుతో పిలవాలి.

తనకు ఒక పురుషుడితో వివాహమైంది. కాబట్టి తనకి

సమాజంలో భార్య అనే గౌరవమైన పేరువుంది. కానీ తనిప్పుడు మరో పురుషుడితో గడపడానికి వెడుతోంది. అది భార్యల ధర్మంకాదు. అందువల్ల ఆ పేరుకు తాను తగదు. ఇప్పుడు తనకు తగ్గ పేరు వేశ్య. అయితే వేశ్య పురుషుడినుంచి డబ్బు ఆశిస్తుంది. తను డబ్బు ఆశించడంలేదు. కాబట్టి తను వేశ్యకాదు. ఇంకోలా చెప్పాలంటే తను వ్యభిచారిణి అవుతుంది. వ్యభిచారం డబ్బు కారణంగా జరగదు. మనసు చలించడంవల్ల జరుగుతుంది. కానీ తనకు మనసు చలించలేదు. తన భర్త పంపగా ఇందుకు పూనుకుంది.

తనకు నప్పే పేరేమిటో శకుంతలకు స్ఫురించింది— పతివ్రత.

తను పతివ్రత కాబట్టే భర్త చెప్పిన ఇంత అసహ్యాకరమయిన పనికికూడా పూనుకో గలిగింది.

శకుంతల నెమ్మదిగా రూం నెంబర్ ఆరు సమీపించింది. నెమ్మదిగా తలుపు తోసింది. గడియవేసి లేదు కాబోలు తలుపు తెరుచుకుంది. ఆమె లోపల అడుగు పెట్టింది.

శకుంతల వెంటనే తలెత్తి పైకి చూడలేదు. ఆమె వెనుకనే తలుపు దానంతటదే మూసుకుంది.

ఇప్పుడు తనేం చేయాలి? భర్త చెప్పిన విధంగా ప్రవర్తించడం తనవల్ల అవుతుందా? సాధ్యముకాని పక్షంలో ఏం చేయాలి? మరో పురుషుడు తనను తాకుతాడంటేనే ఆమెకు జుగుప్సాకరంగా ఉంది. కానీ తప్పదు....

శకుంతల నెమ్మదిగా తలెత్తి చూసింది.

గదిలో కుర్చీలో కూర్చునివున్న పురుషుడి చేతిలో

పేపరువుంది. అతను ఆశ్చర్యంగా కళ్ళప్పగించి ఆమెవంకే చూస్తున్నాడు. ఆమె అందం అతనికి నోట మాటకూడా లేకుండా చేసినట్లుంది.

ఆమె అతన్ని సమీపించింది. అతని ముఖం ఆమెకు స్పష్టంగా కనబడుతోంది. ఆమె ఉలిక్కి పడింది. ఎవరతను?

చాలా త్వరగా అతన్నామె గుర్తుపట్టింది. అతన్ని తను ఎలా మరచిపోగలుతుంది.

భర్తకు ఇతనెలా తెలుసు? ఏ ఉద్దేశ్యంతో అతను తన నితనివద్దకు పంపించాడు?

ఆమె మనసు ఆమెను వెక్కిరించింది. "పర పురుష స్పర్శనూహించుకుంటేనే నీ వళ్ళు జలదరించింది కదా? కానీ ఇతను నీకు పరపురుషుడేనా?

అతను తనకు పరపురుషుడు కాడు. ఈ విషయం భర్తకు తెలుసా? తెలిసే తన్నిక్కడకు పంపాడా? అలా పంపడంలో అతను సాధించ దల్చుకున్నదేమిటి? తను దాచిపెట్టిన తప్పుకు శాశ్వతమైన ఋజువు నాపాదించి తన్ను వదిలి పెట్టాలనా?"

శకుంతల మనసు పరపరవిధాల పోతూంటే గతం ఆమె కళ్ళముందు ఒక్కసారి తళుక్కుమంది.

* * *

"మీకు తెలియదా? ఈ రోజు బస్సులు తిరగవు. వాళ్ళు సమ్మె చేస్తున్నారు" అందా అమ్మాయి తను ముందడుగు వేస్తూ.

"నా ఇల్లు నడిచివెళ్ళేంత దూరంలో లేదే—— వెధవది ఇక్కడ రిక్షాలుకూడా దొరకవు" అంది శకుంతల కంగారుగా.

"ఇక్కడుంటే ఇంతే మీపని. రిక్షాలు దొరికేచోటు కయినా నడిచివెళ్ళటం మంచిదికదా" అంటూ సలహా యిచ్చిందా అమ్మాయి. శకుంతలకు గత్యంతరం తోచ లేదు. ఆమెతో కలిసి తనూ అడుగులు వేసింది. ఆ సమ యంలో వాళ్ళ పక్కన కారు ఒకటి ఆగింది. కారులోంచి ఓ అందమయిన యువకుడు బయటకు తొంగిచూస్తూ— "దగ్గరలో ఏదయినా పెట్రోల్ బంక్ ఉందేమో మీకు తెలుసా?" అన్నాడు.

ఇద్దరూ తల అడ్డంగా ఆడించి, "తెలియదు. బస్సులు సమ్మెకారణంగా నడుస్తున్నాం కానీ ఈ దారి మాకూ క్రొత్తే!" అన్నారు.

"అయితే మిమ్మల్ని నేను డ్రాప్ చేస్తాను. అడ్రెస్ చెప్పండి" అన్నాడా యువకుడు.

శకుంతల సందేహించింది కానీ ఆ అమ్మాయి చటుక్కున కారెక్కి శకుంతలనుకూడా లోపలకు లాగి ఇద్దరి అడ్రసులూ తనే చెప్పింది. తర్వాత నవ్వుతూ—"మీ కార్లో పెట్రోల్ లేనట్లుంది. మీరు మాకేం లిఫ్ట్ ఇవ్వగలరు?" అంది.

"ఏదో మీకు సహాయపడ్డం కోసం, మిమ్మల్ని పలకరించడంకోసం అడిగాను కానీ నాకు పెట్రోల్ బంక్‌తో పనిలేదు. ఉన్నా ఆ వివరాలు మిమ్మల్ని అడగాల్సిన అవసరమూ లేదు" అన్నాడతను.

"మీ సహాయ గుణానికి చాలా థాంక్స్—మీ పేరు తెల్సుకోవచ్చా?" అందా అమ్మాయి.

"బసవరాజు నా పేరు. మిత్రులంతా రాజు అని పిలుస్తారు నన్ను—" అన్నాడతను కారు స్టార్టుచేస్తూ.

"మేము మాత్రం బసవరాజుగారనే అంటాంలెండి" అందా అమ్మాయి నవ్వుతూ—అతనితో మిత్రత్వం తన కిష్టంలేదన్నట్లు సూచిస్తూ.

కారు కదిలింది. ఆ అమ్మాయి దిగవలసిన చోటు ముందొచ్చింది. ఆమె దిగుతూ—"బస్సులు లేనిలోటు తీర్చారు బసవరాజుగారూ. చాలా థాంక్స్—" అని వెళ్ళిపోయింది.

ఆ అమ్మాయి చలాకీ తనానికి శకుంతల ఆశ్చర్య పోతోంది. తనైతే మగవాళ్ళతో అలా ఉండలేదు. అలా మాట్లాడలేదు. ఇప్పుడీ కారులో వుండాలంటే ఆమెకు మొహమాటంగా వుంది—"నేను ఇక్కడే దిగి పోతాను. ఇక్కణ్ణించి ఏ రిక్షాలయినా దొరక్కపోవు లెండి" అంది.

"మీరు మధ్యలో దిగిపోతే నన్ను అవమానించినట్లు భావించుకుంటాను—" అన్నాడు బసవరాజు. అతను తన క్రాపింగు ఓసారి సవరించుకుని మళ్ళీ కారు స్టార్ట్ చేశాడు.

పది నిముషాల్లో కారు ఓ బంగళాముందు ఆగింది.

శకుంతల కంగారుగా బసవరాజువంక చూసింది.

"ఇది మా ఇల్లు. ఇంట్లో చిన్న కబురు చెప్పాలి. మిమ్మల్నిలా కార్లో కూర్చోబెట్టి లోపలికి వెళ్ళటం నాకు నచ్చదు. కొద్దిగా కాఫీ పుచ్చుకుందురుగాని రండి—" అన్నాడు బసవరాజు.

"నేను కాఫీ తాగను" అంది శకుంతల ముక్తసరిగా.

"పోనీ కూల్ డ్రింక్. మీరు రాక తప్పదు. ప్లీజ్!" అన్నాడతను.

సంస్కారం ఉట్టిపడేలా ఉన్న అతని మాటల్ని అను మానించలేక ఆమె అతనితో పాటు అతని బంగళాలోకీ బంగళాలోని అతని గదికీ వెళ్ళింది. ఆమె లోపలకు వచ్చేక అతను చటుక్కున గదితలుపు వేశాడు.

శకుంతల కంగారు పడింది.

"కాసేపు మనం ఈ గదిలో సరదాగా గడుపుదాం" అన్నాడు బసవరాజు.

"నేను త్వరగా ఇంటికి వెళ్ళాలి—" అంది శకుంతల కంగారుగా.

"ఈరోజు బస్సులు స్ట్రయిక్. ఎవ్వరూ నిన్ను అను మానించరు."

"నేను వెళ్ళాలి" అంది శకుంతల అసహనంగా. ఆమె తలుపువైపుకు నడిచింది. అతనామె చేయిపట్టుకుని ఆపి, "నేను వెళ్ళనివ్వను" అన్నాడు.

"నేను వెళ్ళాలి" అంది మళ్ళీ శకుంతల.

"నా అదృష్టంకొద్దీ దొరికావు నువ్వు. రోజూ అమ్మా యిల వేటలో బయల్దేరినా ఇంత అందమైన అమ్మాయి ఎప్పుడూ దొరకలేదు. సరదాగా కాసేపు ఇక్కడగడుపు దాం. బహుమతిగా నేనో వందరూపాయలు కూడా నీకు ఇచ్చికొని జాగ్రత్తగా నీ యింటిదగ్గర దిగబెడతాను" అన్నాడు బసవరాజు. ఆమెను పట్టుకొని ఆపిన అతని చెయ్యి అతని సంకల్ప బలాన్ని తెలియచేసేదిగా వుంది.

శకుంతల యెన్ని విధాల సాధ్యపడుతుందో అన్ని విధాలా అతన్ని బ్రతిమాలింది. అసహాయతతో ఏడ్చింది. ఆఖరికి అతని బలానికి లొంగిపోయింది.

తప్పు చేయటంలో పురుషుడి నిర్భీతికి చిహ్నంగా అత

నామె చేతిలో వందరూపాయలు పెట్టి భద్రంగా ఆమెను యింటి దగ్గరలో దించాడు.

* * *

"నువ్వు బసవరాజువి కదూ?" అందామె.

అతనామె వంక ఆశ్చర్యంగా చూస్తూ—"అవును. నేనూ నిన్ను ఎరుగుదును....అయినా ఒకసారితో మరచి పోయే అందంకాదు నీది" అన్నాడు.

శకుంతల అణువణువూ అసహ్యంతో నిండిపోయింది. ఆరోజు ఏ మాత్రమూ తన మనసు కిష్టంలేని రోజున తన దీనాలాపాలు వినకుండా తన మనసును పట్టించుకోకుండా బలవంతంగా అనుభవించిన ఈ దుర్మార్గుడి గదిలోకి ఈ రోజున భర్త పనుపున అడుగు పెట్టింది. అదీ వాడిని రెచ్చగొట్టి వశంకావడానికి. ఏ పరిస్థితుల్లోనూ యీ పని తనవల్ల కాదు.

బసవరాజు తన భర్తకు తెలుసా? తన ఫోటోనిచూసి భర్తకు విషయాన్ని చెప్పేశాడా? అందులోని నిజా నిజాలు తెల్సుకునేందుకు భర్త తన నీ పనికి పురమాయిం చాడా? ఇప్పుడు భర్త తనను రహస్యంగా గమనిస్తూం టాడా?

ఇప్పుడు తనేం చేయాలి?

"తర్వాత మళ్ళీ కనిపించలేదు. ఏమయిపోయావ్? ఇన్నాళ్ళకు నా గురించి తెలిసి నన్ను మళ్ళీ కరుణించ డానికి వచ్చావా? అప్పటికీ యిప్పటికీ నీ అందంలో చాల మార్పు వచ్చింది. శుక్లపక్ష చంద్రుడిలా నీ అందానికి పెరుగుదలే కానీ తరగడం లేదేమో—" అన్నాడు బసవ రాజు.

శకుంతల అదోలా బసవరాజువంక చూసి "అప్పటికీ ఇప్పటికీ అందంలోనే కాదు — నాలో యింకా చాలా మార్పులు వచ్చాయి. ముఖ్యంగా నా మనస్తత్వం మారింది. పిచ్చిపిచ్చి మాటలు మాట్లాడినా—హద్దు తెలిసి ప్రవర్తించక పోయినా ఎదుటి మనిషిని చంపేయగల క్రూరత్వంకూడా ఇప్పుడు నాలో వుంది" అంది.

# 4

"మూడు రోజులనుంచి ఆయన పత్తాలేదు సార్. గది తలుపులు తాళంవేసి వున్నాయి. మా హోటల్ రూల్స్ ప్రకారం పోలీసుల సమక్షంలో తప్ప గదితలుపులు తెరవడానికి వీలులేదు" అన్నాడు అశోకా హోటల్ మేనేజర్.

ఇన్స్పెక్టర్ ఈశ్వర్రావు ఓ క్షణం ఆలోచించి "సరే పదండి" అన్నాడు.

గది తలుపులకు వేయబడ్డ తాళం చాలా గట్టిది. ఈశ్వర్రావు దాన్ని పరీక్షగా చూస్తూ—"ఇది మీ హోటల్ది లేక...." అని ఏదో అనబోగా, "అవసరమనుకుంటే కస్టమర్స్ తమ గదులకు వేరే తాళాలు వేసుకోవచ్చును. ఇందులో మాకు చెప్పుకున్నప్పటికీ మా హోటల్కి వచ్చేది గొప్ప గొప్ప వాళ్ళే కాబట్టి—సమస్యలు తలెత్తడంలేదు. ఈ తాళం హోటల్ది కాదు" అన్నాడు మేనేజర్.

ఆ తాళంకప్ప మారు తాళాలకు లొంగలేదు. చివరకు దాన్ని బద్దలుకొట్టి గదిలో ప్రవేశించారు. ఈశ్వర్రావు ఆత్రుతగా గదిలో పరీక్షించి చూశాడు.

గదిలో ఒక సూట్ కేసు వుంది. అది చూడటానికి

ఇంపోర్టెడ్ లాగుంది. బట్టల స్టాండుకు ఓజత బట్టలు, నైట్ డ్రస్సు, టవల్ వున్నాయి. మంచంమీద చదువుతూ చదువుతూ సగం మడిచిపెట్టబడి వదిలేసిన పుస్తకము వుంది. ఈశ్వర్రావా పుస్తకాన్ని చూశాడు. అది కూడా ఇండియన్ స్టఫ్ కాదు. అట్టమీద ఎరోటికా అని వుంది. లోపల స్త్రీ పురుషుల నగ్నచిత్రా లున్నాయి.

గదంతా పరిశీలించినా ఇంకే విశేషాలూ లభించలేదు.

"బహుశా, మనం ఆ సూట్ కేసు తెరిచి చూడాలనుకుంటాను" అన్నాడు ఈశ్వర్రావు. మేనేజర్ సగం ఇష్టంగా, సగం అయిష్టంగా తలాడించి "మాహోటల్లో బస చేసినవారి సామానుకు భద్రత, ప్రైవసీ—రెండూ గ్యారంటీ ఇస్తాము. కానీ ఇతడు అర్ధాంతరంగా మాయ కావడంవల్ల ఇలా చేయడం తప్పనిసరి అవుతోంది—" అన్నాడు.

అదృష్టవశాత్తూ సూట్ కేసుకు తాళం వేసిలేదు. లోపల చిన్న లెదర్ కేసు వుంది. లెదర్ కేసులో అన్నీ వందరూపాయలనోట్లు — మొత్తం పన్నెండువేల ఆరు వందల రూపాయలున్నాయి. రెండుజతలు బట్టలు, నాల్గు పోర్నోగ్రఫీ పుస్తకాలూ ఉన్నాయి. ఇవికాక వొక డైరీ వుంది.

ఈశ్వర్రావు చటుక్కున ఆ డైరీతీసి యెంతవరకూ రాశాడో చూశాడు. ఆఖరి రోజున—"ఎందుకో వెంకట్రావు ఫోన్ చేశాడు. చాలాముఖ్య విశేషం అన్నాడు. నది ఒడ్డుకు రమ్మన్నాడు...." అన్న వాక్యంతో అంతమైంది. ఈశ్వర్రావు ఆ తేదీనిబట్టి—ఆ వాక్యాలురాసిన రోజునే అతను మాయమైనాడని గ్రహించాడు.

తర్వాత అక్కడి రిసెప్షనిస్టును విచారించగా రాత్రి తొమ్మిదిగంటల ప్రాంతంలో ఒక అందమైన యువతి గదిలోని వ్యక్తిని కలుసుకుందనీ, గదిలో ఆమె సుమారు ముప్పావుగంట ఉన్నదనీ, తర్వాత ఆమె వెళ్ళిపోయిందనీ, ఆ తర్వాత యింకో గంటకు వెంకట్రావు అనే అతను గదిలోని వ్యక్తి కావాలనగా తను కనెక్షనిచ్చాననీ—తర్వాత పావుగంటలో గదిలోని వ్యక్తి తలుపు తాళం వేసుకుని వెళ్ళిపోయాడనీ చెప్పాడు.

ఆ తర్వాత ఆ గదిలోకి మళ్ళీ ఎవరూ వచ్చినట్లులేదు.

"హోటల్లో రిజిస్టరయిన పేరూ, డైరీమీద రాసివున్న పేరూ ఒక్కటే. కాబట్టి ఈ హోటల్లో మకాం చేసినతని పేరు బసవరాజే అయుండాలి" అనుకున్నాడు ఈశ్వర్రావు. బసవరాజు వివరాలు తెలుసుకోనేందుకు అతని డైరీ అట్టే సహకరించలేదు. అతనే ఊరినుంచి వచ్చాడో ఎడ్రస్ యేమిటో తెలుసుకొందుకు మాత్రమే డైరీ సహకరించింది. మిగతావన్నీ చాలా సామాన్యమైన విశేషాలు, నిత్యజీవితానికి సంబంధించినవి.

"బసవరాజు ఇదివరకెప్పుడైనా మీకు తెలుసా?" అని హోటల్ మేనేజర్ని అడిగాడు ఈశ్వర్రావు. అతని గురించి తనకు మరీ యెక్కువగా గుర్తులేదనీ యిదివరలో కూడా తమ హోటల్లో అతను బసచేసివుంటే వుండవచ్చుననీ అన్నాడు మేనేజర్.

"ప్రస్తుతానికి ఈ డైరీ నేను తీసుకు వెళుతున్నాను. గది తాళంవేసి వుంచండి. గదిలోవున్న వస్తువులు, డబ్బు నేను నోట్ చేసుకొంటున్నాను. అన్నింటికీ బాధ్యత మీదే—బసవరాజు తిరిగి రూమ్‌కివస్తే నాకు తెలియ బర

చండి....” అన్నాడు ఈశ్వర్రావు.

“బసవరాజు మళ్ళీ రూంకి వస్తాడంటారా?”అన్నాడు మేనేజర్.

“రాడని ఎందుకనుకోవాలి? పన్నెండువేల రూపాయల రొక్కం వదలిపెట్టి ఎవడూ అర్ధాంతరంగా మాయం కావాలనుకోడు.”

“అదే సార్ నా అనుమానమూనూ—యింత డబ్బు వదలిపెట్టి మూడు రోజులుగా రూమ్‌కు రాలేదంటే అసలీయన....” అని నీళ్ళు నమిలాడు బసవరాజు.

“చెప్పండి—మీ అనుమాన మేమిటో?” అన్నాడు ఈశ్వర్రావు.

తన ఎదురుగా వున్నది ఒక పోలీసాఫీసర్ అని అప్పటికి స్ఫురించింది హోటల్ మేనేజర్‌కి—“అబ్బే-యేమీ లేదులెండి” అనేశాడు.

## 5

డైరీలో బసవరాజు ఇంటి టెలిఫోన్ నంబర్ వుంది. ఈశ్వర్రావు అక్కడికి ట్రంక్‌కాల్ చేశాడు. అటువైపు నుంచి బసవరాజు భార్య ఫోన్ ఎత్తి తను ఎవరో చెప్పింది.

ఈశ్వర్రావు తనెవరో చెప్పి బసవరాజు గురించి వివరాలడిగేడు.

“ఆయన ఇంకా తిరిగి రాలేదు” అందామె.

“అలాగా” అని—“ఈ ఊళ్లో మీకు పరిచితమైన వెంకట్రావు అనే వ్యక్తి వున్నాడా?” అనడిగాడు ఈశ్వర్రావు.

“వెంకట్రావు తెలియకేం?” అందామె చటుక్కున-“ఆయనా ఊరొచ్చినప్పుడల్లా వెంకట్రావాయన్ను కలుసు

కుంటూనే వుంటాడు....”

“ఆ వెంకట్రావు చిరునామా మీకు తెలుసా?” అనడిగాడు ఈశ్వర్రావు.

“చిరునామా తెలియదు. కానీ అతను పనిచేస్తున్న ఆఫీసు వివరాలు తెలుసు” అంటూ ఆమె వివరాలు చెప్పగా ఈశ్వర్రావు నోట్ చేసుకున్నాడు.

“మీరేమీ కంగారు పడకండి. బసవరాజుగారు అశోకా హోటల్లో మకాం చేసి వెంకట్రావుగారితో కలిసి ఎక్కడికో వెళ్ళారు. ఇంతవరకూ వెనక్కు రాలేదు. హోటల్ వాళ్ళు పోలీసుల సాయం అడిగారు. మేము దర్యాప్తు చేస్తున్నాం” అన్నాడు ఈశ్వర్రావు.

అవతల ఆమె అట్టే కంగారుపడినట్లు లేదు–“ఇదాయనకు మామూలే—నాకు కంగారేమీ లేదు” అందామె.

ఈశ్వర్రావు కాల్ కట్ చేసి అశోకా హోటల్‌కి ఫోన్ చేసి—“హోటల్లో మకాం పెట్టి రోజులకొద్దీ బయట తిరగడం బసవరాజుకి మామూలేనట. ఈ మాత్రం దాని కింత హడావుడెందుకు చేశారు?” అన్నాడు.

“బసవరాజు కది మామూలు కావచ్చు. కానీ మా హోటల్ కది మామూలు కాదు” అంటూ మేనేజర్ కాస్త ఘాటుగానే జవాబిచ్చాడు. ఈశ్వర్రావు ఫోన్ పెట్టేశాడు.

ఆలోచించినకొద్దీ ఈశ్వర్రావుకి తాను అనవసరంగా చిన్న విషయాన్ని పెద్దది చేస్తున్నాడేమో అనిపించింది. వెంకట్రావును కలుసుకుంటే చాలా సమస్యలు సులభంగా పరిష్కరించబడుతాయి. ఇలాగనుకుని అతను జీపుమీద వెంకట్రావు పనిచేసే ఆఫీసుకు వెళ్ళాడు. అదృష్టవశాత్తూ

అతనికి వెంకట్రావు సులభంగానే దొరికాడు.

వెంకట్రావు యువకుడు. వయసు ముప్పైకి లోపే వుండవచ్చు. మనిషిని చూడగానే చాలా కష్టపడి పైకి వచ్చినవాడిలా వున్నాడు. ఈశ్వర్రావతనికి తన్ను పరిచయం చేసుకున్నాడు.

"నాతో ఏం పని మీకు?" అన్నాడు వెంకట్రావు ఇబ్బందిగా. అతని ముఖంలో ఆశ్చర్యంకంటె అయిష్టమే ఎక్కువగా కనబడుతోంది.

"బసవరాజు ఆచూకీ తెలుసుకోవడంకోసం మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు ఈశ్వర్రావు.

వెంకట్రావు ముఖంలో రంగులు మారాయి—"బసవరాజా—వాడెవడు?" అన్నాడు.

ఈశ్వర్రావు ఓపికగా బసవరావు వివరాలు చెప్పి—"కన్పించకుండా పోయిన రోజు రాత్రి బసవరాజు మీ ఫోన్ కాల్ విని బయటకు వచ్చాడని తెలిసింది" అన్నాడు.

"నాకు తెలియని మనిషికి నేనెందుకు ఫోన్ చేస్తాను? ఆ వెంకట్రావు ఇంకెవరో అయుంటాడు" అన్నాడు వెంకట్రావు కంగారుగా.

"ఇంకెవరో అయుంటే మీ దగ్గర కెందుకొస్తాను.." అంటూ వెంకట్రావు గురించి తనకెలా తెలిసిందో ఈశ్వర్రావు అతనికి వివరించి చెప్పాడు.

"ఆ బసవరాజుగారా" అన్నాడు వెంకట్రావు ఇబ్బందిగా—"ఆయన నాకు తెలుసు. కానీ నేనాయనకు ఫోన్ చేయలేదు."

"మీ కింకా ఎవరైనా బసవరాజులు తెలుసా?" అన్నాడు ఈశ్వర్రావు కాస్త కోపంగా.

"అబ్బే అదికాదు. ఆయనదీ ఊరు కాదుకదా.... బసవ

రాజనగానే ముందు నా బుర్రలోకెక్కలేదు" అన్నాడు వెంకట్రావు.

"కానీ నేను ముందుగానే బసవరాజు ఊరు అన్నీ వివరంగానే చెప్పాను. ఎందుకో మీరు నాకు నిజం చెప్పడానికి సంకోచిస్తున్నారు. మీ సంకోచం చూస్తుంటే బసవరాజు ప్రమాదంలో వున్నాడేమోనని నాకు అనుమానంగా వుంది" అన్నాడు ఈశ్వర్రావు.

వెంకట్రావు తడబడుతూ—"పోలీస్ ఇన్‌స్పెక్టర్ నా గురించి రాగానే నాకు మతిపోయినట్లయింది. నేను చాలా సింపుల్ మనిషిని. కంగారులో నేను చేసిన తప్పిదాల్ని క్షమించండి. బసవరాజుగారు నాకు బాగా తెలుసు. ఆయన నాకు దైవ సమానుడు. ఎటొచ్చీ ఆయన ఈ ఊరు వచ్చినట్లూ, అశోకా హోటల్లో మకాం చేసినట్లూ నాకు తెలియదు. నేనాయనకు ఫోన్ చేయలేదు. ఇది నిజం. ఈ ఊళ్లో ఆయనకు తెలిసిన వెంకట్రావు లింకెవరైనా వున్నారేమో తెలుసుకోండి. నాకు మాత్రం ఏం తెలియదు?" అన్నాడు. మాట్లాడుతూంటే అతని వళ్ళంతా చెమటలు పట్టింది.

అతని హడావుడి చూసి—"ఇతను నిజంగానే అమాయకుడు. ఉత్తి పుణ్యాన నన్ను చూసి కంగారుపడుతున్నాడు" అనుకున్నాడు ఈశ్వర్రావు.

# 6

"వచ్చిన మనిషి అజాపజా లేకుండాపోతే వారంరోజులకు మించి ఎదురు చూడాల్సిన బాధ్యత మాకు లేదు" అన్నాడు హోటల్ మేనేజర్.

"సరే—గదిలోని వస్తువులన్నీ నాకు అప్పగించండి—

గది మీరు మళ్ళీ యథా ప్రకారంగా అద్దెకిచ్చుకోవచ్చు" అన్నాడు ఈశ్వర్రావు.

బసవరాజు సూట్ కేసులోని డబ్బులోంచి ఈశ్వర్రావు హోటల్ కి అద్దె కట్టేసి రశీదు తీసుకున్నాడు. ఆ సామాను తీసుకుని జీపులో బసవరాజు ఊరు వెళ్ళాడు. సరిగ్గా గంట ప్రయాణం.

బసవరాజు ఇంట్లో అతని భార్య తప్ప ఎవ్వరూలేరు. ఈశ్వర్రావు తనను తాను పరిచయం చేసుకున్నాడు.

"కొద్దిరోజుల క్రితం ఫోన్లో మాటాడింది మీరేనన్న మాట—ఆయన వివరాలేమైనా తెలిశాయా?" అనడిగిందామె. ఆమె ప్రశ్నను చాలా తాపీగా వేసింది. ఆమె ముఖంలో ఎక్కడా కంగారు లేదు.

ఈశ్వర్రావు వివరాలు చెప్పాడు. తను అందించిన వస్తువులకు, డబ్బుకు ఆమె వద్దనుంచి రసీదు తీసుకున్నాడు "మీ భర్తగురించి మీరాట్టే కంగారుపడుతున్నట్లు లేదే" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇంత డబ్బు వదిలిపెట్టి ఇన్నాళ్ళు మాయమవడం ఇది ప్రథమమే కానీ ఆయన తత్వం తెలిసినదాన్ని కాబట్టి ఇది అసహజంగా నాకు తోచలేదు" అని నిట్టూర్చింది బసవరాజు భార్య.

"కొంచెం వివరంగా చెప్పగలరా?" అన్నాడు ఈశ్వర్రావు.

"చెప్పకుండా దాచడానికిందులో రహస్యమేముంది లెండి" అందామె — "ఆయనకు స్త్రీ వ్యసనం వున్న విషయం లోకానికంతకూ తెలుసు."

ఈశ్వర్రావు ఆశ్చర్యంగా ఆమెవంక చూశాడు. ఆమెది

నిజంగా అద్భుత సౌందర్యం. ఇటువంటి అద్భుత సౌందర్యవతిని భార్యగా కలిగివున్న బసవరాజుకు స్త్రీ వ్యసనమా?

"నేను నమ్మలేను" అన్నాడతను.

"నిజానికి నమ్మకాలతో పని ఏముంది? లక్షలకు లక్షల ఆస్తి వున్న ఆయనకు భార్యనైన నేను ఇలా ఈ చిన్న ఇంట్లో ఒంటరిగా ఎందుకున్నాను? ఆయన స్త్రీ వ్యసనానికి చాటుమాట్లు లేవు కనుక. అందరూ నన్ను చూసి నా ఎదురుగానే పరిహసించడమో, జాలిచూపడమో భరించలేక!"

ఈశ్వర్రావు నిట్టూర్చి — "ఈ వ్యసనానికీ మీవారు హోటల్లోంచి అర్ధరాత్రి మాయంకావడానికీ సంబంధమేమిటంటారు?" అన్నాడు.

"ఏముంది—మీరే చెప్పారుగా—వెంకట్రావ్ ఫోన్ చేస్తే బయల్దేరి వెళ్ళారని. అతగాడెక్కణ్ణించో ఆడపిల్లల గురించిన సమాచారం ఇచ్చి వుంటాడు. ఈయన వెళ్ళి వుంటారు. ఆ పిల్లలు బాగా నచ్చడంవల్లనో, లేక భంగపడి దెబ్బలు తిని హాస్పిటల్లో వుండడంవల్లనో ఆయన హోటల్‌కు తిరిగి రాలేకపోయి వుంటారు" అంది బసవరాజు భార్య. ఆమె చెప్పే మాటలనుబట్టి ఇది నిత్య వ్యవహారంలా తోచింది ఈశ్వర్రావుకి.

"అయితే ఇందులో పోలీసుల జోక్యం అవసరం లేదంటారు?"

"అది మీ ఇష్టం. నాకై నేను మిమ్మల్నేమీ కోరను."

"మరొక్క విషయం. వెంకట్రావుపైన మీ అభిప్రాయం ఏమిటి? అతడివల్ల మీ ఆయనకు ప్రమాదం సంభవించే అవకాశముందా?" అన్నాడు ఈశ్వర్రావు.

ఈ ప్రశ్నకు బసవరాజు భార్య తన ఎదురుగా పరాయి

మగవాడున్నాడన్న విషయంకూడా మరిచిపోయి విరగబడి నవ్వింది—"వెంకట్రావు ఈయనకు అపకారం తలపెట్ట డమా? ఎందుకూ పనికిరాని వెధవని చిన్నప్పట్నించీ చేర దీసి ఇంతవాణ్ని చేశారు. ఈయన ఎంగిలిమెతుకులు తిని పెరిగాడు వాడు. ఆ విశ్వాసం వాడికి నరనరాలా జంట బట్టేసింది. వాడికి వ్యక్తిత్వం లేదు. ఈయన మాటే వేద వాక్కు వాడికి. వాడి గురించి ఆయన ఏమంటారంటే— పెళ్ళయితే వాడి పెళ్ళాన్నికూడా ఈయన కోరితే సమ ర్పించుకుంటాడట! అటువంటి మనిషి ఈయనకు ప్రమాదం తలపెట్టడమా? అసలది నా ఊహల్లోకే రాదు."

బసవరాజు భార్య మాట్లాడే పద్ధతి ఈశ్వర్రావుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. సాధారణంగా ఆడవాళ్ళలా మాట్లాడరు. కానీ భర్త ప్రవర్తన ఆమెలో మానసికమైన మార్పులు చాలా తీసుకువచ్చివుంటుందని అతననుకున్నాడు.

"అయితే వెంకట్రావు ఇంకా పెళ్ళి చేసుకోలేదా?"

"చేసుకోలేదు."

"నేను వెంకట్రావుని కలిస్తే మీవారు వస్తున్నట్లు తనకు తెలియదనే అన్నాడు" అన్నాడు ఈశ్వర్రావు.

"అబద్ధం—తను వెళ్ళే ముందాయన అతని ఆఫీసు అడ్రస్‌కు ఉత్తరం రాశారు" అంది బసవరాజు భార్య.

"ఉత్తరం అందలేదేమో" అన్నాడు ఈశ్వర్రావు.

"అతని జవాబుకూడా అందేకనే ఆయన బయల్దేరారు. అక్కడ ఆయనకు చాలా వ్యవహారాలు వెంకట్రావే చూసిపెట్టాలి" అంది బసవరాజు భార్య.

ఈ సమాచారం ఈశ్వర్రావుకు కలవరపరిచింది— "వెంకట్రావు మీ వారికి రాసిన ఉత్తరం ఇప్పుడుందా?" అని అడిగాడు.

"ఒక్క క్షణం ఆగండి" అని లోపలకు వెళ్ళింది బసవ రాజు భార్య. రెండు నిముషాల్లో ఒక కారుతో తిరిగి వచ్చిందామె. ఈశ్వర్రావు దాన్నందుకుని పరిశీలించి— "అవసరమైన పక్షంలో ఇది నా పరిశోధనకు పనికొస్తుంది" అన్నాడు.

"కావాలంటే తీసుకు వెళ్ళండి—అందుకు నా అభ్యంతరమేమీ లేదు" అంది బసవరాజు భార్య.

# 7

వెంకట్రావును ఓ కంట కనిపెట్టి వుండమని ఓ కానిస్టేబుల్‌ను నియోగించాడు ఈశ్వర్రావు. చుట్టుపక్కల అతని గురించిన వివరాలుకూడా సేకరించమని చెప్పాడతను.

రెండు రోజుల్లోనే కానిస్టేబుల్ చాలా వివరాలు సేకరించుకు వచ్చాడు.

వెంకట్రావు మెతని మనిషి అన్న పేరు వుంది ఆఫీసులో. అతనంటే ఎవరికీ ద్వేషంలేదు కానీ కొంతమందికి అతనంటే చాలా వేళాకోళం. వెంకట్రావు సరస్వతీ నగర్‌లో వుంటున్నాడు. ఇరుగు పొరుగుల్లో అతనికి మంచి పేరుంది. అతని భార్య అనుకూలవతి అట. వారి దాంపత్యాన్నంతా ప్రశంసిస్తూంటారు.

"వెంకట్రావుకు పెళ్ళయిందా?" అన్నాడు ఈశ్వర్రావ్ వులిక్కిపడి.

"ఇప్పుడేంటి సార్? ఆయన పెళ్ళయి ఏణ్ణర్థం దాటిందట" అన్నాడు కానిస్టేబుల్.

"నువ్వు నిజమే చెబుతున్నావా? ఆ వీధిలో ఎవరైనా నీతో వేళాకోళం ఆడారేమో."

"అతనికి నిజంగా పెళ్ళయింది సార్. ఎగురింటాయనే చెప్పాడు. ఆయనకు నాతో అబద్ధం చెప్పాల్సిన అవసర మేముంటుంది?" అన్నాడు కానిస్టేబుల్.

అవును. వెంకట్రావు అబద్ధాలు చెబుతున్నాడని అంతా అబద్ధాలు చెబుతున్నట్లు ఎందుకనుకోవాలి? వెంకట్రావు తనకు పెళ్ళయిన విషయం బసవరాజుకు చెప్పి వుండడు. ఎందుకు చెప్పి వుండడు?

ఈశ్వర్రావు బుర్ర చురుగ్గానే పనిచేసింది. బసవరాజుకు స్త్రీ వ్యసనముంది. అతను ఎల్లప్పుడూ వెరైటీ కోరుతుంటాడు. వెంకట్రావుకు పెళ్ళయినట్లు తెలిస్తే అతడి భార్యనుకూడా బసవరాజు కోరవచ్చు. బసవరాజు భార్య చెప్పిన ప్రకారము వెంకట్రావు అందుకు అభ్యంతరం చెప్పలేదు. అయితే యెంత వ్యక్తిత్వం లేనివాడికయినా కొంత అభిమానం ఉంటుంది. అందుకని వెంకట్రావు తనకు వివాహమైన విషయాన్ని రహస్యంగా వుంచి వుంటాడు.

ఈ ఆలోచన రాగానే ఈశ్వర్రావుకు వెంకట్రావు మీదా, అతని పరిస్థితులపైనా జాలివేసింది. ఈలోకంలో మెత్తని మనుషులకు రోజులుకావు. పొగరుగా వుంటేనే మంచిది.

ఆఫీసునుంచి అతనికి తెలియకుండా వెంకట్రావు దస్తూరీ సంపాదించి తన దగ్గరున్న కార్డుమీద దస్తూరీతో పోల్చి రెండూ ఒకరివేనని రూఢి చేసుకున్నాడు. అది అయ్యేక ఈశ్వర్రావు మళ్ళీ వెంకట్రావును కలుసుకున్నాడు.

"ఏమిటిసార్—మళ్ళీ నాకోసం వచ్చారు!" అన్నాడు

వెంకట్రావు కంగారుగా.

"నువ్వు నాకు కొన్ని అబద్ధాలు చెప్పావు. అలా యెందుకు చెప్పావో తెలుసుకుందామని వచ్చాను—" అన్నాడు ఈశ్వర్రావు. అంటూనే అతను తన జేబులో నుంచి కార్డుతీసి వెంకట్రావుకు చూపించి, "దీనిప్రకారం నీకు బసవరాజు రాకగురించి ముందే తెలుసు. బుకాయించి లాభంలేదు. ఆయన్ను నువ్వు కలుసుకున్నావు. తర్వాత ఏం జరిగిందో చెప్పు" అన్నాడు.

వెంకట్రావు కార్డుని పరిశీలించి చూసి—"మీరు నన్ను యింతగా యెందుకు అనుమానిస్తున్నారో నాకు అర్థం కావడంలేదు. నేనేం తప్పుచేశాను?" అన్నాడు.

"అబద్ధాలాడడం నువ్వు చేసిన మొదటి తప్పు—" అన్నాడు ఈశ్వర్రావు.

"అయితే ఇకమీదట అన్నీ నిజాలే చెబుతాను. దయ చేసి నా వెంటపడకండి. బసవరాజు నాకు ఉత్తరము రాశాడు. నే నాయనకు జవాబు రాశాను. కానీ నాకు ఆయన్ను కలుసుకోవడం ఇష్టంలేదు. అందుకని యిక్క డకు వచ్చేక ఆయన్ను కలుసుకునే ప్రయత్నం చేయలేదు. ఇవన్నీ వివరంగా మీకు చెప్పడమెందుకులే అనుకుని ఆయ నొస్తున్నట్లు నాకు తెలియదని అబద్ధం చెప్పాను. మీ రింతలా వాకబు చేస్తారని నాకు ముందే తెలిసివుంటే ఈ అబద్ధాలు చెప్పివుండేవాణ్ని కాను—" అన్నాడు వెంక ట్రావు.

"పోనీలే— నేనోసారి మీ ఇంటికి వద్దామనుకుంటు న్నాను. నీకేం అభ్యంతరం లేదుగదా—"

"నా ఇంటికా, ఎందుకు?" అన్నాడు వెంకట్రావు

కంగారుగా.

"అక్కడే చెబుతాను—" అన్నాడు ఈశ్వర్రావు.

కాదనలేక వెంకట్రావు ఈశ్వర్రావును తనింటికి తీసుకు వెళ్ళాడు.

ఇంటికి తాళం పెట్టి వుంది. వెంకట్రావు తనే తాళం తీశాడు.

"ఇంట్లో మీ వాళ్ళెవ్వరూ లేరా?" అన్నాడు ఈశ్వ ర్రావు.

"నా భార్య పుట్టింటికి వెళ్ళింది—" అన్నాడు వెంక ట్రావు.

"నీకు పెళ్ళయిందా?" ఆశ్చర్యం నటిస్తూ అన్నాడు ఈశ్వర్రావు — "బసవరాజు భార్య నీకింకా వివాహం కాలేదనీ, తమకు తెలియకుండా నీ వివాహం కాదనీ చెప్పింది—"

వెంకట్రావు ప్రశ్నార్థకంగా ఈశ్వర్రావు వంక చూసి "మీకు నామీద ఇంకా చాలా అనుమానాలున్నట్టు న్నాయి. నేను నిజంగా నిర్దోషిని. నాకు బసవరాజు కుటుంబంపువాళ్ళ అహంకారం చూస్తే అసహ్యం. అందుకే వాళ్ళకు నా గురించి ఏమీ చెప్పను. ఒకప్పుడు నన్నాదు కున్నావారు కాబట్టి ముఖంమీద వారిని తెగనాడలేను" అన్నాడు.

ఈశ్వర్రావు వెంటనే అక్కణ్ణించి కదల్లేదు. అతన్ని అవీయివీ ప్రశ్నిస్తూనే అక్కడి పరిస్థితులన్నీ గమనిస్తూ వున్నాడు. అలా చూడ్డంలో అక్కడున్న ఆల్బం అందు కుని "ఫోటో ఆల్బంలా వుందే" అన్నాడు.

వెంకట్రావు ముఖం చిన్నది చేసుకొని కూర్చున్నాడు

తప్పితే యేమీ అనలేదు. ఈ ఇన్‌స్పెక్టర్ ఎప్పుడు వెళ్ళి పోతాడా అని చూస్తూన్నాడు.

ఈశ్వర్రావు ఆల్బం తిరగేస్తూ "ఈమె యెవరూ?" అన్నాడు.

"నా భార్య" అన్నాడు వెంకట్రావు.

"యూ ఆర్ లక్కీ గై. షి ఈజ్ వెరీ చార్మింగ్" అన్నాడు ఈశ్వర్రావు.

వెంకట్రావు ముఖంలో రవంత సంతోషంకూడా కనబడలేదు. "థాంక్స్" అన్నాడు పొడిగా.

"మీ అత్తారి దే వూరు—" అన్నాడు ఈశ్వర్రావు యథాలాపంగా అడిగినట్లు. ఒక పర్యాయం వెంకట్రావు భార్యను కలుసుకొని కొన్ని ప్రశ్నలు వేయాలని అతననుకుంటున్నాడు.

"హైదరాబాదు. అడ్రస్ నాకు తెలయదు. నేను ఆమెను ప్రేమించి పెళ్ళిచేసుకున్నాను. ఇంతవరకు ఒక్కసారికూడా నేను అత్తారింటికి వెళ్ళలేదు. అప్పుడప్పుడు తనొక్కతే వెళ్లొస్తుంది" అన్నాడు వెంకట్రావు.

ఇదింకో అబద్ధమై ఉంటుందని ఊహించాడు ఈశ్వర్రావు. అలా పైకి అనడం ఇష్టంలేక "ఇంతకీ నీ భార్య పుట్టింటికి వెళ్ళి ఎంతకాలమైంది?" అన్నాడు.

అప్రయత్నంగా అతను చెప్పిన తేదీకి ఈశ్వర్రావు ఉలిక్కిపడ్డాడు. సరిగ్గా ఆదేరోజున బసవరాజు అశోకా హోటల్ వదిలిపెట్టి మాయమయ్యాడు.

# 8

ఇన్‌స్పెక్టర్ ఈశ్వర్రావు ఆలోచిస్తూ కూర్చున్నాడు. బసవరాజు అసలు ఏమయ్యాడు? కావాలని అండర్

గ్రౌండ్‌లోకి వెళ్ళిపోయాడా? బసవరాజు అండర్ గ్రౌండ్‌లోకి వెళ్ళడానికి కారణమేమిటి? చెయ్యరాని నేరమేదయినా చేశాడా?

ఈ మిస్టరీ కొంతయినా వెంకట్రావు భార్యద్వారా తేలవచ్చునని ఈశ్వర్రావు ఆలోచన. తన భార్య పుట్టింటి గురించి వెంకట్రావ్ చెప్పినమాటలు అతను నమ్మలేదు.

ఆమె అడ్రస్ సంపాదించడం కోసం అతను ఒకసారి వెంకట్రావ్ లేని సమయంలో ఇల్లంతా శోధించాడు. అతని శ్రమ వృధాపోలేదు. వెంకట్రావ్ ఈశ్వర్రావ్‌తో దారుణమైన అబద్ధం చెప్పాడు. అతని మామగారి అడ్రస్ ఇంట్లో ఉంది.

ఈశ్వర్రావ్ ఆ ఊరువెళ్ళి వెంకట్రావ్ మామగార్ని కలుసుకున్నాడు. శకుంతల భర్తదగ్గరే ఉన్నదని ఆయన చెప్పాడు.

ఈసారి ఈశ్వర్రావ్‌కు కలిగిన ఆశ్చర్యమింతా అంతా కాదు. ఇందులో ఏదో పెద్ద గూడుపుఠాణీ ఉన్నట్లు కనబడుతోంది. వెంకట్రావ్ అబద్ధాలమీద అబద్ధాలాడుతున్నాడు. వాటం చూస్తూంటే మాయమైన వ్యక్తులు ఇద్దరు. ఒకరు బసవరాజు. రెండో మనిషి శకుంతల.

ఇద్దరి గురించీ ఎవ్వరూ ఫిర్యాదు చేయలేదు. కానీ ఇద్దరూ మాయమైనట్లే వుంది. ఇద్దరూ కలిసే మాయమయ్యారా, విడివిడిగా మాయమయ్యారా?

ఈశ్వర్రావ్ వెంకట్రావ్ మామగార్నడిగి ఆయనకూ, ఆ ఇంట్లోవాళ్ళకూ వెంకట్రావ్‌మీద చాలా మంచి అభిప్రాయమున్నదని గ్రహించాడు. ఎందరి దృష్టిలోనో ఇంత మంచివాడుగా కీర్తించబడుతున్న యీ వెంకట్రావ్

నిజంగా మంచివాడేనా? అందరూ అనుకునేటంత మెత్తని తనం, అమాయకత్వం అతనిలో ఉన్నాయా? ఉన్నపక్షంలో అతను ఒక పోలీస్ ఇన్స్పెక్టర్తో ఇన్ని అబద్ధాలెలా ఆడగల్గుతున్నాడు? అతని పిరికితనమే అతని చేత అబద్ధాలాడిస్తోందా?

ఈశ్వర్రావ్ తన పట్టుదల వదలిపెట్టకుండా మళ్ళీ వెంకట్రావ్ని కలుసుకొని "నీ భార్య కనపట్టంలేదని ఓ ఫిర్యాదు రాసియ్యి. దర్యాప్తు చేస్తాను" అన్నాడు.

వెంకట్రావ్ కంగారుగా "నిక్షేపంలా ఆమె పుట్టింటికి వెడితే కనబడ్డంలేదని ఫిర్యాదెందుకిస్తాను?" నన్నాడు.

"నీ భార్య తన పుట్టింట్లో లేదు. నీ మామగారు ఆమె క్షేమంగా నీ వద్ద ఉందన్న భ్రమలో ఉన్నాడు—" అన్నాడు ఈశ్వర్రావ్.

వెంకట్రావ్ ముఖంనిండా చెమటలు పట్టాయి— "మా అత్తారింటి అడ్రస్ మీకెలా వచ్చింది" అన్నాడు.

"నువ్వు చెప్పకపోతే నేను సంపాదించలే ననుకున్నావా? నా పద్ధతులు నాకుంటాయి. అబద్ధాలమీద అబద్ధాలు చెప్పడంవల్ల నీమీద అనుమానం నానాటికీ బలపడి పోవడంతప్ప మరో ప్రయోజన ముండదు. అసలేం జరిగిందో చెప్పకూడదూ?" అన్నాడు ఈశ్వర్రావ్.

వెంకట్రావ్ ఒక్కక్షణంపాటు నిశ్శబ్దం వహించి— "మీరు నా ఇంటిగుట్టు రచ్చకీడ్చ దలుచుకున్నట్లు కనబడుతున్నారు. నిజం చెప్పక తప్పదా?" అన్నాడు.

"తప్పదు—" అన్నాడు ఈశ్వర్రావ్.

"ఇది పూర్తిగా నా వ్యక్తిగత విషయం. ఇందులో పోలీస్ డిపార్ట్మెంటుకు సంబంధించిన గొడవలేమీ లేవు.

అయినా సరే చెప్పక తప్పదా?"

"అదంతా నిర్ణయించవలసిన వాణ్ని నేను కానీ నువ్వుకాదు. ఇది పోలీస్ డిపార్ట్మెంటుకు సంబంధించని విషయమయితే—రహస్యాన్ని నీకంటె కూడా భద్రంగా నేను దాస్తాను. ఆ బెంగ పెట్టుకోకు. నిజం చెప్పు—" అన్నాడు ఈశ్వర్రావ్ ఉత్సాహంగా—ఇప్పటికి వెంకట్రావ్ దారికి వచ్చినందుకు సంతోషిస్తూ.

"ఏం చెప్పుకోను. నా భార్య నన్ను వదిలిపెట్టేసి ఎవడితోనో లేచిపోయింది. ఈ నిజాన్ని పదిమందికీ ఎలా చెప్పుకునేది?" అంటూ తల పట్టుకున్నాడు వెంకట్రావ్.

ఉలిక్కిపడిన ఈశ్వర్రావ్ — "ఎవరితోటి—బసవరాజుతోటా?" అన్నాడు.

"ప్లీజ్—ఆ బసవరాజు గురించి నాకేమీ తెలియదు. దయుంచి నన్నేమీ ఆ వివరాలడక్కండి" అంటూ వెంకట్రావ్ రెండు చేతుల మధ్యనూ ముఖం కప్పుకుని వెక్కి వెక్కి ఏడ్వసాగాడు.

ఈశ్వర్రావ్ అక్కణ్నించి వీలైనంత తొందరగా తప్పుకున్నాడు.

## 9

ఈశ్వర్రావ్ మనసు చాలా నొచ్చుకుంది.

అనవసరంగా తను ఒక అమాయకుణ్ని వెంటపడి తరిమాడు. మానసికంగా కుమిలిపోతున్న ఒక దౌర్భాగ్యుడి గాయాన్ని కెలికి కెలికి వదిలిపెట్టాడు.

ఇంతకీ కేసులేదు. ఫిర్యాదులేదు. ఊరికే తీరి కూర్చుని పనిలేని మంగలి సామెతగా తను యీ కేసు చేపట్టి వెంకట్రావ్‌ని కలవరపరిచాడు.

వెంకట్రావ్ అసమర్థుడిగా, చేతకాని వాడుగా అందరి చేతా భావించబడుతున్న వ్యక్తి. పెళ్ళయ్యాక అతనికి ఒక ఆలంబన దొరికి వుంటుంది. ప్రపంచంలో తనకు లభించే అపహాస్యాన్ని తను ఆమె సన్నిధిలో మరిచిపోతూండి ఉంటాడు. ఆమెను అతను ప్రాణాధికంగా ప్రేమించి ఉంటాడు. పువ్వుల్లో పెట్టుకుని చూసుకుని ఉంటాడు.

అటువంటి భార్య అతన్ని మోసగించడంతో అతను మానసికంగా బాగా దెబ్బతిని ఉంటాడు. ఆ దురదృష్ట వంతుడి వెంట తను పడ్డాడు.

ఇప్పుడు తను ఏం చేయాలి? తను తెలుసుకున్న విశేషా లన్నీ అలా గాలికి వదిలేయడమేనా? బసవరాజు ఏము య్యాడో, శకుంతల ఏమయిందో కనుక్కోనవసరం లేదా? వాళ్ళు మాయమైనట్లు తనకు తెలుసు. బాధ్యతగల పోలీసు అధికారిగా తను ఏం చేయాలి?

శకుంతల ఎవరితో లేచిపోయింది? బసవరాజుతో నేనా? బసవరాజుతో ఆమె ఎందుకు లేచిపోయింది? భర్తపట్ల అసంతృప్తా. లేక బసవరాజు డబ్బా—అందుకు కారణం? వారి దాంపత్యం అన్యోన్యమైనదని చుట్టుపక్కలవారు మెచ్చుకున్నారు. అటువంటప్పుడీ మార్పు ఆమెలో ఎలా వచ్చింది?

హఠాత్తుగా ఈశ్వర్రావ్‌కు ఒక విచిత్రమైన అను మానం వచ్చింది. కొంపదీసి బసవరాజు వెంకట్రావ్ భార్యను కోరుకోలేదుగదా? వెంకట్రావ్ పనుపున శకుం తల బసవరాజు దగ్గరకు వెళ్ళలేదుగదా! ఈ విషయంలో వెంకట్రావ్ అసహాయతగురించి బసవరాజు భార్య చెప్పనే చెప్పింది.

ఈ అనుమానం కలిగినప్పటి నుంచీ అది ఈశ్వర్రావులో బలపడసాగింది. ఇందు గురించి ఆలోచిస్తూండగా అతనికి ఒక విషయం స్ఫురించింది. వెంటనే తన దగ్గరున్న శకుంతల ఫోటోతో అతను అశోకా హోటల్ కు వెళ్ళి అక్కడి రిసెప్షనిస్టుకు చూపించాడు.

"ఈమెను ఒకసారి చూస్తే మళ్ళీ మరిచిపోవడం కష్టం. బసవరాజు మాయమైన రోజున రాత్రి తొమ్మిది గంటల ప్రాంతంలో అతడి గదికి వెళ్ళిన అందమైన యువతి ఈమేనని ఖచ్చితంగా చెప్పగలను" అన్నాడు రిసెప్షనిస్టు.

ఈశ్వర్రావుకు బుర్ర తిరిగినట్టయింది.

బసవరాజు, వెంకట్రావ్ ఆఫీసుకి ఉత్తరాలు రాస్తాడు. అందువల్ల వెంకట్రావ్ స్వయంగా చెబితేతప్ప శకుంతలకు అతని రాకగురించి తెలియదు. వెంకట్రావ్ పంపితేతప్ప శకుంతల, బసవరాజు గదికి వెళ్ళే అవకాశం లేదు.

అంటే వెంకట్రావ్ తన భార్యను బసవరాజు గదికి పంపాడా. ఇది సాధ్యమా?

సాధ్యమే అయుండాలి. ఈ సంఘటనతో శకుంతలకు వెంకట్రావ్ అంటే అసహ్యంవేసి ఉంటుంది. అటువంటి చేతకాని భర్తతో కాపురం చేసేకంటె బసవరాజువంటి ధనికుడికి శాశ్వతంగా ఉంపుడుకత్తెగా వుండడం మంచిదని భావించి ఉంటుంది.

ఈ విషయంలో తను ఇంక ముందడుగు వేయాలనుకోవడం శుద్ధదండగ. వెంకట్రావ్ కు భార్యపట్ల ఆసక్తి లేదు. ఆ విషయం అతను స్పష్టంగా చెప్పాడు. ఇక మిగిలిందల్లా బసవరాజు భార్య. పరిస్థితులు వివరంగా తెలి

శాక ఆమె యేమయినా ఫిర్యాదు ఇవ్వదల్చుకుంటే తను అప్పుడు ముందడుగు వేసినా అర్థముంటుంది. లేకపోతే ఊరుకోడం ఉత్తమం.

ఈశ్వర్రావ్, బసవరాజు భార్యను కలుసుకొని సంగతులన్నీ వివరంగా చెప్పాడు.

"నాకు తెలుసు. వెంకట్రావ్ కృతజ్ఞత అలాంటిదని! వాడు మా కోసం ఏమైనా చేయగలడు. అసలు పెళ్ళి విషయం దాచిపెట్టడమే నాకు ఆశ్చర్యంగా ఉంది" అంది బ. భా.

"అది సరేలెండి కానీ మీ భర్త విషయం ఏమిటి? ఆయన కనబడడం లేదని ఒక ఫిర్యాదు ఇవ్వకూడదూ? ఈ మిస్టరీ అంతా విడగొట్టడానికి నాకు అవకాశముంటుంది" అన్నాడు ఈశ్వర్రావ్. ఈ కేసు అతనికి చాలా ఆసక్తికరంగా ఉంది.

"కావాలని అజ్ఞాతవాసం చేస్తున్న బసవరాజుగారి గురించి మీ కెందుకొచ్చిన శ్రమలెండి! ఇలాంటి విషయాల్లో మీ జోక్యం వద్దు. ఎవరి కారణాలు వారికుంటాయి" అంది. బ. భా.

"ఆయన కావాలని అజ్ఞాతవాసం చేస్తున్నాడని ఎలా చెప్పగలరు? ఏదైనా ఆపదలో వున్నాడేమో—పోలీసులు కలగజేసుకోనిదే అసలు రహస్యం ఎలా బయటపడుతుంది?"

"ఆ బాధ మీది కాదు—నాది!" అంది బ. భా.

"అసలు బసవరాజుగారు జీవించి వున్నాడని ఎలా చెప్పేది?" అన్నాడు ఈశ్వర్రావ్ ఆమెను రెచ్చగొట్టే వుద్దేశ్యంలో.

"ఆ సందేహం మాత్రం నాకు లేదు. ఎందుకంటే ఆయన రెండ్రోజుల క్రితం వచ్చి నన్ను పలకరించి వెళ్ళేరు. వెళ్ళిపోతూ తనగురించి కలతచెందవద్దనీ తను రావడం ఆలశ్యమవుతుందనీ అన్నారు. ఇంత ఆస్తి వుండగా ఆయన గురించి నాకు కలతలెందుకూ?" అంది బ. భా.

"ఏమిటీ? బసవరాజుగారు మీ దగ్గరకు వచ్చేడా?" అన్నాడు ఈశ్వర్రావ్ ఆశ్చర్యతో.

"అందుకే యీ కేసు గురించి మీరింక మరిచిపొండి" అంది బ. భా.

# 10

"సమస్కారం" అన్నాడు వెంకట్రావ్.

"నువ్వా? అలా కూర్చో" అంది బసవరాజు భార్య సాదరంగా.

వెంకట్రావ్ కూర్చుని—"ఒక చిన్న సందేహం తీర్చుకునేందుకు మీ దగ్గరకు వచ్చాను" అన్నాడు.

"మంచి పని చేశావు—నేనూ నీ గురించి కబురు పెడదామనుకుంటున్నాను. నీతో నాకూ్కడా ముఖ్యమైన పని వుంది" అంది బ. భా.

"నాతో మీకు పనా?" అన్నాడు వెంకట్రావ్ ఆశ్చర్యంగా.

"అవును. ఇందులో ఆశ్చర్యమేమీ లేదు. కానీ ముందు నీ సందేహమేమిటో చెప్పు."

"ఏమీ లేదు—నాలుగు రోజుల క్రితం బసవరాజు గారు మిమ్మల్ని కలుసుకున్నారని విన్నాను. ఈ వార్త నాకు నమ్మబుద్ధికాలేదు. నిజం తెలుసుకుందామని వచ్చాను" నసిగాడు వెంకట్రావ్.

"ఎవరు చెప్పారు నీకీ విషయం—ఇన్స్పెక్టర్ ఈశ్వ

రావా?" అనడిగింది బ. భా.

అవునన్నట్లుగా తలాడించాడు వెంకట్రావ్.

"అతనింకా నిన్ను వదిలిపెట్టలేదా?"

"ఈ దెబ్బతో ఇంక వదిలిపెట్టినట్లే. కానీ అర్థాంతరంగా మాయమైపోయిన బసవరాజుగారు మీ దగ్గరకొచ్చారంటే నమ్మలేకపోతున్నాను."

"నీ అనుమానం నిజమే—బసవరాజుగారు నా దగ్గరకు రాలేదు. ఇన్స్పెక్టర్ యీ కేసు వదిలిపెడతాడని చిన్న అబద్ధం చెప్పాను" అంది బ. భా.

"ఇన్స్పెక్టరు యీ కేసు వదిలిపెడితే మీకు లాభమేమిటి?" అన్నాడు వెంకట్రావ్ ఆశ్చర్యపోతూ.

"నా భర్త ఇంతకాలం అజ్ఞాతంలో వుండడు. ఆయన ఏదో పెద్ద ప్రమాదంలో ఇరుక్కున్నాడని నా అనుమానం. ఇంక ఆయన తిరిగి వస్తాడనికూడా నాకు తోచదు. ఆయన తిరిగి రాకూడదన్నది నా ఆశ. ఆయనకు పోలీసుల రక్షణ లభించకూడదన్నది నా అభిమతం. అందుకే యీ విషయంలో పూర్తి నిర్లిప్తత వహించాను" అంది బ. భా.

వెంకట్రావ్ ఆశ్చర్యం పెరిగింది—"మీ భర్త తిరిగి రావడం మీ కిష్టం లేదూ? ఇది నాకు చాలా ఆశ్చర్యంగా వుంది."

"ఇందులో ఆశ్చర్యానికేముంది? అలాంటి భర్తను ఏ ఆడదీ కోరుకోదు. ఏ జన్మలోనో నేను చేసిన పాపానికి ఫలితంగా అటువంటి భర్త నాకు లభించాడు. అతి స్వల్ప కాలంలోనే నాకు జీవితంమీద విరక్తి పుట్టింది. ఏదో యోగినిలా కాలం గడిపేస్తున్నాను. అటువంటి నాకు ఆయన మాయం కావడమన్నది వరప్రసాదం" అంది

బ. భా.

"ఇలా ఎంతికాలం గడుపుతారు? ఏదో ఒక రోజున మీరు మీ భర్తగురించి పోలీసులకు ఫిర్యాదివ్వక తప్పదు గదా!"

"అవును — అయిదారు నెలలుపోయాక లాంఛన ప్రాయంగా ఆ పని చేస్తాను. అప్పటికాయన పని అయి పోతుందనే నా ఆశ" అంది బ. భా.

"ఆ తర్వాత?" అన్నాడు వెంకట్రావ్.

"ఆ తర్వాత ఆతని జాడ తెలియలేదని పోలీసులు దృవ పర్చగానే మళ్ళీ పెళ్ళి చేసుకుంటాను...." అంది బ. భా. పరీక్షగా వెంకట్రావ్‌ను చూస్తూ.

"మళ్ళీ పెళ్ళా? జరిగే పనేనా?" అన్నాడు వెంక ట్రావ్ మళ్ళీ ఆశ్చర్యపోతూ.

"బ్యాంకులో నా పేరున అయిదు లక్షల రూపాయ లున్నాయి. ఇదికాక ఇంకా నా భర్త ఆస్తి వుంది. నా క్కాకపోతే మరెవరికి మళ్ళీ పెళ్ళి సాధ్యపడుతుంది?"

వెంకట్రావ్ ఆమెను పరీక్షించి చూస్తూ — "మీరు మాట్లాడే పద్ధతినిబట్టి చూస్తూంటే వరుడుకూడా సిద్ధం గానే వున్నాడనిపిస్తోంది" అన్నాడు.

"నువ్వు సరిగానే ఊహించావు" అంది బ. భా.

ఉలిక్కిపడ్డాడు వెంకట్రావ్ — "అంటే—ఎవరా అదృష్టవంతుడు?"

"ఇంకెవరు—నువ్వే—ఈ విషయం మాట్లాడాలనే నీ గురించి కబురు పెడదామనుకున్నాను. అనుకోకుండా నువ్వే వచ్చావు."

వెంకట్రావ్ కంగారుగా—"నేను.... నేను.... బసవ రాజు ఇంటి కుక్కలాంటి వాణ్ణి. అలాంటిగి నేనా ఇంటికి

యజమానిని కాపాడడమా?" అన్నాడు.

"అవును. కానీ నిన్ను కుక్కతో పోల్చడం నా కిష్టం లేదు. నువ్వు విశ్వాసపాత్రుడివి. కృతజ్ఞత అన్నపదానికి అర్థం చెప్పినవాడివి. నీ అంత మంచివాడు నాకు భర్త అయితే ఇంతకాలం నే ననుభవించినది ఒక పీడకలగా మరిచిపోయి నీతో స్వర్గతుల్యమైన జీవితం గడపగల్గుతాను" అంది బ. భా.

వెంకట్రావ్ ఆమె ముఖంలోకి చూడకుండా-"నన్ను క్షమించండి. నేనిందుకు అంగీకరించలేను" అన్నాడు.

దెబ్బ తిన్నట్లు అతనివంక చూసిందామె-"ఆడదాన్ని, పెద్దింటిదాన్ని నోరువిడిచి అడిగినందుకు లోకువయ్యానా?" అంది.

అతను అడ్డంగా తల ఊపాడు.

"ఒకప్పటి గౌరవభావం నన్ను భార్యగా ఊహించుకోనివ్వలేక పోతోందా?"

కాదన్నట్లు మళ్ళీ తల అడ్డంగా తిప్పాడతను.

"అయితే మరేమిటి?"

"నేను చెప్పలేను. నన్ను వెళ్ళనివ్వండి" అన్నాడు వెంకట్రావ్.

"వెళ్ళనివ్వను. ఈ అవమానాన్ని నేను భరించలేను. నువ్వు కారణం చెప్పకపోతే నీ కళ్ళముందే ఆత్మహత్య చేసుకు చచ్చిపోతాను" అంటూ చేతికున్న ఉంగరంలోని వజ్రాన్ని పీకిందామె. వెంకట్రావ్ కంగారుగా ఆమెవంక చూశాడు.

"త్వరగా చెప్పు-నన్నెందుకింతలా అవమానించావు?"

"మిమ్మల్ని అవమానించాల్సిన అవసరం నాకు లేదు. ఒక హంతకుణ్ని మీరు భర్తగా స్వీకరించగలరా?"

అన్నాడు వెంకట్రావ్.

"నువ్వు హంతకుడివా?" అంది ఆశ్చర్యంగా బ. భా.

"అవును. బసవరాజును నేనే చంపాను. నది ఒడ్డు రమ్మనమని ఫోన్ చేశాను. వచ్చాడు. నేను చంపుతానని తెలియక అజాగ్రత్తగా వున్నాడు. ముందు మత్తుమందిచ్చి తర్వాత పీకపిసికి చంపేశాను. అక్కడికి స్మశానం దగ్గర్లోనే వుంది. కాటికాపరికేవో అబద్ధాలు చెప్పి గొయ్యి తవ్వించి ఆయన్నక్కడ పూడ్చేశాను. ఇంటికొచ్చి నా పెళ్ళాన్నికూడా అదే పద్ధతిలో చంపి దొడ్లో గొయ్యి తీసి పూడ్చేశాను. ఈ విధంగా రెండు హత్యలు చేసిన నన్ను మీరు భర్తగా ఆహ్వానిస్తున్నారు."

బ. భా. ఇంచుమించుగా అరిచింది — "ఎందుకు చేశావా హత్యలు?"

"ఎందుకో చేశాను. నా గురించి మరిచిపోయి నన్ను వదలండి. నాకంటే మంచివాడిని ఎన్నుకోండి" అంటూ అక్కణ్నించి కదిలాడు వెంకట్రావ్.

ఆమె దృఢంగా అంది—"వెంకట్రావ్! నేను నిన్ను నాలుగేళ్ళుగా ఎరుగుదును. నువ్వు హత్యలు చేయగలవంటే నేను నమ్మలేను. ఒకవేళ నిజంగానే నువ్వు హత్యలు చేసి వుంటే-ఎంతటి సామాన్యుణ్ణికూడా హత్యకు పురిగొల్పేంత ఘోరం ఏదో జరిగి వుండాలి. అందువల్ల నువ్వు హంతకుడివైనా నాకు నీమీద నమ్మకం నశించదు. నీతోడి జీవితం నాకు హాయిగా వుంటుందనే నాకు నమ్మకం. కాబట్టి కాదనకు. నాకు నువ్వంటే ఇష్టం...."

వెంకట్రావ్ యీ పర్యాయం నిశ్చేష్టుడైపోయాడు. తను హంతకుడని తెలిశాకకూడా ఈమె తనను తన జీవితంలోకి ఆహ్వానిస్తోంది. ఇదెక్కడి విడ్డూరం?

"ఏ పరిస్థితుల్లోనూ మన వివాహం జరుగదు" అన్నాడు వెంకట్రావ్.

తనింతగా చెబుతున్నా అతను వినకపోయేసరికి ఆమె మళ్ళీ ఆత్మహత్యకు సిద్ధపడింది.

"ఆగండి-మిమ్మల్ని అవమానించాలన్నది నా అభిమతం కాదు. నేను మిమ్మల్ని వివాహం చేసుకోలేకపోవడానికి బలమైన కారణముంది. నాకు ఎనిమిదేళ్ళ వయసున్నప్పట్నించీ మీ భర్త బసవరాజు తెలుసు. ఆయన తిని వది లేసిన ఎంగిలి మెతుకులు తిని ఇంతవాడినైనాను. అయితే ఆయన నన్నెప్పుడూ మనిషిగా చూడలేదు. కుక్కలాగే చూశాడు. తన ఎంగిలి మెతుకులు తిని బ్రతికేవాడినని అస్తమానూ అనేవాడు. గత్యంతరంలేక ములుకుల్లాంటి ఆ మాటల్నీ, అమానుషమైన ఆ ప్రవర్తననీ సహించాను.

ఆరేడేళ్ళప్పుడు ఆయన—"ఒరేయ్ వెంకట్రావ్-నేను తిని విడిచిన తిండి తిని, కట్టి,విడిచిన బట్టకట్టి, నా దయా ధర్మ భిక్షంతో యీ స్థితికి వచ్చావ్. ఇది కలకాలం గుర్తుంచుకోవాలంటే ఓ పని చేయాలి. పెళ్ళి నూరేళ్ళ పంట అంటారు. మంచి అందమైన పిల్లను చూసి పెళ్ళి చేసుకో. కానీ ముందు నా కప్పగించి తర్వాత నువ్వు స్వంతం చేసుకో. కృతజ్ఞతను ప్రకటించుకునే విధానం అది" అన్నాడు.

అప్పట్నించీ నాకు భయం పట్టుకుంది. కోపంకూడా వచ్చింది. ఆయనకి చెప్పకుండా పెళ్ళి చేసుకున్నాను. అయితే నా మనసులో ఓ కోరిక వుంది. ఇన్నాళ్ళు ఆయన ఎంగిలి మెతుకులు నేను తిన్నాను. ఒక్కసారి ఆయనకు నా ఎంగిలి మెతుకులు తినిపిస్తే!

ఈ ఉద్దేశంతో నేను వాడుకున్న ఆడపిల్లను ఆయనకు అప్పగించాలన్న బుద్ధి పుట్టింది. అలా చేయడానికి పవిత్రురాలైన ఆడపిల్ల నా పెళ్ళాంకంటె నమ్మకమైన దెక్కడుంటుంది? ఆమెను ఎలాగో అలా ఒప్పించి ఆయనదగ్గరకు పంపాను. అది నా భార్య అని ఆయనకు తెలియదు.

అయితే నా పెళ్ళాం ఆయన దగ్గరకు వెళ్ళి వెనక్కి వచ్చేసింది. కారణం తెలుసా? నాతో పెళ్ళికి ముందే బసవరాజు దాన్ని బలవంతంగా, క్రూరంగా అనుభవించాడు. బసవరాజుకు నా ఎంగిలి మెతుకులు తినిపించాలన్న నా జీవితాశయం నెరవేరకపోగా, నా పెళ్ళి విషయంలో కూడా ఆయన ఎంగిలి మెతుకులే తిన్నానన్న ఆవేశం నా చేత రెండు హత్యలు చేయించింది. ఇప్పుడు మళ్ళీ నా జీవితంలోకి అడుగుపెడదామనుకుంటున్న మీరు—బసవరాజుకు పాత భార్య! ఆ ఒక్క కారణం చాలు—నేను మిమ్మల్ని అంగీకరించలేకపోవడానికి!" అని అతను అక్కణ్నించి త్వరత్వరగా వెళ్ళిపోయాడు.

బసవరావు భార్య మనసు వెంకట్రావ్ పట్ల జాలితో నిండిపోయింది. భర్త చనిపోయాడని విన్నాకకూడా ఆ జాలిలో రవంతకూడా అతనిపట్ల కలగకపోవడం ఆమెకు ఆశ్చర్యంగా వున్నట్లు లేదు.

—: అయిపోయింది :—

# ఆర్తనాదం!

## ఏ. వీ. మోహన్రావ్

రోజూ నిద్ర లేవగానే, మైలు దూరం నడిచి వెళ్ళి, రేస్ కోర్స్ గోడ దూకి, లోనికి వెళ్ళి, గుర్రంలా అరగంటసేపు పరుగెత్తడం, నా కలవాటు.

ఆ గ్రౌండ్ వెనకవైపు కాంపౌండ్ గోడ లేదు. ముళ్ళ తీగ కంచెలా నాటివుంచారు. దాని అవతల దట్టమైన చెట్లతో వున్న తోట వుంది. దాని విస్తీర్ణం రమారమి రెండువందల ఎకరాల పైనే వుంటుంది. అందులో అక్కడక్కడా చిన్న చిన్న కుటీరాల్లాంటి ఇళ్ళు వున్నాయి. అవి మొత్తం కలిపి నాలుగో ఐదో వుండి వుంటాయను కొంటాను. ఆ ఇళ్ళ ఎవ్వరూ వుంటున్న జాడ లేదు.

ఆ రోజు వుదయం మామూలులాగే వెళ్ళాను. షర్టు తీసి ఒక చోట పెట్టి, బూట్లు లేసులు సరిచేసుకుని, పరుగెత్తసాగాను.

ఆ ఇళ్ళవేపు కొచ్చేసరికి, పెద్దగా "బాబోయ్! నన్ను

చంపుతున్నారు! రక్షించండి!" అంటూ పెద్దగా కేక విని పించింది.

కాళ్ళలోని వేగం తగ్గిపోయింది. అసంకల్పంగానే అలాగే ఆగిపోయాను. అదే కేక మళ్ళీ వినబడింది.

ఆ శబ్దం వచ్చిన దిక్కుకేసి చూశాను. ముళ్ళతీగ వెన కాతల చిన్న యిల్లు కనిపించింది. బహుశా అందులో నుండి ఆ శబ్దం వచ్చివుండాలనుకున్నాను.

క్షణంవృధా కాకుండా కంచెపైనుండి దూకాను అవతలి వేపుకు. పది గజాలు పరుగులాంటి నడకలో వెళ్ళి ఆ చిన్న యిల్లు చేరుకున్నాను.

దగ్గరగా చూస్తే యిల్లు చాలా అందంగా వుంది. ముందు పూల మొక్కల తోట కూడా కనిపించింది. ఎవరో స్త్రీ వంగి పూలు కోస్తున్నది.

"ఏమండీ?" కంగారు అణచుకుంటూ పిలిచాను కాస్త పెద్దగానే.

పూలు కోస్తున్న అమ్మాయి తలెత్తి నా వేపు చూసింది. ఆమె వదనం ప్రశాంతంగా, కళ్ళు అప్పుడే వాననీటిలో కడిగిన ముత్తెపు చిప్పల్లా మెరుస్తున్నాయి. నా పిలుపు ఆమెలో తొట్రుపాటుగానీ, ఆతృతగానీ, భయంగానీ, కలిగించిన భావనలేవీ నాకు తోచలేదు.

"సారీ! మిమ్మల్ని డిస్టర్బ చేసినట్లున్నాను!" అన్నాను నన్ను నేను తమాయించుకుంటూ.

"మంచినీళ్ళు కావాలా?" అడిగింది!

కాదన్నట్లు తల అడ్డంగా ఊపాను.

"సిగరెట్ కాల్చుకునేందుకు అగ్గిపెట్టె అడిగేందుకు వచ్చారా?" వ్యంగ్యంగా అడిగింది.

"కాదండీ! మీ కేదైనా ఆర్తనాదం వినిపించిందా?"

అడిగాను, ఆమె విని వుండనట్లు తోచటంతో.

"అందంగా వయసులో వున్న అమ్మాయి కనిపిస్తే, పలకరించి, పరాచికాలాడడానికి ఏవో కుంటి సాకులు చెప్పడం, కొంటె చేష్టలు చెయ్యడం మీకు మామూలే! నా విషయంలో మీరు పొరబడ్డారు. పెళ్ళయినదాన్ని. అందుకు ఋజువుకావాలంటే చూడండి" అంటూ మెళ్ళో నుంచి మాంగల్యం తీసి పైకెత్తి చూపించింది కోపంగా.

"సారీ మేడమ్! నన్ను గురించి తప్పుగా అనుకొంటున్నారు. ఎవరో హృదయవిదారకంగా 'నన్ను చంపుతున్నారు! రక్షించండి!' అంటూ కేకపెట్టారు. అది విని ఎకాయెకిన వచ్చాను." అన్నాను.

"ఎక్కడ విన్నారు?" అడిగిందామె తాళిబొట్టును సరిచేసుకుంటూ.

"ఇక్కడే! ఇటు వేపునుండే వచ్చిందా శబ్దం!"

"నాకు వినిపించలేదే! నేను దాదాపు అరగంటనుండి ఇక్కడే వున్నాను." అందామె.

నా ఇంద్రియాల సమరతపైన నాకే అనుమానం వేసింది. ఏం చెప్పాలో తెలియలేదు. నాకన్నా దగ్గరలో వుందామె. పైగా ప్రశాంతమైన వాతావరణంలో వుంది. అలాంటి ఆ రనాదమే వినిపించివుంటే ఖచ్చితంగా వినివుండేది. కానీ తను వినలేదంది. అంటే నేనే పొరబడివుండాలని తీర్మానించుకున్నాను.

"సారీ! మిమ్మల్ని అనవసరంగా యిబ్బందిపెట్టాను! క్షమించండి!" అంటూ ఆమె జవాబుకోసం ఎదురుచూడకుండా వెనక్కి వెళ్ళి ముళ్ళతీగ దాటి, రేస్‌కోర్స్‌లోకి వెళ్ళి, షర్టు తీసుకుని, స్కూటరెక్కి ఇల్లు చేరాను.

ఆ రోజంతా నిన్న ప్రొద్దున జరిగిన సంఘటన వెంటా

డుతూనే వుంది. ఆ ఆర్తనాదం స్టీరియోఫోనిక్ సౌండ్‌లా చెవుల్లో గింగురుమంటూనే వుంది. ఆ కంఠం మగవారిది. ఎవరో గొంతు పిసుకుతున్నప్పుడు అరచినట్లుగా వుంది. ఆఫీసులో కూడా చాలా నిరుత్సాహంగా వుండి పోయాను.

రాత్రి భోజనం చేసి ఇంటికి వచ్చాను. ఎంత తంటాలు పడ్డా నిద్ర పట్టలేదు. లాభంలేదని, రెండు పెగ్గులు విస్కీ తాగాను. నాకు తెలియకుండానే కళ్ళు మూసుకు పోయాయి.

## 2

తెల్లవారింది.

మళ్ళీ యథా ప్రకారం రేస్ కోర్స్‌కు వెళ్ళాను.

టైం చూసుకున్నాను. అంతకు ముందురోజు అక్కడికి చేరిన టైంకే మళ్ళీ అక్కడకు చేరుకున్నాను.

షర్టు విప్పి ఒక మూలన పెట్టి, పరుగెత్తడం ప్రారంభించాను. ఆ కుటీరం ప్రాంతానికి వచ్చాను. అంతకు ముందు రోజులాగే ఆ ఆర్తనాదం వినిపించింది.

వెనకా ముందూ చూడకుండా కంచె దాటి, ఆ కుటీరం దగ్గరకు వెళ్ళాను. ముందురోజు కనిపించిన ఆమె పూలు కోస్తూంది. నా బూట్ల శబ్దానికి కాబోలు తలెత్తి నావేపు చూసింది.

"మళ్ళీ ఆ ఆర్తనాదం వినిపించిందా?" ఆమే అడిగింది నవ్వుతూ.

అవునన్నట్లు తలూపాను.

"కాదు! నేను కనిపించాను. నన్ను చూడగానే వొంట్లోని నరాలు తిమ్మిరెక్కివుంటాయి. అందుకే ఇలా

కంచెలు దూకుతున్నావ్. ఇంకో మారిలా చేశావంటే మావారితో చెప్పి, ఎముకలు పిండి చేయిస్తాను!" ఆమె చెప్పే తీరును బట్టి, అంత పనీ చేయించడంలో నా కను మానం కలుగలేదు.

"ఏవండీ! నోట కాల్చినట్లు మాట్లాడటం సభ్యత కాదు. నాకింకా పెళ్లి కాలేదు! బ్యాంక్‌లో ఆఫీసరుగా వున్నాను. కావలసినంత అంటే అయిదారు లక్షల ఆస్తి వుంది. ఏకాకిని. మీకన్నా అందమైనవాళ్ళు పెళ్ళాడతా నంటున్నారు. కానీ నేనే ఇష్టపడటం లేదు!" అన్నాను నా గురించి ఆమె కొంత తెలుసుకోవడం మంచిదన్న ఉద్దేశ్యంతో.

"ఎందుకనో?" అడిగిందామె చిత్రంగా కళ్ళు తిప్పుతూ.

"నాకు నచ్చిన అమ్మాయి దొరక్క-" అన్నాను.

"ఎలాంటి అమ్మాయి కావాలో అదన్నా చెప్పండి! చూడనన్నా చూస్తాను. మీకీ కంచెలు దూకటం, అంద మైన ఆడవాళ్ళ వేపు వెర్రిమొహం వేసుకుని చూడటం లాంటి అనర్థాలన్నా తప్పుతాయి." అంది.

"కాస్త మర్యాదగా మాట్లాడటం మీకు రాదండీ!" అడిగాను ఈ మారు కోపంగానే.

"వచ్చు! మర్యాదస్తులతో .... మీలాంటి వాళ్ళతో మాత్రం నాకిలాగే మాట్లాడాలనిపిస్తుంది. నా మాట తీరు నచ్చకుంటే మాట కలుపడం మానేయండి...."అంది నిష్కర్షగా.

"మీరూ నాలానే ఆ ఆర్తనాదం వింటున్నారు. నా అనుమానం మీ ఇంట్లో ఎవరో్నే రోజూ హత్య చెయ్యా లని ప్రయత్నిస్తున్నారు. అతను అరుస్తున్నాడు.

మధ్యలో శనిగాడిలా నేను అడ్డు వస్తున్నాను. మీ ప్రయత్నం అందుకే కొనసాగడం లేదు. నన్ను బుకాయించి లాభం లేదు!" అన్నాను.

"ఆపద్బాంధవుడిలా నువ్వు వచ్చేటయిమ్‌కి హత్య చెయ్యాల్సిన అవసరమేమిటి? ఆ తర్వాతో అంతకు ముందో ఎందుకు చెయ్యగూడదు. అప్పుడు నీవు అడ్డు వుండవుగా." అడిగిందామె వెటకారంగా.

"ఆ గొంతునుబట్టి అతను ముసలివాడిలా అనిపిస్తూంది. మీ కెవరితోనో పడుచువాడితో సంబంధ మేర్పడి వుంటుంది. భర్తను వదలించుకోడానికి అతన్ని చంపాలని ప్రయత్నం చేస్తున్నారు. నే నీ విషయం పోలీసులకి చెప్పి మీ ఇంటిచుట్టూ పోలీసుల కాపలా పెట్టిస్తాను. అప్పుడేం చేస్తారో చూస్తాను." అన్నాను.

"అరపైసా ఖర్చులేకుండా రాత్రింబగళ్ళు మా ఇంటికి చుట్టూ పోలీసు కాపలా ఏర్పాటు చేస్తానంటూ వుంటే వద్దనేందుకు నే నేం దద్దమ్మనుగాను. అలాగే చెయ్యి!" అంది ఆమె.

"చేస్తాను! చేస్తాను!" అంటూ కోపంగా గిరుక్కున వెనక్కి తిరిగి వచ్చేశాను.

ఇంటికొచ్చాక బాగా ఆలోచించాను. పోలీసులదాకా ఈ కథ తీసుకెళ్ళి, వాళ్ళదగ్గర నవ్వులపాలు కావడం నాకిష్టం లేకపోయింది. అందువల్ల ఆ ప్రయత్నం మానేశాను.

రెండు దినాలనుండి జరుగుతున్న ఈ గొడవంతా ఎవరికన్నా చెప్తామానిపించింది. అంతా విన్నాక వాళ్ళుకూడా ఆమెలాగే వెక్కిరిస్తే....? ఆ ఆలోచన రాగానే ఆ విషయం వదిలేశాను.

ఆ రాత్రి పడుకుని ఆలోచిస్తూండిపోయాను. ఉన్నట్టుండి దయ్యాల కథలు, భూతాల మహాత్మ్యాలు గుర్తొచ్చాయి. బహుశా ఏదయినా దయ్యం ఆ ప్రాంతాల్లో తిరుగుతూ నన్ను పట్టి ఆడిస్తున్నదేమో ననిపించింది. అయినా ఎందుకో దెయ్యాలుంటాయన్నది నమ్మ శక్యంగా లేదు.

అయితే రోజూ అలారం పెట్టినట్లు టంచన్‌గా, నేను వెళ్ళే సమయానికే ఆ ఆర్తనాదం ఎందుకు వినిపిస్తుంది? నాతో ఎవరన్నా పరాచిక మాడుతున్నారేమో ననుకున్నాను. అందువల్ల వాళ్ళకు కలిసివచ్చేదేమిటో అర్థం గాలేదు.

ఉన్నట్టుండి నా దృష్టి పథంలోకి ప్రభుత్వ ప్రైవేట్ డిటెక్టివ్ సుధాకర్‌గా రొచ్చారు. వారి అకౌంట్ నా బ్రాంచీలోనే వుంది. ఆయన్ను రెండు మూడు సార్లు కలుసుకున్నాను కూడా డిపాజిట్ల విషయంలో. ఆయన్ని సంప్రదించాలనుకున్నాను. ఆ నిర్ణయం చేసుకోగానే, శరీరాన్ని మత్తుల్లాంటి నిద్ర ఆవరించింది.

# 3

"ఇదండీ కథ!" చెప్పాను వివరంగా.

పైపుకాలుస్తూ, రాకింగ్ ఛెయిర్‌లో కూర్చొని, ఊగుతూ ఊకొడుతూ, వింటున్న సుధాకర్, కాళ్ళు రెండు నేల పైన పెట్టి కుర్చీ, కదలికను ఆపి, ముందుకు వంగి, "నువ్వా యింట్లోకి వెళ్ళలేదా?" అడిగాడు.

"లేదండీ!" అన్నాను.

"ఆ అమ్మాయిని చూస్తే నీకేమనిపించింది?"

"ఏమీ అనిపించలేదు!" అన్నాను.

"నా ఉద్దేశ్యం ఏమంటే, ఆమె కంగారుగా వున్నట్లు

లేదా విచారంగా వున్నట్లు అనిపించిందా?"

"అలాంటి భావాలేవీ ప్రదర్శించలేదు. చాలా గడ సరిగా వుంది." అన్నాను నేను ఆమె మాటలు గుర్తు చేసుకుంటూ.

"ఈ దినం మీరు వెళ్ళలేదుగదా!"

"లేదండీ! మానేశాను. మళ్ళీ ఆ ఆర్తనాదం వినిపిస్తే పిచ్చిపడుతుందేమోననిపించింది." అన్నాను.

"ప్రపంచంలో అక్కడక్కడ కొన్ని విచిత్రాలు జరుగుతుంటాయి. ఎందుకయినా నేనోమారు ఆ ప్రాంతాలు చూస్తాను. మీరు సాయంత్రం నన్ను కలవండి. ఆ తర్వాత కార్యక్రమం నిర్ణయిస్తాను!" అన్నాడు సుధాకర్.

"థాంక్స్!" అని చెప్పి శెలవు తీసుకొని బ్యాంక్ కు వెళ్ళిపోయాను. ఆ దినం పగలంతా చాలా హుషారుగా ఉండగలిగాను. నా పైనున్న భారం, సమర్థుడైన పరిశోధకుడి నెత్తిన వెయ్యడం వల్ల నాకా తేలికతనం కలిగిందనుకుంటాను.

అకౌంట్స్ మొత్తం సరిచూసుకొని, దగ్గరుండి తాళాలు వేయించి వాచ్ మెన్ కి అన్నీ అప్పగించి స్కూటరు తీసి, తిన్నగా సుధాకర్ గారింటికి పోనిచ్చాను.

నే వెళ్ళేసరికి ముందున్న పాకలో గార్డెన్ ఛెయిర్ వేసుకుని పైపు కాలుస్తూ ఏదో పుస్తకం చదువుతూ కనిపించాడు సుధాకర్ గారు.

"నమస్తే!" దగ్గరగా వెళ్ళి అన్నాను.

"ఓ.. హో నువ్వా! రా కోర్చో" అంటూ ఎదురుగా కుర్చీ చూపించాడు నాకు. నమ్రతగా కూర్చున్నాను.

ఆయన పుస్తకం మడిచి, పచ్చని గడ్డిపై పెట్టాడు మెల్లగా.

"ఏమైనా తెలిసిందా సార్!" అడిగాడు.

"ఆ! వెళ్ళాను. ఆ తోట పెద్ద నవాబుదట! అక్కడ ఒక తోటమాలి వున్నాడు. అందులో నాలుగైదు కుటీరాలున్నాయి. క్రొత్తగా పెళ్ళయిన జంటలు, బహిరంగంగా జంటగా, తిరగలేని కొన్ని ప్రేమ పక్షులు, అప్పుడప్పుడు వచ్చి మకాం చేసి పోతుంటాయట. ఇవాళ అన్ని యిళ్ళూ ఖాళీగానే వున్నాయి. నువ్వు చెప్పిన యిల్లు గత సంవత్సరం నుంచి ఎవ్వరికీ యివ్వలేదని తోటమాలి చెప్పాడు." అన్నాడు ఆయన.

నాకు మతిపోయింది.

"అతను అబద్ధం చెప్తున్నాడు!" అన్నాను ఠక్కున.

"నేను వెళ్ళి చూశాను. అతను నా ముందే తలుపులు తీశాడు. లోపల అంగుళం ఎత్తున దుమ్ము పేరుకుని వుంది. అందువల్ల అతని మాటలు నమ్మక తప్పలేదు!" అన్నాడాయన.

"ముందున్న పూలతోట చూశారా?"

"ఆఁ! చూశాను."

"ఎలా వుంది?"

"బాగుంది! ఆ చెట్లకు అతనే రోజూ నీళ్ళు పోస్తాడట!"

నా మీద నాకు నమ్మకం పోయింది. నేను అసలు బ్రతికి వున్నానా, లేక అర్ధంతరంగా చచ్చిపోయి, దయ్యమై తిరుగుతున్నానా అన్న అనుమానం కలిగింది. కుడి చేత్తో, తొడపైన గిచ్చుకున్నాను. నొప్పి పుట్టింది. అంటే ప్రాణంతో వున్నట్లే ననిపించింది.

"నువ్వేదో పొరబడి వుంటావ్? అనవసరంగా టైమ్ వేస్టు చేసుకోకు! ఈ గొడవ మరచిపోయి హాయిగా

తిరుగు!" సుధాకర్ సలహా చెప్పాడు.

విని తల వంచుకున్నాను. ఏం మాట్లాడాలో అర్థం గాలేదు. మెల్లిగా లేచి "వస్తాను!" అంటూ నమస్కారం చేశాను.

"మంచిది!" అన్నాడు సుధాకర్.

అంతే వడివడిగా వెళ్ళి స్కూటరెక్కి ఇంటివేపు దూకించాను.

## 4

మరుసటి దినం యథాప్రకారం రేస్‌కోర్స్ గోడమూకి లోనికి వెళ్ళి, పరుగెత్తేందుకు తయారయ్యాను.

తెల్లటి హాఫ్‌పాంటు, బనియన్‌తో, పైపు కాలుస్తూ, పచార్లు చేస్తూ కనుపించాడు డిటెక్టివ్ సుధాకర్. నా కాశ్చర్యం ఆగలేదు.

ఆయన దగ్గరకు వెళ్ళాను.

"సార్! మీరు ఇక్కడకు...." అన్నాను.

"ఏం రాకూడదా?" అడిగాడు సుధాకర్.

"అదికాదు! కనుపిస్తారని అనుకోలేదు" అన్నాను వుత్సాహంగా.

"మా వృత్తిలోని కీలకం అదే! ఎవ్వరూ ఊహించని చోట ప్రత్యక్షం కాగలిగితేనే, పనులు సమకూరుతాయి. నువ్వు ఒక రౌండ్ వెళ్ళిరా! ఆ ఆర్తనాదం వినిపిస్తుందేమో చూడు. ఇది చాలా పవర్‌ఫుల్ టేప్ రికార్డర్. ఆన్ చేసి జేబులో వుంచుకో. అలాంటి అరుపులు వినిపిస్తే ఇది ఖచ్చితంగా రికార్డు చేస్తుంది. నువ్వు చెప్పిన అమ్మాయి అక్కడ వుందో లేదో చూడు. ఆమె కనిపిస్తే మాట్లాడకు. తిన్నగా తిరిగి వచ్చెయ్యి" అన్నాడు సుధాకర్.

"మరి మీరు...." అన్నాను సందేహంగా.

"నే వెనక నే వస్తుంటాను. కానీ దూరంగా. నువ్వు దేనికీ భయపడవద్దు" అన్నాడు సుధాకర్.

"భయపడను. ఇంక బయలుదేరమంటారా?"

"ఓ. కే. విష్ యూ బెస్ట్ ఆఫ్ లక్!" అన్నాడు సుధాకర్.

నేను పరుగెత్తడం మొదలెట్టాను. రోజులా గాక అడుగులు మెల్లగా పడుతున్నాయి. పరుగులో వేగంలేదు. నా మామూలు స్థానానికి రాగానే చెవులు రిక్కించి విన సాగాను.

ఆ ఆర్తనాదం వినిపించలేదు. కంచె దగ్గరగా ఆగాను. ఎదురుగా వున్న కుటీరంవేపు చూశాను. అందాలసుందరి అసలు కనుపించలేదు. ఆశ్చర్యంలో మునిగిపోవడం నా వంతయింది.

అలా ఎంత సేపు నిలుచున్నానో నాకు తెలియదు. నా భుజంమీద ఎవరిదో చెయ్యిపడింది. దాంతో ఇహలోకం లోకి ఊడిపడ్డాను.

"ఏమయింది?" అడిగాడు సుధాకర్.

"ఆ శబ్దం వినిపించలేదు! ఆ అమ్మాయి కనుపించలేదు!" అన్నాను నిరుత్సాహంగా.

"అంటే తోటమాలి చెప్పింది నిజమేనన్నమాట!" అంటూ కంచె దాటి అవతలవేపుకి దూకి వెళ్ళాడు ఆయన. నేను అక్కడే నిలుచున్నాను. పది నిమిషాల తర్వాత తిరిగి వచ్చాడు.

"వెళ్దామా?" అడిగాడు సుధాకర్.

"ఆఁ!" అన్నాను.

ఇద్దరం నడుస్తూండగా "నువ్వెవరన్నా మంచి డాక్టరుకు చూపించుకోవడం మంచిది. నరాలు చాలా బలహీనంగా

వున్నట్లున్నాయి. ఇలాంటి ఊహలు అప్పుడే వస్తూంటాయి" అంటూ తన సలహా చెప్పాడు.

"అలాగే చూపించుకొంటాను" అన్నాను.

"నువ్వెందుకని ఇంకా పెళ్ళిచేసుకోలేదు!" అడిగాడు సుధాకర్.

"సరయిన అమ్మాయి దొరక్క...." చెప్పాను.

"నీ పెళ్ళి గురించి మీ చిన్నాన్న పట్టించుకోడా?"

"అయ్యో! రోజుకు పదిసార్లు ఫోన్ చేస్తాడు. నేనే తప్పించుకుని తిరుగుతున్నాను. ఆయన అన్నీ చెత్త సంబంధాలు చెప్తుంటాడు" అన్నాను.

"నీ పెళ్ళి తొందరగా కావాలని ఇంకా ఎవరు అనుకంటూ వుంటారు?"

"ఇంకెవరూ లేరుసార్!" అన్నాను.

ఇద్దరం రేస్‌కోర్స్ వెలుపలకొచ్చాం. సుధాకర్ కారెక్కి వెళ్ళిపోయాక, నేను స్కూటర్ ఎక్కాను. ఇల్లు చేరాను. ఇంటి ముందు నల్ల అంబాసిడర్ కారు ఆగివుంది. నంబరు చూశాను. మా చిన్నాన్న దా కారు. ఆయన లాయరు. ఇంత ప్రొద్దున్నే ఎందుకొచ్చి వుంటాడాని ఆలోచిస్తూ లోనికి వెళ్ళాను.

"ఏరా? వంట్లో బావులేదట!" అడిగాడు.

"ఎవరు చెప్పారు?" అడిగాను.

"ఫోన్ చేస్తే, శంకర్ చెప్పాడు. వాడేదో నీగురించి కంగారు పడుతున్నట్లు తోచింది. వెంటనే చూద్దామని వచ్చాను."

నాకు సపర్యలు చేసేందుకు పెట్టుకున్న శంకర్ పైన కోపం వచ్చింది.

"నాకేం! నిక్షేపంలా వున్నాను!" అన్నాను ఎదురుగా

కూర్చుంటూ.

"నీ మొహం చూ స్తేనే తెలుస్తుంది. వెంటనే మన డాక్టరు లక్ష్మణరావుగారి దగ్గరకు వెళ్ళు! ఆయనతో చెప్పాను నువ్వు వస్తావని...." అన్నాడు ఆయన.

"అలాగే!" అన్నాను ఆయనతో అనవసరంగా సంభాషణ పెంచుకోవడం ఇష్టంలేక.

"రెస్టు దొరుకుతుంది. నాల్రోజులు మనింటికి వచ్చి వుండరాదూ!" అన్నాడాయన లేస్తూ.

నేనేం మాట్లాడలేదు. ఆయన కారెక్కి వెళ్ళిపోయాడు.

స్నానపానాదులు ముగించుకొని, లక్ష్మణరావుగారి దగ్గరకు వెళ్ళాను. ఆయన అన్ని పరీక్షలూ చేసి "నీకు మానసికంగా ఉల్లాసం కావాలోయ్! అది పెళ్ళయితే గాని కుదరదు. వెంటనే మంచి అమ్మాయిని చూసి చేసుకో!" అన్నాడు నవ్వుతూ.

"మీ దగ్గర వేరే మందులు లేవా?" అడిగాను.

"ఉన్నాయి. అవి ఈ జబ్బుకు పనిచెయ్యవు" అన్నాడాయన తను వేసిన విట్టుకు తనే నవ్వుకుంటూ.

"నా జబ్బు, దాంతోపాటు దానికి కావలసినమందూ, మా చిన్నాన్న మీకు చెప్పివుండాలి! అవునా?" అడిగాను నా అనుమానం నిజం చేసుకుందామని.

"ఆయన్ను గురించి అలా తప్పుగా ఊహించకు. ఒక వేళ చెపుతున్నా అందులో తప్పేముంది. నీ పెళ్ళి చెయ్యడం ఆయనబాధ్యత గాదూ!" అన్నాడులక్ష్మణరావు.

## 5

ఆ సాయంత్రం బ్యాంక్ నుంచి తిన్నగా చిన్నాన్నగారింటికి బయలుదేరాను కొన్ని సంబంధాల వివరాలు

చెప్తాను రమ్మని మరీ మరీ చెప్పడంతో.

ట్రాఫిక్ సర్కిల్ దగ్గర, ఎదురుగా ఎర్రలైటు వెలగ డంతో స్కూటరాపాను.

నా స్కూటర్ ప్రక్కనే ఫియట్ కారు పార్క్ చేసి వుంది. యూనిఫాంలో వున్నాడు డ్రైవరు. వెనకసీట్లో ఒక మూలకు వొదిగి కూర్చుని అందమైన స్త్రీ కనిపించింది,

ఆమె లోనెక్ జాకెట్ లోంచి, ఎత్తైన వక్షోజాల అంచులు అందంగా కనుపించడంతో, మరికొంత వంగి చూశాను. ఆ ముఖం చూడగానే, కరెంట్ షాక్ తిన్న ట్లయింది.

అంతకు ముందు వరుసగా రేస్ కోర్స్ ప్రక్కనున్న కుటీరం ముందు నిలబడి నాతో వాగ్యుద్ధం చేసిన స్త్రీ ఆమే!

స్కూటర్ కాస్త వెనక్కు కాళ్ళతో నేలకు తన్ని పట్టి తోసి, కిటికీ దగ్గర తలపెట్టి "హల్లో!" అన్నాను.

ఆమె పైటకొంగు సరిచేసుకొని "బ్రూట్" అంటూ తల త్రిప్పుకుంది.

"నన్ను గుర్తుపట్టలేదా?" అడిగాను నేను ఆమెను.

డ్రైవరు డోర్ తెరచుకొని దిగాడు. అతని చేతిలో కారు సెల్ఫ్ ఫెయిలయితే ఉపయోగించే ఇనుపకడ్డీ వుంది. చూసి కాస్త భయపడ్డాను.

"పెద్దమనిషిలాగున్నావ్? ఏమిటా పోకిరి చేష్టలు? మర్యాదగా వెళ్ళిపో! లేకుంటే తల పగులుతుంది?!" అన్నాడు కర్కశంగా డ్రైవరు.

"ఆమె నాకు బాగా తెలుసు. మా ఇద్దరికీ పరిచయం వుంది. అది నీకు తెలీదు! అవునా?" అన్నాను ఆమెకేసి చూస్తూ.

"షటప్!" అంది కోపంగా.

వెంటనే నా జబ్బు, నరాల బలహీనత నాకు గుర్తొచ్చాయి. అంతలో ఎర్రలైటు పచ్చరంగుకు మారింది. కార్లు కదిలాయి. ఆ కారు నెంబరు మెదడుపై అసంకల్పంగా రాసుకొని అండర్ లైన్ చేసుకున్నాను.

"ఏమిట్రా? ఇంత ఆలస్యమైంది?" అడిగాడు చిన్నాన్న.

ఆయనతో ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర జరిగిన విషయం గానీ ఆ తర్వాత నేను సుధాకర్ గారింటికెళ్ళి, ఆయనతో మాట్లాడి రావడంగానీ, చెప్పడం ఇష్టం లేకపోయింది.

"ఇదిగో! ఈ ఫోటోలన్నీ చూడు! అన్నీ గౌరవమైన కుటుంబాలవాళ్ళకు సంబంధించినవే! ఇందులో నీకు నచ్చిన ఫోటో తీసుకో! దాని వివరాలు చెప్తాను!" అంటూ ఒక కట్ట నా ముందుకు తోశాడు.

నేను ఒక్కొక్కటే మెల్లగా చూడసాగాను. అంతర్జాతీయ అనాకారుల ఫోటోలో మొదటి పది రాంకులు సంపాదించుకొన్న వాళ్ళ ఫోటోలు, మా బాబాయి నా కోసం ప్రత్యేకంగా తెప్పించి వుండాలనిపించింది ఒక్కొక్కటీ చూస్తుంటే. ప్రతి దాని వెనుకా, అమ్మాయి పేరు, చదువు, ఇవ్వగల కట్నం వివరాలు నమోదు చేసివున్నాయి.

ఆఖరి ఫోటో తీసిచూశాను. అందులోని అమ్మాయిని చూడగానే హడలిపోయాను. రేస్ కోర్స్ దగ్గర వాగ్యుద్ధం చేసి, ట్రాఫిక్ సిగ్నల్ దగ్గర, కనుపించిన సుందరాంగి దది. వెనక్కి త్రిప్పిచూశాను. పేరు సునీత. చదువు బి.ఏ. కట్నం లక్షరూపాయలు అని రాసి వుంది.

"బాబాయ్!" పిలిచాను,

"ఏమిట్రా?"

"ఈ ఫోటోలో అమ్మాయికి పెళ్ళయిందనుకుంటాను" అన్నాను సునీత ఫోటో అందిస్తూ.

"ఏం? నువ్వా పెళ్ళికి వెళ్ళావా?" అందుకుంటూ అన్నాడు బాబాయి.

"లేదు!"

"ఛట్! ఈ అమ్మాయికి పెళ్ళి కావడమేమిట్రా.... ఈమె తల్లీ తండ్రీ ఫారిన్‌లో వున్నారు. ఈ మధ్యనే ఈమె ఇండియాకొచ్చింది. వాళ్ళ నాన్నగారు నాకు స్నేహితులు. ఆయన పంపాడీ ఫోటో. అమ్మాయి వచ్చి కూడా పదిరోజులు కాలేదు!" అన్నాడు బాబాయి

"నేనీమెను చూద్దామనుకుంటున్నాను. ఫోటోలో వున్నట్లు ఒక్కోసారి మనుషులు వుండరు. వాళ్ళకు ఏ మూగో, చెవిటో వుంటే తెలీదు కూడా. ఎప్పుడు చూద్దాం?" అడిగాను ఉత్సాహంగా.

"ఆ అమ్మాయిది కాస్త ఫారిన్ కల్చర్. పెళ్ళి చూపులు, పాటలు పాడటాలు, లాంటివి గిట్టవు. మనింటికి టీకి పిలుస్తాను. వస్తుంది. నువ్వూరా! చూద్దువుగాని. నీకు నచ్చితే తర్వాత వివరాలు మాట్లాడుకుందాం!" అన్నాడు చిన్నాన్న.

"అలాగే!" అన్నాను.

"ఇన్నాళ్ళకు నీకు పెళ్ళి చేసుకోవాలనిపించడం, అందులోనూ నా స్నేహితుడి అమ్మాయి నచ్చడం, నాకు ఆనందంగా వుందిరా! ఏడుకొండలవాడు నా మొర ఆలకించినట్లే!" అన్నాడు చిన్నాన్న.

అన్న కొడుకును కూడా, కన్నకొడుకులా చూడగలిగిన వాళ్ళు ఎంతమంది వుంటారీలోకంలో. ఇలాంటి చిన్నాన్న

దొరకడం నా అదృష్టంగానే భావించాను.

ఆయన దగ్గర శెలవు పుచ్చుకుని ఇంటిదారి పట్టాను. మధ్యలో ఒక పబ్లిక్ బూత్ దగ్గర ఆగి సుధాకర్ గారికి ఫోన్ చేసి జరిగిన విషయం చెప్పాను. అంతా విని, ఆ అమ్మాయిని చూచేందుకు వెళ్ళేముందు తనకూ కూడా కబురు చెయ్యమన్నాడు. సరేనని ఒప్పుకున్నాను.

# 6

ఆ తర్వాత రెండు రోజులు జరిగాయి. చెప్పుకోదగ్గ సంఘటన ఏదీ జరగలేదు. నా పనులు యథావిధిగా జరిగిపోతున్నాయి. రోజూ ఉదయం రన్నింగ్ రేస్‌కు వెళుతున్నాను. కానీ ఆ ఆర్తనాదం కానీ, అమ్మాయిగానీ మళ్ళీ తటస్థపడలేదు.

మూడోరోజు చిన్నాన్నగారింటికి వెళ్ళాను. నే వెళ్ళేసరికి చిన్నాన్న విస్కీ సీసా ముందు పెట్టుకొని వున్నాడు. మా పిన్ని పోయి చాలా రోజులయింది. ఉన్న ఇద్దరి పిల్లల్ని ఆయన బోర్డింగ్ స్కూల్లో చేర్పించి వున్నాడు. అందువల్ల ఆయనకూడా నాలాగే ఏకాకిగా వున్నాడు. నా తల్లిదండ్రులు నాలుగేళ్ళ క్రితం కారు ఏక్సిడెంట్‌లో పోయారు. నాకు మిగిలిన బంధువు చిన్నాన్న ఒక్కడే!

"రారా! ఏమిటి ఇలా వచ్చావ్?" అడిగాడు ఆశ్చర్యపోతూ.

"చూచిపోదామని వచ్చాను" అన్నాను కూర్చుంటూ.

"లేదులేవోయ్! పెళ్ళిచూపులు ఇంకా ఎందుకు ఏర్పాటు చెయ్యలేదాని అడిగి తెలుసుకుందామని వచ్చావ్. నన్ను చూశాక సిగ్గు ముంచుకొచ్చింది. అంతేగదూ!" అన్నాడు గ్లాసు అందుకుని.

"లేదు!"

"ఫరవాలేదులే. నా దగ్గర సిగ్గేమిటి. ఆ అమ్మాయి ఊళ్ళు తిరుగుతుంది. తీరిక దొరకనీ, పిలిపిస్తాను" అన్నాడు.

"ఆమె ఫోటో వుందికదూ!"

"ఉంది! మళ్ళీ చూస్తావా?"

"ఆఁ!" అన్నాను.

"ఆ డ్రాయరులో వుంది. తీసుకుపో! తనివితీరా చూసుకో" అంటూ ఫోటో గురించి చెప్పాడు.

నేను లేచివెళ్ళి డ్రాయరు సొరుగు లాగి, అందులో వున్న ఫోటో తీసుకున్నాను.

ఆ తర్వాత రెండు నిముషాలు మాట్లాడి, ఫోటోతో సహా వెలుపలపడ్డాను. అక్కడ్నుంచి తిన్నగా సుధాకర్ గారింటికి వెళ్ళాను.

నన్ను చూడగానే నవ్వాడాయన. నమస్కారం చేసి ఎదురుగా వున్న కుర్చీలో కూర్చున్నాను.

"ఏమిటి విశేషాలు? ఆ అమ్మాయితో పెళ్ళిచూపులు ఇంకా కాలేదా?" అడిగాడు.

"లేదుసార్! ఆ అమ్మాయి బిజీగా వుందట."

"నువ్విచ్చిన కారు నెంబరు గురించి కనుక్కున్నాను. అది ట్రావెల్స్ అండ్ ట్రావెల్స్ అనే కంపెనీవాళ్ళది. కార్లు అద్దెకిస్తూ వుంటారు వాళ్ళు. నువ్వు చెప్పిన నెంబరు కార్ను, ఆ దినం, మీ చిన్నాన్నకు అద్దెకిచ్చారు. ఆ కారు డ్రైవర్ను పట్టుకొన్నాను. నాల్రోజుల క్రితం హోటల్ హాలండ్‌లో దిగిందట అందులో నువ్వు చూసిన అమ్మాయి. ఆమె గురించి వాకబు చేశాను అతనితో. ఆమె అవివాహిత. బాగా డబ్బున్న మనిషిలాగుందని చెప్పాడువాడు. నేను హాలండ్ హోటల్‌కు వెళ్ళాను. కానీ ఆమె నాకు కలవలేదు" అన్నాడు.

"చిత్రంగా వుంది సార్!"

"నాక్కూడా చిత్రంగానే వుంది. ఆమె ఈ దేశం వచ్చి నాల్రోజులే అయింది. కానీ నువ్వామెను అంతకు ముందే చూశానంటున్నావ్. పైగా ఆమెకు పెళ్ళయిందని కూడా అంటున్నావ్. ఇందులో ఏదో పెద్ద తిరకాసు వుంది. అది తెలిస్తే ఆ ఆగ్రనాదం విషయంకూడా తెలుస్తుంది. నువ్వేం కంగారుపడకు. నా ప్రయత్నాలు నేను చేస్తున్నాను" అన్నాడు సుధాకర్.

"నన్నేం చెయ్యమంటారు?" అడిగాను.

"పెళ్ళిచూపులుగానీ. నన్ను పిలవడం మాత్రం మరచిపోకు" అన్నాడు సుధాకర్.

# 7

సాయంత్రం నాలుగ్గంటల ప్రాంతంలో నాకు ఫోన్ వచ్చింది సుధాకర్ గారి దగ్గర్నుంచి. ఉన్నపళంగా అర్జంటుగా రమ్మన్నారు నన్ను. అసిస్టెంటు మేనేజరుకు చెప్పి, తిన్నగా బయలుదేరి వెళ్లాను.

"రావయ్యా! రా!" అంటూ పిలిచాడు.

వెళ్ళి కూర్చున్నాను.

అక్కడున్న ఇద్దర్నీ చూశాను. మతిపోయింది. ఆ స్త్రీ ఎవరో కాదు. సునీత.

"మీకింతకుముందు చెప్పానే అతను ఇతనే!" అంటూ నన్ను చూపించాడు వాళ్ళకి.

ఇద్దరూ తలూపారు.

"వాళ్ళని నీకు తెలుసా?" అడిగాడు సుధాకర్.

"ఆమెను తెలుసు. పేరు సునీత," అన్నాను.

"అవును ఫారిన్‌లో వుంటుంది. ఇండియాకీ మధ్యే వచ్చింది." అన్నాడు సుధాకర్ గారు.

తలూపాను తెలుసన్నట్లు.

"వాళ్ళ నాన్నకూ మీ చిన్నాన్నగారికి స్నేహితం వుంటుందట. ఆమె వివాహ ఏర్పాట్లు అన్నీ ఆయనచూశా డట." అన్నాడు సుధాకర్ గారు.

నేను జేబులో వున్న ఫోటో తీసి చూపించాను. ఆమె చూసింది.

"ఇది నాదే! మీ చిన్నాన్నగారు అడిగి తీసు కున్నారు!" అంది సునీత తిరిగి ఇచ్చేస్తూ.

"ఈవిడ ఎందుకొచ్చిందో తెలుసా!" అడిగాడు నన్ను.

తెలియదన్నట్లు తల అడ్డంగా త్రిప్పాను. పెళ్ళి చేసు కునేందుకు వచ్చి వుంటుందని చెప్పడం ఇష్టంలేక.

"ఈమెకు వినత అనే చెల్లి వుండేదట. సంవత్సరం క్రితం ఎవర్నో ప్రేమించి అతనితో లేచివచ్చేసిందట ఇండియాకు. ఇక్కడికొచ్చి కొన్ని ఉత్తరాలు రాసిం దట. ఈమధ్య ఆమెదగ్గర్నుంచి ఉత్తరాలు రావడంలే దట. దాంతో కంగారుపడి చూసిపోదామని వచ్చింది. వాళ్ళ నాన్నగారు మీ చిన్నన్నగారికి కేబుల్ పంపా రట సునీత ప్రయాణం గురించి." అన్నాడు సుధాకర్.

వింటున్నట్లు తలూపాను.

"ఆమె చెల్లెలు అచ్చం ఆమెలాగే వుంటుందట. ఇద్దరూ కవలలుగా పుట్టడంవల్ల, ఒకే రంగు, రూపం, వున్నాయట. ఆమెగురించి వచ్చింది మొదలు తిరిగిందట. ఎక్కడా కనిపించలేదట. పోలీస్ రిపోర్టు ఇవ్వాలను కుందట. కానీ అందరికీ తెలుస్తుందన్న భయంతో నాదగ్గ

రకు వచ్చింది. అందుకనే నీకు ఫోన్ చేశాను.” అన్నాడు సుధాకర్.

నాకు మతి పోయినట్లుగా వుంది. జరుగుతున్న సంఘటనల కొకదానికొకటి సంబంధంలేకపోవడంతో, పిచ్చి ఎక్కుతున్నట్లుగా వుంది.

“పెళ్ళి సంగతి చెప్పారా” అడిగాను.

“చెప్పాను. తనా విషయం గురించి మీ చిన్నాన్నతో సంప్రదించలేదట. అలాంటి ఉద్దేశ్యముతో తను రాలేదని కూడా అన్నది. అవునా అమ్మాయ్!” అడిగాడు సుధాకర్.

“అవునండీ!” అంది సునీత.

“అయితే నేను చూసింది ఈమె చెల్లెల్నయి వుండాలి. ఆమెకు వివాహమయింది. మనిషి ఈమెలాగే వున్నా కొంత వ్యత్యాసముందని బల్లగుద్ది చెప్పగలను. అయితే అది మనిషో లేక దయ్యమో నాకు అర్థం కావటంలేదు” అన్నాను.

“ఇప్పుడు మనం తెలుసుకోవలసిందదే! ఆమె పెళ్ళాడిన మనిషి పేరు, వివరాలు సునీత చెప్పింది. వాటి ఆధారంగా ఎంక్వయిరీ చేయించాను. అతను, ఆరు మాసాల క్రితం హాస్పిటల్‌లో చనిపోయాడు. నిద్ర మాత్రలు డోస్ ఎక్కువకావడంవల్ల గుండె ఆగి మరణించినట్లుగా తెలిసింది. ఆ తర్వాత ఆమె జాడ కనుపించ లేదు!” అన్నాడు సుధాకర్.

ఒకవేళ ప్రేమించి పెళ్లాడిన వ్యక్తి చనిపోవడంతో మతిపోయి ఆమె ఆత్మహత్య చేసుకొని వుండవచ్చు

నేమో!" అన్నాను అనుమానంగా.

"అదే తెలుసుకోవాలి! అందుకు నేనొక పథకం వేస్తున్నాను. అది అమలుపరచి చూద్దాం. నా అంచనా ప్రకారం అన్ని విషయాలు తెలుసుకోవాలంటే అంత కన్నా మరో మార్గం లేదు." అన్నాడు సుధాకర్.

"చెప్పండి!" అన్నాను.

"సునీత పెళ్ళి చూపులకు వస్తుంది. నువ్వు మీ చిన్నాన్న నెలాగైనా తొందరపెట్టి, వెంటనే ఆమె వచ్చే ఏర్పాటు చెయ్యాలి" అన్నాడు సుధాకర్.

## 8

ఫోన్ మోగింది.

ఫోన్ తీసుకున్నాడు సుధాకర్.

ఒక్క క్షణం విని "ఓ. కే. వస్తున్నాం!" అంటూ పెట్టేశాడు. రిసీవరు పెట్టి సుధాకర్ బయలుదేరాడు కార్లో.

"ఇప్పటిదాకా జరిగినవన్నీ మీకు తెలుసు. తెలియనివి చెప్తాను. వినండి." అంటూ మొదలెట్టాడు సుధాకర్.

"మనరన్నర్‌తో పాటు నేనుకూడా ఉదయం పూట వెళ్లాను ఆరోజు. నాకు ఆ రనాదం వినిపించలేదు. మనిషి కనుపించలేదు. అయినా వెళ్ళి ఆ ప్రాంతాలు పరిశీలించి చూశాను. ఒక మనిషి వడివడిగా ఆ ప్రాంతాల నుండి పరుగెత్తిపోయిన గుర్తులు కనుపించాయి. ఆ కాలి గుర్తులనుబట్టి అవి ఆడమనిషికి సంబంధించినవే ననుకున్నాను.

ఆ తర్వాత నా వాకబు మొదలెట్టాను. ఆ కుటీరాల్లో ఎవ్వరూ వుండడంలేదు. తోటమాలికి తెలిసి ఎవ్వరూ

రావడంలేదు. కానీ యీ తోటమాలీ లాయరుగారింట్లో తోటమాలీ ఒకడే. ప్రొద్దున్నే వెళ్ళి చెట్లపనంతా చేసుకుని పదింటికల్లా తిరిగి వస్తాడు ఈ తోటకు. ఈలోగా ఆయన వచ్చిపోయే అవకాశం వుంది.

మన రన్నర్ వివాహం చేసుకొంటేగానీ, అతని ఆ స్తి అతనికి రాదు. అది తండ్రి వ్రాసిపోయిన వీలునామా. పెళ్ళాడమని లాయరుగారు చెప్పారు. కానీ వినలేదు. దాంతో కాస్తా మతి సిరం తప్పించి డాక్టరు దగ్గరకు పంపించి, అతనిద్వారా పెళ్ళి చేసికుంటే తప్ప ఆరోగ్యం కుదుటపడదని చెప్పించాలని ఆయన పథకం వేశాడు. మన రన్నర్ దినచర్య తెలుసు కాబట్టి, వినత సాయంతో నాటకం ఆడాడు" అన్నాడు సుధాకర్.

"మా చెల్లెలు ఈయన దగ్గర వుందా?"

"వుంది. ఆమె భర్త పెట్టే బాధలకు తట్టుకోలేక తండ్రి స్నేహితుడన్న ఉద్దేశ్యంతో సాయం అడిగి వుంటుంది. ఆయనే సలహా ఇచ్చి ఆమెచేత భర్తను చంపించివుంటాడు.ఆ తర్వాత ఆమెను భయపెట్టి లోబరచుకొని వుంటాడు. ఆమెను నిన్నగా తన అన్న కొడుక్కి ఇచ్చి పెళ్ళిచేసి ఆ తర్వాత అతన్నికూడా చంపించి, ఆ స్తంతా కాజెయ్యాలని ప్లాను వేసివుంటాడు. ఇంతలో నీవు ఈ దేశం రావడంతో కథ పాకాన పడింది. మీ రిద్దరూ నా సాయంకోసం వస్తారని ఆయన ఊహించేవుండడు."

"ఇంతకూ మా సిస్టర్ క్షేమంగా వుందా?" అడిగింది సునీత.

"చూద్దువుగాని పద!" అన్నాడు సుధాకర్.

లాయరుగారింటి ముందు రెండు పోలీసు వ్యాన్లు కనుపించాయి.

సుధాకర్‌ను చూడగానే ఇన్‌స్పెక్టర్ నాయర్ ఎదురొచ్చి "రెడ్ హాండెడ్‌గా పట్టుకున్నాం సార్" అన్నాడు.

"ఓ.కే."

సునీత దిగి, వినత దగ్గరగా వెళ్ళింది.

ఒకర్నొకరు కావలించుకున్నారు.

"ఇతనికెలా లొంగిపోయావ్?"

"నా భర్తను చంపమని చెప్పి, ఆ తర్వాత నేను అడిగిన విషయాలన్నీ టేప్ చేసి, దాన్ని దగ్గర పెట్టుకొని, నన్ను కీలుబొమ్మలా ఆడించాడు. నన్ను అతనికి కట్టబెట్టి, ఆ తర్వాత అతన్నికూడా చంపించాలని ఎత్తువేశాడు. కానీ అదృష్టం బాగుండి చిక్కిపోయాడు!" అంది సునీత.

"ఆ ఆర్తనాదం ఎవరిది?" అడిగాను నేను.

"పాకెట్ టేప్ రికార్డర్‌ది. అది నా దగ్గరే వుండేది. ఇప్పుడూ వుంది" అందామె.

లాయరుగార్ని పోలీసులు పట్టుకెళ్ళిపోయారు.

వినత నాకేసి నవ్వుతూ చూసింది. నేను వెళ్ళి సునీత ప్రక్కన నిలబడి ఓదార్చాను.

:— అయిపోయింది :—

# రూ ప రా ణి

## వాణిశ్రీ

రామానుజరావు వెళ్ళేసరికి యస్.ఐ. రామ్మూర్తి వైర్ లెస్‌లో మాట్లాడుతున్నాడు.

అతన్ని చూసి కూర్చోమన్నట్లు సంజ్ఞ చేశాడు. విష్ చేసి కూర్చున్నాడు రామానుజరావు.

వైర్ లెస్‌లో మాట్లాడిన విషయాలన్నీ నోట్ చేసు కున్నాడు ఎస్.ఐ. తర్వాత తలెత్తి చూసి "చెప్పండి సార్" అన్నాడు.

"మా అమ్మాయి నిన్న సాయంకాలంనుంచీ కనిపించడం లేదు సార్!...." అన్నాడు రామానుజరావు దిగులుగా.

"ఎన్ని సంవత్సరా లుంటాయి? ఫోటో తెచ్చారా?" అని ప్రశ్నించాడు మూర్తి.

"పందొమ్మిది సంవత్సరాలు" అంటూ హేండ్

బ్యాగ్‌లోనుంచి కార్డు సైజులో ఉన్న ఫోటో తీసి ఇచ్చాడు.

"ఈ అమ్మాయి మీ అమ్మాయా?" అన్నాడు ఎస్.ఐ. ఆశ్చర్యపోతూ.

"అవున్సార్. మీకు తెలుసా?" అన్నాడు రామానుజరావు. అతనిలో ఏదో ఆశ అంకురించింది.

"పరిచయం లేదులెండి. లక్ష్మీటాకీస్ దగ్గర నాతో నే పోట్లాట పెట్టుకుంది. మొత్తానికి అసాధ్యురాలు లెండి" అంటూ నవ్వి "మీ అమ్మాయి కన్పించకపోవడానికి కారణం యేమిటో నాకు అర్థం కావడం లేదు" అన్నాడు ఐస్.ఐ.

"ఎంత అసాధ్యురాలైనా ఆడపిల్ల కదండీ. ఉన్న మాట పైకి అనేస్తుంది. లోకం పోకడ తెలియదు. ఒక రకంగా అమాయకురాలు."

"పేరేమిటి?"

"రూపరాణి."

"కాలేజీలో చదువుకుంటుందనుకుంటాను."

"అవునండీ. సి.ఎస్.ఆర్. కాలేజీలో బి.ఎస్సీ. ఫైనలియ్యర్ చదువుతోంది."

"నిన్న కాలేజీనుంచి ఇంటికి వచ్చిందా?"

"రాలేదు. ఎవరో ఫ్రెండ్ మ్యారేజి వుందనీ, డిన్నర్ వుందనీ, లేటుగా వస్తానని చెప్పి వెళ్ళింది."

"మీరు ఆఖరిసారిగా ఎప్పుడు చూశారు?"

"మధ్యాహ్నం భోజనానికి వచ్చినప్పుడే. క్లాస్‌మేట్స్ తలా పది వేసుకుని ప్రజెంటేషన్ కొని అటునుంచి అటే

పెళ్ళికి వెళ్ళామని చెప్పింది."

"పెళ్ళి యెవరింట్లో జరిగిందో మీకు తెలుసా?"

"నీలకంఠంగారి అమ్మాయిది పెళ్లి. ఆయనతో నాకు పరిచయంలేదు."

"మీ అమ్మాయి రాలేదని రాత్రి యెన్నింటికి అనుకున్నారు?"

"పదింటివరకూ యెదురుచూశాం. ఎంత సేపటికీ రాకపోయేసరికి నా భార్య పెళ్లివారింటికి వెళ్లిరమ్మని గొడవ పెట్టింది. కాని నాకు మా అమ్మాయిమీద నమ్మకం వుంది, ఎట్లాగైనా వస్తుందని. ఎవరికీ భయపడే తత్వం కాదు. డిన్నర్ అయ్యాక సెకండ్ షో సినిమాకి ఫ్రెండ్స్‌తో కలిసి వెళ్ళి వుంటుందని వూహించుకున్నాను." అన్నాడు రామానుజరావు.

"అయితే పెళ్లివారింటికి వెళ్ళారా?"

"వెళ్ళాను."

"ఎన్నింటికి వెళ్ళారు?"

"నేను వెళ్ళేసరికి పదకొండు దాటింది. కాని ఇంట్లో బంధువులు తప్ప మా అమ్మాయి క్లాస్ మేట్స్ యెవరూ లేరు. మా అమ్మాయి విషయం యెవరూ చెప్పలేకపోయారు. నాకు నీలకంఠం పరిచయం లేదు. అయినా ఆయన హడావుడిలో వున్నాడు. సెకండ్ షో సినిమాకే వెళ్లి వుంటాగని ధైర్యంగా వున్నాను.

"సెకండ్ షో వదిలాక గూడా రాకపోయేసరికి నాకు కంగారు పుట్టింది. వూళ్ళో వున్న బంధువుల యిళ్ళకి వెళ్లి వాకబు చేశాను. తెల్లవారినా ఇంకా రాలేదు."

రామానుజరావు ముఖం యిప్పుడో యింకా సేపటికో వర్షించబోయే కారుమేఘంలా వుంది.

"మీరు యేం చేస్తుంటారు?" అంటూ ప్రశ్నించాడు ఎస్.ఐ.

"నేను హైస్కూల్లో అసిస్టెంట్ ని."

"కాని మీ అమ్మాయి మాష్టారిగారి అమ్మాయిలా ఉండదే."

అర్థం కానట్లు అయోమయంగా చూశాడు రామానుజ రావు.

"ఐమీన్ చాలా మోడరేట్ గా ఉంటుంది. డ్రెస్సింగ్ వగైరా యే ఆఫీసర్ గారి అమ్మాయో, లేక బిజినెస్ మాన్ కూతురో అనుకున్నాను" అన్నాడు ఎస్.ఐ.

"నేను స్కూల్ మాష్టార్నే అయినా జీతంకాక నాకు పైన ఆదాయం వుంది. ప్రక్కనే మా స్వంత వూరు. అక్కడ పది ఎకరాల మాగాణీ వుంది. ఈ వూళ్ళో స్వంత యిల్లుంది. మా అమ్మాయి ఒక్కతే ఆడపిల్ల. అందుకే గారాబంగా పెరిగింది. అదీకాక మా తమ్ముడు హైదరాబాద్ లో అసిస్టెంట్ ఇంజనీర్ గా వర్క్ చేస్తున్నాడు. వాడు మా అమ్మాయికి మాడరేట్ గా వుండే డ్రెస్సులు పంపుతూ వుంటాడు."

"మీరు పిటీషన్ రాసి యివ్వండి...." అన్నాడు యస్.ఐ.

రామానుజరావు రాసిచ్చాడు.

"మీరేమీ అనుకోకండి—ఒక్క మాట."

"అడగండి. నాకు మా అమ్మాయి దక్కాలి గనుక

మీకు సమాచారం యేం కావలసినా నిస్సంకోచంగా అడగండి."

"మీ అమ్మాయికి బాయ్ ఫ్రెండ్స్ యెవరైనా వున్నారా?"

రామానుజరావు వెంటనే సమాధానం చెప్పలేక పోయాడు. రెండు చేతులూ తలమీద పెట్టుకుని కాసేపు దీర్ఘంగా ఆలోచించాడు.

"నాకు తెలిసినంతవరకూ యెవరూ లేరు. అటువంటి విషయాలు మా అమ్మాయి నావద్ద దాచదని నా నమ్మకం. పెళ్ళి విషయంలో నాకు చాల స్వతంత్ర భావాలు వున్నాయి. కులమతాల పట్టింపులు లేవు. నా సంగతి రూపకు తెలుసు గూడా. ఎవర్నయినా తను ప్రేమించి వుంటే నాకు చెప్పి వుండేది" దృఢంగా అన్నాడు రామానుజరావు.

"సరే మీరు వెళ్ళిరండి. ఏదైనా ఇన్ఫర్మేషన్ వస్తే మీ హైస్కూలుకి ఫోన్ చేస్తాను."

టెలిఫోన్ గణగణ మ్రోగింది.

"ఎస్.ఐ. మూర్తి స్పీకింగ్...." అన్నాడు రిసీవర్ యెత్తి.

అవతల ఎవరో చెప్తున్న విషయం వింటుంటే మూర్తి కళ్ళు పెద్దవయ్యాయి.

"ఐ యామ్ సారీ సర్. సి.ఐ. గారు వూళ్ళో లేరు. ఎస్.పి. గారిని మీటవ్వడానికి హెడ్ క్వార్టర్సుకి వెళ్ళారు. నేను వ్యాన్‌లో వెంటనే వస్తున్నాను" అన్నాడు రిసీవర్ పెట్టేస్తూ.

"రామానుజరావుగారూ! మీరు మా వెంట రాగలరా?" నెమ్మదిగా అన్నాడు మూర్తి.

"ఎక్కడికి సార్?" అనుమానంగా చూస్తూ ప్రశ్నించాడు.

"పదిమైళ్ళ దూరంలో వెండికొండ డామ్ వుంది తెలుసుగదా! అక్కడికి."

"నే నెందుకు?...." నివ్వెరపోతూ అన్నాడు.

"కంగారుపడకండి. డామ్ రిజర్వాయర్ ఒడ్డున యెవరిదో శవం కన్పించిందట. టూరిజం డిప్యూటీ డైరక్టర్ గారు ఫోన్ చేశారు. యెలాగూ స్టేషన్ కి వచ్చారుగదా చూసి వద్దాం."

"ఆ శవం ఆడపిల్లదేనా?...." తడబడుతున్న మాటలు విని ఎస్.ఐ. "ప్లీజ్! ధైర్యంగా వుండండి" అన్నాడు.

రామానుజరావు ముఖంలో భయాందోళనలు స్పష్టంగా కన్పిస్తున్నాయి.

"ఈ రోజుల్లో ఆడవాళ్ళు చీటికిమాటికి ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఎవరో సూసైడ్ చేసుకుని వుంటారు. మీ అమ్మాయి కాదని నాకు అనిపిస్తూ వుంది. ఆత్మహత్య చేసుకోవలసిన పిరికితనం మీ అమ్మాయిలో లేదు. చాలా ధైర్యంగల పిల్ల" అన్నాడు.

రామానుజరావు మాత్రం వణికిపోతున్నాడు. అతని మనస్సు యెందుకో కీడుని శంకిస్తోంది.

## 2

వెండికొండ డామ్ చెక్ పోస్టు దాటి కాలనీలోకి ప్రవేశించింది పోలీస్ వాన్,

కాలనీలో వందకంటే యెక్కువ క్వార్టర్సులో జనం లేరు. ఎక్కువ క్వార్టర్లు ఖాళీగా వున్నాయి. డామ్ నిర్మాణం పూర్తయ్యాక వర్కర్స్‌ని రిట్రెంచ్‌మెంట్ చేశారు. అందుకని ఒకప్పుడు అక్కడ ఎస్.ఐ. వున్నా ఇప్పుడు మాత్రం పోలీస్ అవుట్‌పోస్టు వుంది.

పోలీస్ అవుట్‌పోస్టులో యెవరూ లేరు. సెంట్రీ వున్నాడు. వ్యాన్ ఆగగానే పరిగెత్తుకుంటూ వచ్చి సెల్యూట్ చేశాడు. హెడ్‌కానిస్టేబుల్ హత్య జరిగిన ప్రదేశానికి వెళ్ళాడని చెప్పాడు.

రిజర్వాయర్ మైళ్ళకొద్దీ వ్యాపించి సముద్రాన్ని తలపింపజేస్తూ వుంది. మూడువైపులా కొండలు ఒకవైపు డామ్ మధ్యలో నిండుగా రిజర్వాయర్ పూర్ణగర్భిణి స్త్రీలా వుంది.

రిజర్వాయర్ పక్కనే దాదాపు మైలుదూరం వెళ్లాక ఒకచోట జనం గుంపుగా కనిపించారు.

రోడ్డు కొండమీద వుంది. వంద అడుగులు లోతుకు దిగితే రిజర్వాయర్ ఒడ్డుకి వెళ్లవచ్చు.

వ్యాన్ ఆపి కాలినడకన దిగారు.

ఎస్.ఐ. మూర్తిని చూసి కానిస్టేబుల్స్, హెడ్ యెదురు వచ్చి యెటెంక్షన్‌లో నిల్చుని సెల్యూట్ చేశారు.

వెల్లకిలా పడివుంది శవం. సగం నీళ్ళలోనూ సగం ఇసుకలోనూ ఉంది. కళ్ళు తెరిచే ఉన్నాయి. వంటిమీద యెర్ర చీర, లోపల గులాబీరంగు లంగా ఉన్నాయి. జాకెట్టుగాని, బ్రాసరీగాని లేదు. మెడలో ఆభరణాలు

యేవీ లేవు. చెవులకు పెద్ద పెద్ద రింగులు ఉన్నాయి. జుట్టు చిందరవందరగా ఉంది. వక్షోజాల మీద గోళ్ళతో రక్కినట్లు గాట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

ఆమె యెత్తు ఐదడుగుల పైనే వుంటుంది. పొట్ట దిగువ భాగం వరకూ ఆచ్ఛాదన లేకపోవడంవల్ల ఆమె శరీరం యెండలో బంగారంలా మెరిసిపోతూనే ఉంది. ఏ రాక్షసుడో క్రూరంగా అనుభవించి చంపివేసినట్లు చూస్తున్న వాళ్ళకి తెలిసిపోతూనే వుంది. బలంగా యెంతో ఆరోగ్యంగా ఉన్న ఆమె నూరేళ్ళ జీవితాన్ని బలిగొన్న దుర్మార్గుడిమీద అందరికీ కోపం తెప్పిస్తూ ఉంది. వాడెవడో తెలిస్తే తిరునాళ్లో పిచ్చికుక్కని కొట్టి నట్లు కొట్టి చంపాలన్న కసితో అక్కడ చేరిన కుర్రాళ్ళ గుండెలు మండిపోతున్నాయి.

రూపరాణి శవాన్ని చూసి "అమ్మా!" అంటూ కవ్వున కేక పెట్టి మొదలునరికిన మహావృక్షంలా కూలి పోయాడు రామానుజరావు.

# 3

రూపారాణి హత్య వార్తతో టౌన్ అట్టుడికి పోయింది.

సి.యస్.ఆర్. కాలేజి ప్రిన్సిపాల్ ఆ రోజు సంతాప సూచకంగా సెలవు ప్రకటించారు.

ఎస్.పి, డి. యస్పీ, హుటాహుటిన బయల్దేరి హత్య జరిగిన ప్రదేశానికి వెళ్ళారు. హంతకులను పట్టితీరాలని పట్టుదలలో పోలీసు బలగాలన్నీ పనిచేయటం సాగిం చాయి.

విద్యార్థి ప్రతినిధులు జిల్లా కలెక్టర్ని కలిసి తమ నిరసన తెలియజేశారు. హంతకులను పట్టి శిక్షించగలమని కలెక్టర్ హామీ ఇచ్చాడు.

రూపరాణిని దారుణంగా చెరిచి గొంతు పిసికి చంపారని పోస్టుమార్టమ్ రిపోర్టులో తేలింది.

దిన పత్రికలు రూపరాణి శవాన్ని ఫోటో తీసి ఆమె మరణాన్ని దేశవ్యాప్తంగా ప్రచారం చేశాయి.

సీవ్యూ గెస్టు హౌస్‌లో వాచ్‌మాన్‌ని బంధించి పై అంతస్థులో పడేసి, ఇంత దారుణాన్ని చేశారని వూహించారు. రాత్రి తొమ్మిదింటికి తను భోజనంచేసి చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాననీ, తనని వెనుక నుంచీ ఎవరో వచ్చి దుప్పటి ముసుగుపెట్టి బంధించారనీ చెప్పాడు. వాళ్లు ఇద్దరని తను అనుకుంటున్నానని చెప్పాడు.

అంతకంటే వివరాలు దొరకలేదు పోలీసులకి. రెండు రోజులు గడిచినా ఎవర్నీ అరెస్టు చెయ్యలేదు. పోలీసు కుక్కల్ని రంగంలోకి దింపినా ప్రయోజనం లేకపోయింది.

రూపరాణిని హత్య చెయ్యడానికి కారణం ఏమిటి? ఎవరు చేసివుంటారు? అనే ప్రశ్నలకు సమాధానం దొరకడం లేదు.

ఆ వూరు నుంచి వారం వారం ప్రచురణ అయ్యే స్థానిక పత్రికలో రూపరాణి హత్యగురించి ఎడిటర్ స్వయంగా రాసిన వ్యాసం గొప్ప సంచలనం రేపింది.

అందులో రాసిన విషయాలు చదివి స్టూడెంట్సు ఆవేశంలో పోలీస్ స్టేషన్ చుట్టుముట్టారు. రాళ్ళు విసిరి గొడవచేశారు. సి.ఆర్.పి. రంగంలోకి దిగాకగాని పరిస్థితి

అదుపులోకి రాలేదు.

సీ వ్యూ గెస్టు హౌస్‌లో రూపరాణి హత్య జరగడానికి ముందు రోజు బస చేసింది లక్ష్మీటాకీస్ ప్రొప్రయిటర్ కొడుకు మధుసూధనరావు అని విజిటర్స్ రిజిష్టర్‌లో వుంది. అతనితోపాటు ఎస్.ఐ. రామ్మూర్తిగూడా బస చేశాడని వాచ్‌మాన్‌తో సహా సాక్ష్యం వుంది. రిసెప్షనిస్టుని కూడగట్టుకుని అంతకు ముందురోజే గెస్టుహౌస్ ఖాళీ చేసినట్లు రాయించారు.

రూపరాణిమీద వాళ్ళిద్దరికీ చాలకాలంనుంచి కోపంగా వుంది. సినిమా హాల్లో బుక్కింగ్ బైట బ్లాకులో టిక్కెట్లు అమ్ముతున్నారని, బుక్కింగ్‌లో నామకామాత్రమే అమ్ముతున్నారనీ, పోలీసులతో సినిమా వాళ్ళు లాలూచీ పడుతున్నారని రూపరాణి ఎస్.ఐ.తోను, మధుసూదనరావుతోను రెండు మూడుసార్లు పోట్లాడింది. దానికి చాల మంది స్టూడెంట్సు సాక్ష్యం వున్నారు.

ఆ తర్వాత రూపరాణితో స్నేహంగా వుండటానికి మధుసూధవరావు ఎన్నోసార్లు ప్రయత్నించాడనీ,టిక్కెట్లు తీసుకోకుండా ఆమెను ఫ్రీగా కూర్చోమని బ్రతిమాలాడనీ, సినిమాలో కూర్చున్నాక డ్రింక్స్ పంపేడనీ కాని ఆమె అన్నీ తిరస్కరించిందనీ రూపరాణి స్నేహితురాళ్ళు చెప్పారు.

మధుసూధనరావు తిరుగుబోతు. అతనికి ఇంట్లో భార్యకాక కొత్తపేటలో, రాజుపేటలో వుంపుడుకత్తెలున్నారని తెలుస్తోంది.

రూపరాణిని వలలో వేసుకోడానికి తన ప్రయత్నం

ఫలించక ఎస్.ఐ. రామ్మూర్తి సహాయం అర్థించాడు. వీళ్ళిద్దరూ విజయవాడ లయోలా కాలేజీలో క్లాస్ మేట్సు.

రూపరాణిని హత్య చేయడానికి వీళ్ళిద్దరికితప్ప ఎవరికీ సంబంధం లేదు. కంచె చేను మేసింది అంటూ ఎడిటర్ రాశాడు.

ఎస్. ఐ. రామ్మూర్తి చేసిన దారుణం రాష్ట్ర అసెంబ్లీలో ప్రతిపక్షాల నాయకుడు ప్రస్తావించాడు. పోలీసు అధికారులే హత్యలు చేస్తుంటే ప్రజలకు భద్రత ఎలా వుంటుందని ప్రశ్నించాడు. అతనిమీద చర్య తీసుకోవాలని డిమాండ్ చేశాడు. ప్రతిపక్షం సభ్యులు వాకౌట్ చేశారు.

ఎస్.ఐ. రామ్మూర్తిని సస్పెండ్ చేశారు. మధుసూధన రావుని అరెస్టుచేసి తర్వాత బెయిల్ మీద విడుదల చేశారు.

## 4

"మిమ్మల్ని చూసి ఎవరో స్టూడెంట్ అనుకున్నాను" అన్నారు ప్రిన్సిపాల్, క్రైంబ్రాంచి ఇనస్పెక్టర్ కృష్ణని చూసి.

"నేనింకా స్టూడెంట్ నే. ఎన్నో తెలుసుకోవాలి గదా!" అన్నాడు కృష్ణ.

"మీకు ఈ కేసు ఒప్పగించడంలోనే తెలిసిపోతోంది మీరెంత ఘటికులయిందీ" అన్నారు ప్రిన్సిపాల్.

కృష్ణ నవ్వి వూరుకున్నాడు.

"మీకేం కావాలో నిర్భయంగా అడగండి."

"రూపరాణి క్లాస్ మేట్సుని కలుసుకోవాలి."

"అలాగే పదండి" అంటూ లేవబోయారు ప్రిన్సిపాల్.

"అక్కడికి కాదు. అయినా అందరూ అవసరంలేదు. ఎవర్నో ఒకర్ని పిలిపించండి చాలు" అన్నాడు కృష్ణ.

ప్రిన్సిపాల్ కాలింగ్ బెల్ నొక్కారు.

అటెండర్ స్ప్రింగ్ డోర్ తెరుచుకుని వచ్చాడు.

"కామాక్షిని పిల్చుకురా" అన్నారు.

కాసేపటికి కామాక్షి వచ్చింది.

"మా తమ్ముడి కూతురు" అంటూ పరిచయం చేశారు.

కామాక్షి, కృష్ణకి విష్ చేసింది.

"నేను రూపరాణి హత్య కేసు ఇన్వెస్టిగేషన్ చేస్తున్నాను. మీకు తెలిసిందేగదా ఎస్.ఐ.ని, సినిమా హాల్ ప్రొప్రయిటర్ కొడుకునీ అరెస్టు చేశారు! కాని వాళ్ళకి శిక్ష పడాలంటే కేసు బలంగా వుండాలి. అందుకు మీరు సహకరించాలి" అన్నాడు కృష్ణ.

"నేనేం చెయ్యాలి" అంది కామాక్షి.

"మీరేం చెయ్యనక్కర్లేదు. నిజం చెప్పాలి."

ఆమె భయపడినట్లుగా చూసింది.

"నాకేం తెలుసు?" అంది.

కృష్ణ నవ్వి "అదికాదు. నాకు కావలసిన విషయాలు మీకు తెలిసినంతవరకూ చెప్పండి చాలు" అన్నాడు.

"అడగండి" అంది తల వంచుకుని.

"రూపరాణి ఎటువంటిది?"

ఏం చెప్పాలో తోచక కొన్ని క్షణాలు అతన్ని వింతగా చూసింది.

"మంచిదే" అంది.

"రూపరాణికి క్లోజ్ ఫ్రెండ్స్ ఎవరు?"

"మా అందరితోనూ క్లోజ్‌గానే మూవ్ అవుతూ వుండేది."

"అది సరేననుకోండి. కాని ఒకరిద్దరితో మరింత క్లోజ్‌గా వుండి వుండాలి. మీరైనా గాని అందరితోనూ ఒకేరకంగా వుండలేరు. ఒకరితోనో ఇద్దరితోనో సన్నిహితంగా వుంటారు. మనసు విప్పి మాట్లాడుకుంటారు."

"హేమలతతో బాగా వుండేది. ఇద్దరూ కలిసి తిరిగేవారు."

"థాంక్స్" అన్నాడు కృష్ణ.

"ఇక నువ్వు వెళ్ళు" అన్నారు ప్రిన్సిపాల్.

"నేను మిమ్మల్ని కలుసుకున్న విషయం సీక్రెట్‌గా వుంచండి" అన్నాడు కృష్ణ.

"అలాగే" అంది.

# 5

"రూపరాణిమీద అంత పగ ఎవరికి వుంది? ఆమెను హత్య చెయ్యడానికి ఎంతో బలీయమైన కారణం వుండి వుండాలి. చాలవరకు మీకు తెలిసి వుంటుంది" అన్నాడు కృష్ణ.

"నాకేం తెలియదు" కంగారుపడుతూ అంది హేమ.

కృష్ణ పోలీసు ఇనస్పెక్టర్ అని తెలిసేసరికి ఆమెకు ఎందుకో భయంగా వుంది. రూపతో తిరిగినందుకు తనను గూడా పోలీసులు అరెస్టు చేస్తారేమోనని ఆమెకు జంకుగా వుంది.

"మీరు కంగారు పడకండి. మీకేం ప్రమాదం లేదు. బాగా ఆలోచించి చెప్పండి. మీకు తెలిసిన విషయాలు చెప్తే కేసు త్వరగా పూర్తిచేస్తాను."

"రూపరాణి చాలా మంచిది. మా కాలేజీలో ఆమె మీద ఎవరికీ కోపం లేదు. ఫస్టు మార్కులు తెచ్చుకుం టుందనీ, తెలివైనదనీ ఈర్ష్య, అసూయ వుంటే ఎవరికైనా వున్నాయేమో" అంది హేమ.

"ఎస్.ఐ. రామ్మూర్తికి, రూపరాణిమీద కోపం వుండేదా?"

"అవును. సినిమా హాలు దగ్గర...."

హేమ మాటలకు అడ్డువచ్చి "అదంతా అందరికీ తెలిసిన విషయమే కదా. పత్రికలలో తెగరాశారు గూడా. అవికాకుండా మీకేమైనా తెలిస్తేచెప్పండి" అనాడు కృష్ణ.

"నాకు అంతకంటే ఎక్కువ తెలియవు."

"రూపరాణికి బాయ్‌ఫ్రెండ్ ఎవరైనా వున్నాడా? ప్లీజ్ నిజం చెప్పండి. లేకపోతే కేసు కన్‌ఫ్యూజ్ అయి పోయి ఎన్నాళ్ళికీ తేలదు" అభ్యర్థిస్తూ అన్నాడు కృష్ణ.

హేమ కాసేపు ఆలోచించింది. కృష్ణవంక చూసి "శ్యామ్‌ప్రసాద్, రూప ప్రేమించుకున్నారు" అంది.

"శ్యామ్‌ప్రసాద్ ఎవరు?"

"మా కాలేజీలోనే వున్నాడు."

"వాళ్ళిద్దరూ ప్రేమించుకున్నారని మీరు గ్రహిం చారా? లేక రూప మీతో చెప్పిందా?"

"రూప చెప్పింది."

"ఐ.సీ."

"స్టడీస్ పూర్తయ్యాక మారేజ్ చేసుకుంటామని చెప్పింది."

"వెరీగుడ్. సరే ఆ విషయం అలా వుంచండి. రూప హత్యజరిగిన రాత్రి పెళ్ళి జరిగింది మీ క్లాస్‌మేట్ సీతా మహాలక్ష్మికి. ఆ పెళ్ళికి మీరూ వెళ్ళారా!"

"వెళ్ళాను."

"బహుశా రూపని ఆఖరిసారి అక్కడే చూశారను కుంటాను."

"అవును" విచారంగా అంది హేమ.

"ఆఖరిసారి ఎన్నింటికి చూశారు. టైం చెప్పండి."

"పెళ్ళి ఐదున్నరకి అయిపోయింది. ప్రెజెంటేషన్సు అవీ పూర్తయ్యేసరికి ఏడయింది. ఎనిమిదింటికి డిన్నర్ చేశాం."

"అప్పుడు మీ ఇద్దరూ ప్రక్క ప్రక్కనే కూర్చు న్నారా?"

"లేదు."

"డిన్నరు తర్వాత మీకు రూప కన్పించలేదా?"

"సీతామహాలక్ష్మికి చెప్పి వెళ్ళిపోవాలని లోపలకి వెళ్ళాం. నేను తిరిగి వచ్చేసరికి రూప కన్పించలేదు."

"మీతో పాటు సీతామహాలక్ష్మి దగ్గరికి రూప రాలేదా?"

"వచ్చిందేమో నేను గమనించలేదు."

"అయితే మీకు చెప్పకుండా వెళ్ళిందన్నమాట."

"అవును."

"ఆమె ఎక్కడికి వెళ్ళిందీ ఎవర్నీ అడగలేదా?"

"అడిగాను."

"ఎవర్ని?"

"మా ఫ్రెండ్స్‌నే."

"ఎవరైనా చెప్పారా?"

"ఎవరో అబ్బాయి వచ్చి పిల్చుకెళ్ళాడని చెప్పారు"

"ఎవరు చెప్పారు,"

"ఎవరో గుర్తులేదు."

"థాంక్స్" అన్నాడు కృష్ణ.

## 6

రాత్రి యెనిమిది గంటలైంది. ఆకాశంలో మెరిసే చుక్కలన్నింటినీ కారుమబ్బులు మింగేశాయి. చీకట్లో వీధి దీపాలు మసకగా వెలుగుతున్నాయి. సన్నటి తుప్పర పూలవానలా పడుతోంది.

చుక్కల్లో చంద్రుడిలా చిన్న చిన్న పెంకుటిళ్ళు, డాబాల మధ్య మూడంతస్థుల శాంతి నిలయం ఠీవిగా వుంది. మేడ చుట్టూ రకరకాల పళ్ళచెట్లు, పూల మొక్కలు గుబురుగా ఆ ఇంటి అందాన్ని రెట్టింపు చేస్తున్నాయి.

విశాలమైన ఆవరణ చుట్టూ కోటగోడలా ప్రహారీ ఎత్తుగా వుంది.

ఇనుప గేటు నెమ్మదిగా నెట్టుకుని ఇంట్లోకి ప్రవేశించాడు కృష్ణ.

మెట్లమీద కూర్చుని యెవరో బీడీ త్రాగుతున్నారు.

"ఎవరండీ" అన్నాడతను కూర్చునే. అతని కళ్ళల్లో

నిర్లక్ష్యం కనిపిస్తోంది.

"శ్యాంప్రసాద్ వున్నాడా?" అన్నాడు కృష్ణ.

"మీ రెవరు?"

"శ్యాంప్రసాద్ ఫ్రెండ్‌ని."

"కూర్చోండి. చెప్పి వస్తాను" అంటూ బీడీ విసిరి అవతల పారేసి ఇంట్లోకి వెళ్ళాడు.

కాసేపటికి తిరిగి వచ్చి "లోపలకి రమ్మన్నారుసార్!" అన్నాడతను.

హాలు చాల విశాలంగా వుంది. సోఫాసెట్టు, ఖరీదైన పెయింటింగ్స్, పల్చటి డోర్ కర్టెన్సు, ఆడంబరంగా కన్పించింది ఇల్లు.

హిప్పీ క్రాపు, మీసాలు, సిల్కు లుంగీ, ఎత్తుగా దృఢంగావున్న పాతికేళ్ళ కుర్రాడు కృష్ణవైపు సాలోచనగా చూస్తూ నిల్చున్నాడు.

"గుడ్ ఈవెనింగ్ —" అంటూ మందహాసం చేశాడు కృష్ణ.

"మీరు.... మీరు...." అంటూ జ్ఞాపకం రాక తడబడ్డాడు.

కృష్ణ ఐడెంటిఫికేషన్ కార్డు చూపించాడు.

అది చూసి "రండి నా రూమ్‌లో కూర్చుందాం" అంటూ దారితీశాడు శ్యాంప్రసాద్.

"ప్లీజ్ టేక్ యువర్ సీట్" అంటూ కూర్చున్నాడు.

"రూపరాణితో మీకు ఎప్పటినుంచి పరిచయం వుంది?"

"దాదాపు సంవత్సరంనుంచి."

"ఆమెను మీరు ప్రేమించారా?"

"అవును."

"మ్యారేజ్ చేసుకోవాలనుకున్నారా?"

"తప్పకుండా చేసుకునే వాడిని. మమ్మల్ని యెవరూ ఆపలేరు."

"మీ పెద్దవాళ్ళకి తెలుసా?"

"ఇంకా అంతవరకూ వెళ్ళలేదు. స్టడీస్ పూర్తయ్యే వరకూ సీక్రెట్ గానే వుంచాలనుకున్నాం."

"ఎందుకని? మీ పేరెంట్స్ ఒప్పుకోరని భయమా?"

"నో....నో.... మా ప్రేమ చదువుకి ఆటంకం కలుగ గూడదని. అంతే" అన్నాడు శ్యామ్‌ప్రసాద్.

నౌకరు కూల్ డ్రింక్స్ తెచ్చి టీపాయ్‌మీద పెట్టాడు. గోల్డుస్పాట్ సీసాలు చెమటలు క్రక్కుతున్నాయి.

"తీసుకోండి" అన్నాడు శ్యామ్‌ప్రసాద్ మూతలు తీస్తూ.

"వద్దండీ. వాతావరణం చల్లగా వుంది గదా!" అన్నాడు కృష్ణ నవ్వుతూ.

"ఫరవాలేదు తీసుకోండి. ప్లీజ్" అన్నాడు.

కృష్ణ సీసా చేతిలోకి తీసుకుంటూ "రూపరాణి హత్య మధుసూధనరావు, రామ్మూర్తి చేసివుంటారని మీరు నమ్ముతున్నారా?" అన్నాడు.

వాళ్ళ పేర్లు వింటూనే శ్యామ్‌ప్రసాద్ ముఖం ఆవేశంతో యెర్రబడింది. కోపంతో ముక్కుపుటాలు అదురుతున్నాయి.

"ఆ విషయంలో నాకేమాత్రం సందేహం లేదు. వాళ్ళిద్దరూ రోగ్స్. రూపని పొట్టన పెట్టుకుంది వాళ్ళే.

వాళ్ళకి వురిశిక్ష తప్పదు. ఎవరూ తప్పించలేరు" అన్నాడు కృష్ణవంక తీవ్రంగా చూస్తూ.

"సారీ. మీరు నన్నర్థం చేసుకోవడంలేదు. వాళ్ళని విడిపించడం నా డ్యూటీ కాదు."

"మరి మీ ఇన్వెష్టిగేషన్ యెందుకు? నా కంతా తెలుసు. పోలీసులు మసిపూసి మారేడుకాయ చేయగల సమర్థులు. ఒక ఎస్.ఐ. మీద కేసుపెట్టి శిక్షించడం మీ డిపార్టుమెంటుకి ఇష్టం లేదు. ఏదో గొడవ జరిగి అసెంబ్లీ వరకూ వెళ్ళి మంత్రుల నోటీస్‌కి రాబట్టి ఎస్.ఐ.ని సస్పెండ్ చేశారు గాని లేకపోతే చేసేవారా?" శ్యామ్ ప్రసాద్ ఆవేశంతో వూగిపోతున్నాడు.

"మిష్టర్ ప్రసాద్. ప్లీజ్. ఆవేశపడకండి. నేను వాళ్ళని నిర్దోషులని వాదించలేదు. కాని వాళ్ళు దోషులే అనుకున్నా వూరికే కేసు పెడితే నిలవదు. బలమైన సాక్ష్యాధారాలు కావాలి. అందుకు మీరు సహకరించాలి. మీకు తెలిసిన నిజం చెప్పండి."

"నేను క్రొత్తగా చెప్పేది ఏంవుంటుంది? మీకేం కావాలో అడగండి చెప్తాను" అన్నాడు శ్యామ్‌ప్రసాద్.

"రూపరాణి ఫ్రెండ్ మ్యారేజీకి వెళ్ళినప్పుడు మీరూ వెళ్ళారా?"

"లేదు."

"ఒక కుర్రాడు మీ పేరు చెప్పి ఆమెను పిల్చుకుని వెళ్ళాడని సాక్ష్యం ఉంది. ఏమంటారు?"

"నో....పచ్చి అబద్ధం" గట్టిగా అన్నాడు. అతని ముఖంలో ఏదో తడబాటు కన్పించింది.

"ఏది అబద్ధం అంటారు? ఆ కుర్రవాడు ఆమెను పిల్చుకుని వెళ్ళడమా? లేక మీరు ఆ పెళ్ళికి వెళ్ళడం అబద్ధమా?"

"నే నా పెళ్ళికి వెళ్ళలేదు."

"థాంక్స్!" అని వచ్చేశాడు కృష్ణ.

## 7

"గుడ్ మార్నింగ్ మిష్టర్ కృష్ణా!" అన్నాడు ఎస్.ఐ. జయరావు. రామ్మూర్తి ప్లేస్‌లో చార్జి తీసుకున్నాడు జయరావు.

'గుడ్ మార్నింగ్!' చెప్పి కూర్చున్నాడు కృష్ణ.

"ఎంతవరకూ వచ్చింది కేసు?"

"ఎక్కడా ఏం క్లూ దొరకలేదు."

"కేసు అంగుళం ముందుకు కదల్లేదని ఎస్.పి. గొడవ పెడుతున్నాడు. రోజూ వైర్లెస్ మెసేజెస్ వస్తున్నాయి...."

"తొందరపడితే యెలా?" అన్నాడు కృష్ణ.

"టీ తీసుకుందామా?"

"తెప్పించు."

కాసేపటికి టీ వచ్చింది.

"కేసు గజిబిజిగా తయారైంది మిష్టర్ జయరావ్! మధుసూదనరావు రూపరాణి కోసం ట్రై చేసిన మాట నిజమేనని తేలింది. కాని మన రామ్మూర్తితో అతనికి యెంత వరకూ ఫ్రెండ్‌షిప్ వుందో సరిగా తెలియడం లేదు."

"అంటే?"

"అదే. ఇద్దరూ క్లాస్ మేట్స్. క్రొత్త పిక్చర్ వచ్చినప్పుడు థియేటర్ కి వెళ్ళేవాడు మూర్తి. తరచుగా యిద్దరూ కలసి బీర్ త్రాగేవారని తెలిసింది. కాని ఆడ వాళ్ళ విషయంలో జాయింట్ వ్యాపారం వుందా? లేదా?...."

"రామ్మూర్తి నాకు పరిచయమే. అతనికి లేడీస్ వీక్ నెస్ లేదు. కాని...."

"కానీ ఏవుంది? ఫ్రెండ్ షిప్ లో వాళ్ళు వీళ్ళు వీళ్ళు వాళ్ళు అవుతూ ఉంటారు. మధుసూదనరావు సినిమా మనిషి. వాడికి యెప్పుడూ ఆడవాళ్ళు కావాలి. వాడి స్నేహంలో పడి మూర్తి గూడా అలవాటు పడ్డాడేమో?...."

"అవొచ్చు...." అన్నాడు కృష్ణ సాలోచనగా.

"నా కెందుకో రామ్మూర్తి నిర్దోషి అనిపిస్తూ వుంది" అన్నాడు జయరావు.

"దోషి అని లోకం కోడై కూస్తుంటే మన మాట యెవరు వింటారు?"

"నిజమే."

"పది దాటింది. ప్రిన్సిపాల్ వచ్చివుంటాడేమో ఫోన్ చేస్తాను" అంటూ ఫోన్ చేశాడు.

అవతల ప్రిన్సిపాల్ పలికాడు.

"సార్! నేను కృష్ణని. క్రైమ్ బ్రాంచి ఇన్ స్పెక్టర్ని."

"గుడ్ మార్నింగ్! కేసు యేవన్నా తేలిందా?" ఆసక్తిగా అడిగాడు ప్రిన్సిపాల్.

"లేదు సార్! ఒక మెట్టు గూడా యెక్కలేదు."

"కానివ్వండి."

"కామాక్షిని ఒక్కసారి పిలుస్తారా?"

"ష్యూర్ .... ష్యూర్ ...."

కాసేపటికి కామాక్షి ఫోన్ యెత్తి, "హల్లో!...." అంది.

"హలో!....కామాక్షీ! నేను చెప్పిన విషయం జ్ఞాపకం ఉందా?"

"ఆఁ....వుందండీ. నిన్ననే అందర్నీ అడిగాను. నిర్మల అని మా క్లాస్ మేటే. ఆ కుర్రాడ్ని చూశానని చెప్పింది."

"వెరీ గుడ్! నే నిప్పుడే వస్తున్నాను. నిర్మల, మీరు ప్రిన్సిపాల్ గారి రూమ్‌లో కూర్చోండి!" అని ఫోన్ పెట్టేశాడు కృష్ణ.

"హమ్మయ్య! కొంచెం క్లూ దొరికింది" అని తృప్తిగా నిట్టూర్చాడు కృష్ణ.

"గుడ్!"

"ఫింగర్ ప్రింట్సు గురించి యేమైనా రిపోర్ట్సు వచ్చాయా?"

"ఆఁ....! అవి పాత దొంగలవి కాదని తేలింది. అవి రామ్మూర్తి, మధుసూధనరావులవి కూడా కాదు. పూర్తిగా క్రొత్తవాళ్ళు" అన్నాడు జయరావు.

"నేను కాలేజీకి వెళ్ళి వస్తాను" అని బులెట్ తీసుకుని వెళ్ళాడు కృష్ణ.

అతను వెళ్ళేసరికే ప్రిన్సిపాల్ ఆఫీసులో కూర్చుని వున్నారు కామాక్షి, నిర్మలనూ.

"ఆ కుర్రవాడి వయసు యెంత వుంటుంది?" అన్నాడు కృష్ణ నిర్మల వంక చూస్తూ.

"పన్నెండేళ్ళ వరకూ వుంటాయి."

"అతను ఏ రంగు బట్టలు తొడుక్కున్నాడో గుర్తుందా మీకు."

"ఆఁ.... తెల్ల చొక్కా, కాకి నిక్కరు తొడుక్కున్నాడు. పైన టక్ చేసుకున్నాడు. తెల్లటి బెల్టు వుంది. కాళ్ళకి కాన్వాస్ బూట్లున్నాయి. అవి బ్రౌన్ కలర్వి .........ఆఁ....జ్ఞాపకం వచ్చింది. ఆ కుర్రాడికి నుదురు మీద కాల్చిన మచ్చ వుంది. నల్లగా వుంటాడు" అంది నిర్మల.

కృష్ణ ఆమె చెప్పిన విషయాలు నోట్ చేసుకున్నాడు.

"ఆ కుర్రాడిని మీరు గుర్తుపట్టగలరా?"

"తప్పకుండా" అంది నిర్మల.

"థాంక్స్" అన్నాడు కృష్ణ.

"మీరు క్లాసుకి వెళ్ళండి" అన్నాడు ప్రిన్సిపాల్.

కామాక్షి, నిర్మల వెళ్ళిపోయారు.

"ఈ వూళ్ళో తెల్ల చొక్కా, కాకి నిక్కరు యూనిఫారమ్ వున్న స్కూల్సు యెన్ని వున్నాయి?" అన్నాడు కృష్ణ.

ప్రిన్సిపాల్ తల ఆడించి ఫోన్ యెత్తి వూళ్ళో వున్న స్కూల్సుకి ఫోన్ చేసి యూనిఫారం గురించి అడిగాడు.

"జోసెఫ్ కాన్వెంట్ లోను, జాన్స్ హైస్కూల్లోను ఆ యూనిఫాం వుందట" అన్నారు ప్రిన్సిపాల్.

కృష్ణ థాంక్స్ చెప్పి, కాలేజీ నుంచి బయల్దేరి తన రూమ్కి వెళ్ళాడు.

# 8

16 M·M. మూవీ కెమెరా లోడ్ చేసి జాన్స్ హైస్కూల్‌కి వెళ్ళాడు కృష్ణ. అప్పటికి పన్నెండున్నర అయింది.

స్కూల్లో గంట గణ, గణ మ్రోగింది.

బుల్లెట్ చెట్టుక్రింద ఆపి స్కూల్ గేటు ప్రక్కన నిల్చున్నాడు.

పిల్లలు బిలబిల మంటూ రాసాగారు. కృష్ణ కళ్ళు ఆత్రంగా అందరి ముఖాలనీ పరీక్షగా వెతకసాగాయి. పది నిముషాలు దాటింది. దాదాపు గేటు దాటి వెళ్ళే వాళ్ళు యెవరూ లేనట్లున్నారు.

గేటుదాటి లోపలకు ప్రవేశించాడు. విశాలంగా వుంది ఆవరణ. చెట్లక్రింద జట్లు జట్లుగా కూర్చున్న పిల్లలు టిఫిన్ క్యారియర్లు ముందు పెట్టుకుని భోజనాలు చేస్తున్నారు.

అందర్నీ చూశాడు కృష్ణ.

వుహూఁ .... అటువంటి కుర్రాడే కన్పించలేదు. బులెట్ స్టార్టు చేసుంటే ఒక కుర్రాడు ఎదురువచ్చాడు.

అదే డ్రెస్. ముఖంమీద అర్ధరూపాయి వెడల్పున కాలిన మచ్చ. నల్లగా వున్నాడు.

కృష్ణ కళ్ళు మెరిశాయి.

"బాబూ!"

ఆ కుర్రాడు ఆగిపోయాడు.

"ఈ పెన్ నీదేనా?" నల్లటి పెన్ చేత్తో పట్టుకుని అడిగాడు కృష్ణ.

ఆ కుర్రాడు అడ్డంగా తల వూపాడు, తనది కాదన్నట్లు.

"ఈ పెన్ నాకు దొరికింది."

ఆ కుర్రాడు ఏం మాట్లాడలేదు. కృష్ణవంక విచిత్రంగా చూశాడు.

"నువ్వొక సంగతి చెప్తే ఈ పెన్ నీకు బహుమతిగా ఇస్తాను. చెప్తావా మరి?"

"ఏ సంగతి?" అన్నాడు.

"నీలకంఠంగారి అమ్మాయి పెళ్ళికి నువ్వు వెళ్ళావా?"

"ఆఁ...."

"వెరీగుడ్. నువ్వు పెళ్ళి పందిట్లో ఆడుకుంటూ వుంటే ఎవరో వచ్చి ఒక అమ్మాయిని చూపించి, బైటికి పిలవమని నిన్ను ఆమె దగ్గరికి పంపారుగదూ!"

"పిలవమని చెప్పలేదు."

"మరి."

"కాగితం ఇచ్చిరమ్మని నాకు రూపాయి ఇచ్చాడు."

"వెరీగుడ్ బాయ్. అలా చెప్పాలి. ఆఁ....యెవరు అతను నీకు గుర్తుందా?"

"ఆఁ."

"ఎవరు?"

"సీతయ్య."

"సీతయ్యంటే?"

"మా నాన్న పనిచేసే చోట పని చేస్తాడు. మా ఇంటి దగ్గరే వాళ్ళిల్లు."

"మీ నాన్న యెక్కడ పనిచేస్తాను?"

"జూట్ మిల్లులో."

"మీ నాన్న పేరు?"

"వెంకటేశ్వర్లు."

"గుడ్ బాయ్" అని మెచ్చుకుని "నీ పేరు ఏమిటి?" అన్నాడు.

"నరసింహమూర్తి."

"ఆఁ....ఇదుగో నీకు పెన్ను ఇచ్చేస్తున్నాను తీసుకో" అని పెన్ ఆ కుర్రాడికి యిచ్చి "తర్వాత ఏం జరిగింది చెప్పు? ఆ అమ్మాయి బైటకి వచ్చిన తర్వాత సీతయ్య ఏం చేశాడు? ఆమెతో మాట్లాడాడా?"

"ఆ అమ్మాయి బైటకు వచ్చింది. తర్వాత నేను చూళ్ళేదు."

"ఏం?"

"నేను బిస్కెట్లు కొనుక్కుంటానికి వెళ్ళాను." అన్నాడు.

"అలాగా...." అంటూ "సరే. ఇక నువ్వు వెళ్ళు బాబూ!" అని ఆ కుర్రాడిని స్కూల్లోకి పంపేశాడు.

టైం చూసుకున్నాడు. ఒంటి గంట దాటింది.

దగ్గరలో ఒక హోటల్లోకి వెళ్ళి పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేశాడు.

"జయరావు ఎస్.ఐ. స్పీకింగ్" అని అవతలనుంచి వినిపించింది.

"కృష్ణ స్పీకింగ్."

"ఏం గురూ?"

"క్లూ దొరికింది."

"వెరీగుడ్."

"వెంటనే నువ్వు స్వయంగా జూట్ మిల్లుకు వెళ్ళి

సీతయ్య అనేవాడిని అరెస్టుచేసి స్టేషన్‌కి తీసుకురా."

"అలాగే."

కృష్ణ ఫోన్ పెట్టేశాడు.

# 9

కృష్ణ స్టేషన్‌కి వెళ్ళి పావుగంట వెయిట్ చేసిన తర్వాత వ్యాన్ వచ్చి ఆగింది.

బేడీలు వేసి తీసుకొచ్చారు సీతయ్యని.

అతనికి దాదాపు నలభై ఏళ్ళుంటాయి. ఎత్తుగా వున్నాడు. చామన ఛాయ రంగులో వున్నాడు. జుట్టు అక్కడక్కడా తెల్లబడింది. కోర మీసాలున్నాయి.

ఆత్మవిశ్వాసం గల మనిషిలా గంభీరంగా వున్నాడు. పోలీసులు పట్టుకొచ్చారన్న భయంవున్న మనిషిలా లేడు. 'వీళ్ళు నన్నేం చెయ్యలేరు' అనే నిర్లక్ష్యం వుందని చూపుల్లో. మొత్తానికి ఢక్కాముక్కీలు తిన్నవాడిలా డోంట్‌కేర్ మాష్టర్‌లా కన్పించాడు.

"నీ పేరేమిటి?" అన్నాడు కృష్ణ.

" పేరు తెలియకుండానే పట్టుకొచ్చారా?"సీరియస్‌గా అన్నాడు సీతయ్య.

"అడిగిందానికి సమాధానం చెప్పు" గట్టిగా అరిచాడు జయరావు కోపంతో.

"సీతయ్యండీ...." నిర్లక్ష్యంగా పొగరుగా వినిపించింది అతని కంఠం.

"నీలకంఠంగారింటికి పెళ్ళిరోజు నువ్వు వెళ్ళావు."

"ఆఁ...."

"రూపరాణి అనే అమ్మాయిని నరసింహామూర్తి అనే

కుర్రాడితో పందిరిలోకి రప్పించావు."

"ఆఁ—"

"ఆ కుర్రాడి చేతికి ఒక చీటి ఇచ్చి పంపావు."

"నిజమే."

"అందులో ఏవుంది?"

"ఏమో!"

"నువ్వెక్కడున్నావో తెలుసా? పోలీస్ స్టేషన్లో. అది తెలుసుకుని వళ్ళు దగ్గర పెట్టుకుని సమాధానం చెప్పు" హూంకరించాడు జయరావు.

"ఎందుకండీ అంత కోపం? నేనేం తప్పుడు సమాధానం చెప్పలేదే!" అన్నాడు సీతయ్య.

"ఆ చీటీలో ఏవుందో చెప్పు?" గద్దించాడు కృష్ణ.

"నాకేం తెలుసండీ. నేను చూస్తేగదా?"

"ఆ చీటీ నీకు ఎవరిచ్చారు?"

"..........."

"చెప్తావా లేదా?" దగ్గరికి వస్తూ అన్నాడు జయరావు.

సీతయ్య ఆలోచనలో పడిపోయాడు.

"చెప్పరా రాస్కెల్" లాగి కొట్టాడు ఎస్.ఐ.

"చెప్పు సీతయ్యా!" అనునయంగా అన్నాడు కృష్ణ.

సీతయ్య మాట్లాడలేదు. దిక్కులుచూస్తూ నిల్చున్నాడు.

"వెంకటసామీ నాలుగు తగలనియ్యి.... వాడి తల్లో జేజమ్మ చెప్తుంది. వూఁ...." ఆజ్ఞాపించాడు జయరావు.

వెంకటస్వామి లాఠీతో పొట్టలో పొడిచాడు. కాళ్ళ మీద కొట్టాడు. జుట్టు పట్టుకుని వంచి పిడిగుద్దులు గుద్దాడు.

"నన్ను కొట్టకండి" బాధతో కేకలు పెట్టాడు సీతయ్య. మనిషి కొంచెం భయపడినట్లు కనిపించాడు.

"అయితే చెప్పు."

"లక్ష్మి టాకీస్ ఓనరుగారబ్బాయి మధుసూదనరావు నాకు ఆ చీటీ ఇచ్చాడు. కాని అది శ్యాంప్రసాద్ ఇచ్చాడని చెప్పమన్నాడు. ఆ చీటీ చదివి నాతో వస్తుందనీ, ఆ అమ్మాయిని తీసుకుని గాంధీ పార్కు దగ్గరికి తీసుకు రమ్మన్నాడు."

"ఊఁ....తర్వాత."

"తర్వాత కారులో ఎక్కడికో వెళ్ళారు."

"ఎక్కడికి వెళ్ళారో నీకు తెలియదా?"

"లేదు" అన్నాడు సీతయ్య.

"మధుసూదనరావు నీకెలా తెలుసు? రూపరాణిని నీతోనే ఎందుకు పిలిపించాడు?"

"నేను వాళ్ళ సినిమాహాల్లో కొన్నాళ్ళు గేట్ కీపర్ గా పనిచేశాను. ఆ పరిచయంతోనే పెళ్ళి పందిట్లో నిల్చున్న నన్ను కేకేసి చెప్పాడు."

"పెళ్ళి పందిట్లో నువ్వెందుకున్నావు?"

"మా ఇల్లు ఆ వీధిలోనే. నీలకంఠంగారు నన్ను పెళ్ళికి పిల్చాడు."

"ఐ.సీ." అన్నాడు కృష్ణ.

వెండికొండ ప్రాజెక్టు గెస్టు హౌస్ లో విస్కీ సీసాల మీద దొరికిన వేలిముద్రలతో సీతయ్య వేలిముద్రలు సరి పోలేదు.

"నా బుర్ర సరిగా పనిచెయ్యడం లేదు. ఈ రోజు నైట్ ఎక్స్ప్రెస్ కి హైదరాబాద్ వెళ్ళి వస్తాను" అన్నాడు కృష్ణ.

"ఎందుకూ?"

"జర్నీ చేస్తుంటే నాకు ఐడియాలు పుట్టుకొస్తుంటాయి" అన్నాడు కృష్ణ.

# 10

పోలీస్ స్టేషన్‌లో ఎస్.ఐ. జయరావు ముందున్న ఫోన్ మ్రోగింది:

జయరావు రిసీవర్ ఎత్తి "ఎస్.ఐ. జయరావు స్పీకింగ్" అన్నాడు.

"హల్లో నేనూ కృష్ణని మాట్లాడుతున్నాను. గుడ్ మార్నింగ్."

"కృష్ణా! ఎప్పుడొచ్చావు హైద్రాబాదునుంచి?"

"రాత్రి వచ్చాను."

"ఎక్కడ్నుంచి మాట్లాడుతున్నావు?"

"హోటల్ మాధవినుంచి."

"హోటల్లో ఎందుకు దిగావు?"

"సూపర్ ప్లానొకటి వేశాను. ఈ దెబ్బతో కేసు క్లోజయిపోవాలి."

"ఏమిటో?"

"నువ్వు వెంటనే ఇక్కడికి రా. రూమ్ నెంబర్ పదమూడు."

"ఓ.కే. వస్తున్నా" అని రిసీవర్ పెట్టేశాడు.

పది నిముషాల్లో హోటల్ మాధవికి చేరుకున్నాడు జయరావు.

బెల్ నొక్కగానే తలుపు తీసింది కృష్ణే.

లోపల ఎవరో ఇద్దరు అపరిచిత వ్యక్తులు కూర్చుని వున్నారు.

కృష్ణ వాళ్ళని పరిచయం చేశాడు. వాళ్ళిద్దరూ టైగర్ టీ కంపెనీ సేల్స్‌మాన్స్.

"టైగర్ టీ పేరు ఎప్పుడూ వినలేదే" అన్నాడు జయరావు.

"ఈమధ్యనే మొదలుపెట్టారు. కలకత్తా హెడ్డాఫీసు. హైదరాబాద్‌లో కొండారెడ్డిగారు ఆంధ్రప్రదేశ్‌కి డిస్ట్రిబ్యూషన్ తీసుకున్నారు. టైగర్ టీ ప్రాపగాండా చెయ్యడానికి ఈ వూరువచ్చాం" అన్నాడు సేల్స్‌మాన్.

ఈ టీ కంపెనీ వాళ్ళతో కృష్ణకి ఏం పనో అర్థం కాలేదు జయరావుకి.

"అవునూ అసలు సంగతేమిటి?" అన్నాడు జయరావు కృష్ణవంక క్రీగంట చూస్తూ.

"వీళ్ళని చూశాక నాకొక ఐడియా వచ్చింది."

ఏమిటి అన్నట్లు చూశాడు జయరావు.

"వీళ్ళకి టీ ప్రాపగాండా కావాలి. రేపు వూరనిండా వాల్ పోస్టర్స్, జెండాలూ అవీ అతికిస్తారు. అదంతా వాళ్ళ బిజినెస్. అందులో కొంత టీ ప్యాకెట్సు వుచితంగా పంచడానికి వాళ్ళ డిస్ట్రిబ్యూటర్స్ అనుమతి వుంది."

"ఐతే?"

"అంతా విను భాయ్. మనం ఈ రోజు గాజుగ్లాసులు అద్దెకు తీసుకుని జూట్ మిల్లుకి వెళ్ళాలి. అక్కడ స్టాఫ్‌కి వర్కర్సుకి టైగర్ టీ బాగుంటుందని ప్రాపగాండా చేస్తూ తలా ఒక గ్లాసు టీ వాళ్ళకి ఇవ్వాలి."

"ఇస్తే"

"వాళ్ళ ఫింగర్ ప్రింట్సు గ్లాసులమీద పడతాయి గదా" అన్నాడు కృష్ణ.

"గెస్టు హౌస్‌లో విస్కీ సీసాలమీద దొరికిన ఫింగర్ ప్రింట్సు జూట్ మిల్లులో ఎలా తేలాయి?" సందేహిస్తూ అన్నాడు జయరావు.

"చూస్తూ వుండు."

"సరే. హంతకుడు జూట్ మిల్లులో వుంటాడను కుందాం. ఈ టీ కంపెనీ బిజినెస్ ఎందుకు? సరాసరి వెళ్ళి అందరి వేలిముద్రలూ తీసుకుంటే సరిపోదా?"

"మనం వేలిముద్రలు తీసుకుంటూ వుంటే అసలైన వాళ్ళు జారుకునే ప్రమాదం వుంది."

"మరి ఏ గ్లాసుమీద ఎవడి వేలిముద్రలో ఎలా తెలుస్తుంది మనకి?"

"అదే చెప్తున్నా. గ్లాసులు తెచ్చి వాటి అడుగున నెంబర్లు చిన్నగా పెయింట్ చేయించాలి. జూట్ మిల్లుకి వెళ్ళి ఒక్కొక్కడి పేరూ రాసుకుని కూపన్లు ఇవ్వాలి. ఏ నెంబరు కూపను తెస్తే వాడికి ఆ నెంబరు గ్లాసే ఇవ్వాలి. అప్పుడు తెలుస్తుంది కథ."

"సరే. ఇప్పుడేం చెయ్యాలి. గ్లాసులు తెప్పించాలి. పెయింటరు ఒకడూ. అవి వస్తే ఇక్కడే నెంబర్లు వేయిస్తాను. జూట్ మిల్లు మేనేజర్‌తో మాట్లాడి వస్తారు మనవాళ్ళు. తర్వాత టీ తయారు చెయ్యడానికి పాత్రలు అవీ కావాల్సివస్తాయి."

"విఘ్నేశ్వరా ఎంటర్‌ప్రైజస్ అని మనవాడే ఒక డున్నాడు. వాడిని ఇక్కడికి పిలిపిస్తాను. నీకేం కావాలో అన్నీ లిస్టు రాసిస్తే వాడు అరేంజ్ చేస్తాడు. పెయింటర్ని గూడా వాడే కుదురుస్తాడు."

"ఓ.కె."

"నేను కొత్తపేట వెళ్తున్నాను. అక్కడ హోటల్లో ఏదో గొడవ జరిగిందట."

"అసలు సంగతి మర్చిపోయాను. జూట్ మిల్లుకి మనం వెళ్ళగూడదు. సివిల్ డ్రెస్‌లో నలుగురు కానిస్టేబుల్సుని పంపిద్దాం. వీళ్ళిద్దరూ వుండనే వున్నారుగదా!" అన్నాడు కృష్ణ.

"ఓ.కే." అని వెళ్ళిపోయాడు జయరావు.

## 11

బులెట్ వేసుకుని రయ్‌మంటూ వచ్చి స్టేషన్ ముందు ఆగాడు కృష్ణ. అతను చాల సంతోషంగా హుషారుగా వున్నాడు.

"గ్రాండ్ సక్సెస్" అంటూ జయరావుకి షేక్‌హాండ్ ఇచ్చాడు.

"నిజం?" అన్నాడు జయరావు నమ్మలేనట్లు ఆశ్చర్యంగా చూసి.

"యస్. జూట్ మిల్లులో పనిచేస్తున్న అప్పల నరసయ్య, బాబూరావు. వీళ్ళే హంతకులు. వెండి కొండ ప్రాజెక్టు సీ ఫ్ర్యాగెస్టు హౌస్‌లో విస్కీ సీసాలమీద దొరికింది వీళ్ళ వేలిముద్రలే. వెంటనే వెళ్ళి వాళ్ళిద్దర్నీ అరెస్టుచేసి తీసుకురా" అన్నాడు కృష్ణ.

జయరావు వుత్సాహంతో వ్యాన్ వేసుకుని బయల్దేరాడు. అరగంటలో తిరిగి వచ్చాడు.

"వెల్‌కమ్ మిస్టర్ అప్పల నరసయ్యా! అండ్ మిస్టర్ బాబూరావ్!" అన్నాడు కృష్ణ బేడీలు వేసి స్టేషన్‌కి తీసికొచ్చిన వాళ్ళని చూసి నవ్వుతూ.

అప్పల నరసయ్య పొడుగ్గా వున్నా బలంగానే వున్నాడు.

బాబూరావు ఇనపగుండులా పొట్టిగా లావుగా వున్నాడు.

"మీ ఇద్దరూ పనిచేసేది జూట్ మిల్లులో. కాని తాగేది ఫారిన్ విస్కీ సీసాలు" అంటూ నవ్వి "అవి ఫారిన్‌వి అనుకుంటున్నారా మీరు? ఫారిన్ ఖాళీ సీసాలలో నాటుసారా పోసి ఇచ్చి వుంటాడు మీ ప్రొప్రయిటర్. అవునా?"

కృష్ణ మాటలు వింటూ వాళ్ళిద్దరూ ముఖ ముఖాలు చూసుకున్నారు.

"ఏం చూసుకుంటారుగాని నిజం చెప్పండి అప్పల నరసయ్యగారూ! కాస్త నోరిప్పండి బాబూరావు పహిల్వాన్ గారూ!"

"మాకేం తెలియదు."

"తెలియదా! ఏం తెలియదు? మరి ఏం తెలుసు?"

వాళ్ళు మౌనంగా చూస్తూ నిల్చున్నారు.

"రూపరాణిని మానభంగం చేసి, ఆతర్వాత ఆమెను హత్య చేసింది మీరే!" కంచులా మ్రోగింది కృష్ణ కంఠం.

ఇద్దరూ వులిక్కిపడ్డారు.

"మేం కాదు" అన్నాడు అప్పలనరసయ్య.

"మమ్మల్ని ఎందుకు అరెస్టు చేశారు? ఆమెను మేం చంపామని మీకేం తెలుసు?" కోపంతో అన్నాడు బాబూరావు.

"నువ్వడిగిన వెధవ ప్రశ్నలకి సమాధానం చెప్పాల్సిన అవసరం మాకు లేదు. మీరు చంపినట్లు మాకు ఎలా తెలుసో కోర్టులో మా లాయర్ చెప్తాడు జడ్జికి."

"మరింకేం? మమ్మల్ని అడుగుతారెందుకు. కేసు పెట్టండి" అన్నాడు అప్పల నరసయ్య.

"కేసు పెట్టకుండా వదిలిపెట్టం. మీ కింత ధీమా ఏమిటో నాకు అర్థమైంది. కాని రోజులన్నీ మనవికాదని మాత్రం గుర్తుంచుకోండి. మీరెన్ని మోసాలు చేసినా పాపాలు చేసినా ఎల్లకాలం చెయ్యలేరు. ఏదోక రోజు వాటికి అంతం వుంటుంది. మర్యాదగా చెప్పండి రూపా రాణిని ఎందుకు హత్య చేశారు?"

"మేం చేస్తేగదా మీకు చెప్పడానికి" మొండిగా అన్నాడు బాబూరావు.

"మీరు చేశారో, లేదే మీ అంతరాత్మకి తెలుసు. ఎన్ని ఘోరాలు చేసినా తప్పించే వాళ్ళున్నారని విర్రవీగకండి. ఈసారి మిమ్మల్ని దేవుడుగూడా రక్షించలేడు. ఉరిశిక్ష ఖాయం" అన్నాడు కృష్ణ తీవ్రంగా.

ఉరిశిక్ష మాట వినగానే అప్పల నరసయ్య కొంచెం చలించినట్లు కనిపించాడు. బాబూరావు తల వంచుకుని ఆలోచనలో పడ్డాడు.

"మీరు హత్య చేసినట్లు అన్ని ఆధారాలూ మాకు దొరికాయి. రేపో, మాపో కోర్టులో వురిశిక్ష వేస్తారు. కాని ఆమెను ఎందుకు హత్య చేశారు? మీరే చేశారా? లేక మీతో ఎవరైనా చేయించారా? చెప్పండి. నిజం చెప్తే వురిశిక్ష పడదు. జైలు శిక్షతో సరిపోతుంది" అన్నాడు ఎస్.ఐ. జయరావు.

గంటసేపటి వరకూ ఇద్దరూ నోరు మెదపలేదు. ఇద్దరికీ దేహశుద్ధి చేశాక, చిత్రహింసలు పెట్టాక వాటికి తట్టుకోలేక, నిజం చెప్పారు.

"మా ప్రొప్రయిటర్ చెయ్యమంటే చేశాం" అని ఇద్దరూ ఒప్పుకున్నారు.

## 12

మర్నాడు పేపర్లలో రూపరాణిని హత్య చేసిన హంతకుల ఫోటోలతో పాటు హత్య చేయించిన అతని ఫోటో గూడా పడింది.

ఈ హత్యకి వెనుకవున్న పెద్దమనిషి శ్రీమాన్ కేశవస్వామి, జూట్ మిల్లు ప్రొప్రయిటర్.

తన కొడుకు శ్యాంప్రసాద్ రూపరాణిని ప్రేమించి ఆ పిల్లనే పెళ్ళి చేసుకుంటానని పట్టుబట్టటంవల్ల, తనకు గత్యంతరం లేక ఆమెను హత్య చేయించానని ఒప్పుకున్నాడు కేశవస్వామి.

"కంగ్రాట్స్. మొత్తానికి ఒక ఘరానా పెద్దమనిషిని పట్టుకుని కోర్టుకు యెక్కించావు" అంటూ అభినందించాడు జయరావు.

కృష్ణ నవ్వాడు.

"అసలు నీకు అతనిమీద అనుమానం యెందుకు కలిగింది?" ప్రశ్నించాడు జయరావు.

"రూపరాణి, శ్యామ్‌ప్రసాద్ ప్రేమించుకున్న సంగతి ఆ కాలేజీలో చాల మందికి తెలిసిందే. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకోవడానికి నిర్ణయించుకున్నారనీ, కాని శ్యామ్‌ప్రసాద్ తండ్రి బాగా డబ్బున్నాయన కావడంవల్ల సామాన్య కుటుంబంలోని పిల్లను, ఒక స్కూలుమాస్టారు కూతుర్ని కోడలుగా స్వీకరించాడానికి నిరాకరించాడనీ, శ్యామ్‌ప్రసాద్ మాత్రం రూపరాణిని రిజిష్టర్ మ్యారేజ్ చేసుకుని తీరాలని ఫ్రెండ్స్ ప్రోత్సాహంతో దృఢనిశ్చయంతో వున్నాడని తెలిసింది.

రూపరాణిని హత్య చెయ్యడానికి యెవరికి యెక్కువ అవసరం వుంటుందో బాగా ఆలోచించాను. ఆమె బాయ్ ఫ్రెండ్ శ్యామ్‌ప్రసాద్ బిజినెస్ మాగ్నెట్ కేశవస్వామి కొడుకు అని తెలుసుకున్న తర్వాత నాకు అనుమానం కలిగింది.

శ్యామ్‌ప్రసాద్‌ని కలుసుకున్నాను. రూపరాణిని తన తండ్రే హత్య చేయించాడని అతనికి బాగా తెలుసు. అందుకే స్థానిక పత్రికలో మధుసూదనరావు మీద, ఎస్.ఐ.మీద లేనిపోనివి రాయించి అనుమానం రేకెత్తించాడు. తనకి వున్న స్టూడెంట్ బలంతో అలజడి సృష్టించాడు. తన తండ్రిమీదకు కేసు రాకుండా జాగ్రత్త పడ్డాడు.

కాని నాతో మాట్లాడేటప్పుడే పప్పులో కాలేశాడు. తమ ప్రేమ సంగతి తండ్రికి తెలియదని అన్నాడు. స్టడీస్ పూర్తయ్యేవరకూ సీక్రెట్‌గా వుంచాలనుకున్నామని చిన్న అబద్ధం చెప్పాడు. రేపోమాపో రూపరాణిని అతను రిజిష్టర్ మ్యారేజీగాని, గుళ్లో పెళ్ళిగాని చేసుకోబోతున్నాడని అతని ఫ్రెండ్స్ సర్కిల్లో తెలిసినప్పుడు, తమ ప్రేమ సంగతి తండ్రికి తెలియదని ఘోరంగా యెందుకు అబద్ధం చెప్పాడు?

రూపరాణి తన యింటికి కోడలుగా రాకుండా వుండాలంటే వొక్కటే మార్గం దొరికింది కేశవస్వామికి. అందుకే రూపరాణిని హత్య చెయ్యమని మనుషుల్ని నియోగించాడు'' అంటూ ముగించాడు కృష్ణ.

"వెల్‌డన్! నిర్దోషులను రక్షించావు'' అని మెచ్చుకున్నాడు జయరావు.

—:ఐ పో యిం ది:—

సీరియల్

# అడుగు ముందుకు వేస్తే భస్మం



## వసుంధర

(పదకొండవ భాగము)

ఎందుకైనా మంచిదని ఆ ఆకారం వెనకకు చేరింది ఈశ్వరి. ట్రాన్స్‌మీటర్ ద్వారా విషయం శ్రీకృష్ణ పరమాత్మకు అందజేసింది.

“అక్కడే ఉండి పరిస్థితులు గమనించు. ఎవరైనా అటు రాకపోరు.........” అంటూ ఆదేశించాడు శ్రీకృష్ణ పరమాత్మ.

ఈశ్వరి జేబులోని బ్లేడ్ తీసుకుని నమలసాగింది. ఏమీ తోచక ఆకారాన్ని ఆమె జాగ్రత్తగా పరిశీలించసాగింది. ఆకారం వెనుక యేదో మీటలాంటిది ఉన్నట్లు ఆమెకు

తోచింది. ఆమె చటుక్కున ఆ మీట నొక్కింది.

వెంటనే ఆ ఆకారం చేయి వొకటి లేచి ఒకవైపుగా చూపింది.

ఈశ్వరి జరిగిన విశేషానికి ఆశ్చర్యపడింది. ఓ క్షణం ఆలోచించేక ఆమెకు ఆ మీట దారి తెలుసుకోవడానికి ఉపయోగపడుతుందని అర్థమయింది. ఉత్సాహంగా ట్రాన్స్‌మీటర్లో శ్రీకృష్ణపరమాత్మకు యీ విషయాన్ని తెలియజేసింది.

"వెరీగుడ్! నీ తెలివితేటలు ప్రశంసనీయం-ప్రొసీడ్!" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

ఈశ్వరి ఆకారం సూచించినవైపే నడిచి గుహను చేరుకుంది.

గుహలో అడుగిడే ముందు ఆమె గుండె లదిరాయి. అంతవరకూ ఫరవాలేదు కానీ తన కష్టాలు ఆ క్షణంనించే ప్రారంభమవుతాయి.

అక్కడే కాసేపు విశ్రాంతి తీసుకుంది. విశ్రాంతి తీసుకుంటున్నప్పటికీ యిటు గుహనూ, అటు బయటి ప్రాంతాన్నీ బహు జాగరూకతతో గమనించడం ఆమె మరచిపోలేదు.

కాసేపటికి నెమ్మదిగా గుహలో అడుగుపెట్టింది. తన వద్దనున్న బ్యాటరీలైటు ఉపయోగించింది. గుహలో వో మూలగా ఉన్న మనిషి ఆమెకు కనిపించాడు. ఈశ్వరి భయపడకుండా ఆ మనిషిని సమీపించబోయింది.

"అడుగు ముందుకు వేస్తే చస్తావ్!"

ఈ హెచ్చరిక విని ఆమె ఒక్కక్షణం ఆగిపోయినా అంతలో పరమాత్మ చెప్పిన సమాచారం గుర్తుకు వచ్చి తనలో తనే నవ్వుకుని ముందడుగు వేసింది.

భయపడకుండా ఆమె ఆ బొమ్మను సమీపించింది. ఆ మనిషి కాసేపు గిరగిరా తిరిగి నేలలోకి కృంగిపోయాడు. ముందుకు వెళ్ళడానికి సన్నని మార్గం కనబడింది ఈశ్వరికి. ఆమె ఆ మార్గంగుండా నడిచి సుమారు పావుగంట అయే సరికి గుహ చివరకు వచ్చింది.

అయితే గుహ బయటకు వెంటనే వెళ్ళడానికి భయపడింది. కాసేపు జాప్యంచేసి ధైర్యాన్ని కూడగట్టుకుని బయటకు వెళ్ళిందామె.

అక్కడ ఆమెకు వొక జంట కనబడింది. వయసులో ఉన్న యువతీ యువకులు. వాళ్ళిద్దరూ ఆమెను చూశారు. ఆ యువకుడు పరుగున వచ్చి—"ఎవరున్నవ్వు?...." అన్నాడు.

ఈశ్వరి గొంతు సవరించుకుని "ఆశ్చర్యంగా ఉందే—యిక్కడ మనుషులున్నారా?" అంది.

"ఎవరున్నవ్వు....?" ఆ యువకుడు తన ప్రశ్నను రెట్టించాడు.

"నేనొక ప్రభుత్వోద్యోగిని...." అంది ఈశ్వరి.

"ఎందుకొచ్చావిక్కడికి?"

"ప్రభుత్వం పనిమీద!" అంది ఈశ్వరి.

యువకుడు కాస్త తడబడి "ప్రభుత్వానికిక్కడ పని ఏముంది?" అని అడిగాడు.

"అది చెప్పకూడదు. రహస్యం. నువ్విక్కడేం చేస్తున్నావు?" అనడిగింది ఈశ్వరి.

"హనీమూన్!" అన్నాడు యువకుడు అదోలా కన్నుగీటి నవ్వి. అప్పుడు ఈశ్వరికి గుర్తుకువచ్చింది తను పురుష వేషంలో ఉన్నానని. ఆమె నవ్వేసింది.

"హనీమూన్‌కు దేశం గొడ్డుపోయిందా, ఇదేం చోటు—" అనడిగింది ఈశ్వరి.

"ఏం చేయను—యిక్కడే నా ఉద్యోగం. సెలవు దొరకదు. అందుకని హనీమూన్ యిక్కడే ఏర్పాటు చేసుకోవాల్సి వచ్చింది—" అన్నాడు యువకుడు.

"నీ పేరు?" అంది ఈశ్వరి.

"వాకర్—" అన్నాడతను.

"క్రిస్టియనువా—" అంది ఈశ్వరి.

"అవును—నీ పేరు?" అన్నాడు వాకర్.

"ఈశ్వర్రావు...." అని నవ్వి—"చెప్పక్కర్లేదు. హిందువును...." అంది ఈశ్వరి.

"అవును.... తెలుస్తూనే ఉంది—యింకా మీసాలైనా సరిగ్గా రాలేదు...."

"మిస్టర్ వాకర్!—ప్లీజ్ హెల్ప్‌మీ!" అంది ఈశ్వరి.

"వాట్ కెనైడూ ఫర్ యూ—"

"ఈ దరిదాపుల్లో యేదో ఆలయముండాలని విన్నాను...."

వాకర్ ఆమెవైపు ఆశ్చర్యంగా చూసి—"యెలా తెలిసింది?" అన్నాడు.

"హిస్టరీ!" అంది ఈశ్వరి. "చరిత్రకు సంబంధించిన అపూర్వ గ్రంథాలు చాలా ఉన్నాయి నా దగ్గర. అందులో వొకదాంట్లో గంగాపురం సమీపంలో ఉన్న ఆలయం గురించి వ్రాయబడింది. అందులో గుర్తుల్నిబట్టి వెతుక్కుంటూ ఇక్కడకు వచ్చాను...."

"అవునా? నీకంటే ముందు నేనా ఆలయాన్ని కనుక్కున్నాను. నీలాంటి వాళ్ళను దాని దరిదాపులకు చేర

కుండా ఉంచేందుకు యిక్కడ తిరుగుతూంటాను...." అన్నాడు వాకర్.

"ఎందుకు? మేము చూడ్డంవల్ల నీకు వచ్చే నష్టమేముంది?" అంది ఈశ్వరి.

"అది చెప్పకూడదు. రహస్యం. ప్రాణాలమీద ఆశ ఉంటే వచ్చిన దారినే వెనక్కి వెళ్ళిపో—"

"వెళ్ళకపోతే?"

"విచారిస్తావ్...." అన్నాడు వాకర్.

ఈశ్వరి అక్కడే చతికిలబడి—"అన్నీ వివరంగా చెప్పకూడదూ—తెలుసుకొని వెళ్ళిపోతాను!" అంది.

"తెలుసుకొని వెళ్ళడానికా—నే నిక్కడున్నది?" అన్నాడు వాకర్.

"నువ్విక్కడెందుకున్నావో నాకేం తెలుస్తుంది?"

"తెలియకూడదనే నా కోరిక...."

"నే నిప్పుడు వెనక్కి వెళ్ళిపోతే నాకే ప్రమాదమూ ఉండదా?"

"ఉండదు...."

"ప్రామిస్!" అంది ఈశ్వరి.

"ప్రామిస్!" అన్నాడు వాకర్.

"నేను వెనక్కి వెళ్ళి యెక్కువమంది బలగంతో వెనక్కి రానని నీకు నమ్మకం ఉందా?"

"ఉంది—"

"నాకు లేదు...." అంది ఈశ్వరి.

వాకర్ ఆమెవంక ఆశ్చర్యంగా చూసి—"అంటే?" అన్నాడు.

"అంటే యేమీ లేదు. ఇంతదూరం వచ్చినందుకు యిక్కడి విశేషాలు తెలుసుకోవాలని నాకూ ఉంటుంది.

ఇంతదూరం రాగలిగినందుకు నా గురించి తెలుసుకోవాలని నీకూ ఉంటుంది. నన్నిక్కణ్ణుంచి సులువుగా వెళ్ళనిస్తావని నేననుకోవడం లేదు. తప్పకుండా యేదో ప్రమాదం తలపెడతావు. అలాంటప్పుడు ఇక్కడే ఉండి మరికాసిని విశేషాలు తెలుసుకొని ప్రమాదంలో యిరుక్కోవడం మంచిది కదూ—" అంది ఈశ్వరి.

"నీ కర్మ! రానున్న ప్రమాదం యెలాంటిదో నీకు తెలియడం లేదు...." అన్నాడు వాకర్.

"నువ్వు క్రీస్తుని నమ్ముతావా?" అంది ఈశ్వరి.

"నమ్ముతాను...." అన్నాడు వాకర్:

"నేనూ క్రీస్తుని నమ్ముతాను. నమ్మినవారి నందర్నీ క్రీస్తు రక్షిస్తాడు. కాదంటావా?"

వాకర్ జవాబివ్వలేక ఊరుకున్నాడు. తర్వాత— "క్రీస్తు నా రూపంలో హెచ్చరిస్తున్నాడు—ఇక్కణ్ణించి వెళ్ళిపో—" అన్నాడు.

"ఎందుకని?"

"ఇక్కణ్ణించి నా హెచ్చరిక విని వెంటనే వెళ్ళిపోయినవాళ్ళకు శిక్ష చాలా సింపుల్‌గా ఉంటుంది. అలా కాకుండా యిక్కడే తిష్ట వేయాలనుకొంటే శిక్ష భయంకరంగా ఉంటుంది—"

"సింపుల్ శిక్ష అంటే!"

"ఒకే ఒక్క క్షణంలో సునాయాసంగా ప్రాణం పోవడం—" అన్నాడు వాకర్.

ఈశ్వరి గుండెలు అదిరాయి—"మరి భయంకరం అంటే?"

"అది వర్ణించడానికి నాకు మాటలు చాలవు. అలాం

టివి చాలా చూశాను. త్వరగా బయటకు వెళ్ళిపో—"
అన్నాడు వాకర్.

"నేను అన్నింటికీ సిద్దపడే వచ్చాను...."

"అయితే....నిన్ను శోధించాలి!...." అన్నాడు వాకర్.

"నువ్వు వద్దు. ఆ అమ్మాయిని శోధించనీ...." అంటూ అక్కడ దూరంగా ఉన్న యువతిని సమీపించి—"మేడమ్—మీ పేరు?" అనడిగింది.

ఆ యువతి యీ చొరవకు ఆశ్చర్యపడి "మోనికా—" అంది.

ఈశ్వరి నవ్వి—"ఇలాంటి పేరెక్కడా వినలేదు...." అంది.

"ఇంగ్లీషు పేరు...." అని నవ్వింది మోనికా.

"ఓహ్—మీరు కూడా క్రిస్టియన్నా—" అంది ఈశ్వరి—"చీర కట్టుకుని బొట్టు పెట్టుకుంటే అచ్చు హిందూ స్త్రీలా గున్నారు మీరు...."

"నేను ముస్లిం యువతిని...." అంటూ నవ్వింది మోనికా. ఈలోగా వాకర్ వీళ్ళిద్దరి వద్దకూ వచ్చాడు.

"మిస్టర్ ఈశ్వర్రావు—నిన్ను శోధించాలి...." అన్నాడు వాకర్.

"అందుకే నేను మోనికా వద్దకు వచ్చాను...."

"మగవాళ్ళను మగవాళ్ళే శోధిస్తారు. ఆడవాళ్ళను మోనికా శోధిస్తుంది...."

"అందుకే మోనికా వద్దకు వచ్చాను...." అంది ఈశ్వరి మళ్ళీ.

వాకర్ తెల్లబోయి ఈశ్వరివంక పరీక్షగా చూశాడు.

ఒక్క_క్షణం అలా చూసి వింతగా నవ్వాడు...."అయితే నీ పేరు?"

"ఈశ్వరి!" అంది ఆమె. అప్పుడే ఆమె మనసులో కొద్దిగా భయం చోటు చేసుకుంది.

మోనికా ఆమెను శోధించి—ట్రాన్స్మిటర్ రివాల్వర్ వగైరాలు తీసి ఇచ్చింది.

"ఏజంటువా?" అన్నాడు వాకర్. ట్రాన్స్మిటర్ చూడగానే అతని ముఖం గంభీరంగా అయిపోయింది.

"కాదు—ఆదర్శ ప్రేమికురాలిని...." అంది ఈశ్వరి అమాయకంగా—"నా ప్రియుడు వొక అపూర్వ నిధిని వెతుక్కుంటూ ఇలా వచ్చాడని తెలిసింది.అతను లేకుండా క్షణం కూడా బ్రతకలేను. అందుకే ప్రమాదమని తెలిసుండీ ఇలా వచ్చాను...."

"కథ మారిందే—ప్రేమికుణ్ణి వెతుక్కుంటూ వచ్చిన దానికీ ట్రాన్స్మిటర్ యెందుకు?"

"అది ట్రాన్స్మిటర్ కాదు. ట్రాన్సిస్టర్...." అంది ఈశ్వరి. "ట్రాన్స్మిటర్ అంటే నాకు తెలియదు....—"

"అలాగా—" అంటూ వాకర్ దాన్ని పరీక్షించాడు. ఎంత పరీక్షించినా అతడికి అది ట్రాన్స్మిటర్ అనుకునేందుకు క్లూ దొరకలేదు. అవి మామూలు స్టేషన్స్ కాచ్ చేస్తోంది. ఎక్కడికైనా వార్తలు పంపడానికి మీట యెక్కడుందో యెంత వెదికినా అతడికి దొరకలేదు. ఈశ్వరి దాని పనితనానికి మనసులోనే శ్రీకృష్ణపరమాత్మను అభినందించింది.

"సరే—అందాకా ఇది నా దగ్గరుంటుంది. ఇంతకీ నీ ప్రియుడెవరు?"

"అతని పేరు గురువులు...." అంది ఈశ్వరి.

"గురువులా?" అని ఉలిక్కిపడ్డాడు వాకర్.

ఈశ్వరి ఆత్రుతగా అతనివంక చూసి—"గురువు ఇక్కడికి వచ్చాడా? నువ్వు చూశావా? ప్లీజ్!.... చెప్పు...." అంది.

"గురువు ఇక్కడికి రాలేదు. అతన్ని నేను చూడలేదు. ఈ విషయంలో నన్నేమీ అడగొద్దు. ఆఖరిసారిగా హెచ్చరిస్తున్నాను. ఇక్కణ్నించి వెళ్ళిపో—అసలే ఆడదానివి. మా బాస్ పెట్టే క్రూరహింసలకు తట్టుకోలేవు...:" అన్నాడు వాకర్.

"నేను గురువుల్ని చూడాలి!"

"అదే పట్టుదల నీకుంటే నువ్వు చూడగలిగేది గురువుల్ని కాదు—దేవుణ్ని!"

ఈశ్వరి మాట్లాడలేదు. ఆమె కన్నుల్లోంచి బొటబొట కన్నీళ్ళు కారాయి. గురువులికేదో ప్రమాదం వాటిల్లిందని ఆమెకు అనుమానం వచ్చింది.

"ప్లీజ్—నేనేమైపోయినా ఫర్వాలేదు. గురువులి గురించి నీకు తెలిసింది చెప్పు...." అంది ఈశ్వరి. ఆమె కంఠంలోని తడి ఎటువంటివాడినైనా కదిలించేలా వుంది. వాకర్ కికూడా ఆమె ప్రేమమీద నమ్మకం కలిగినట్లుంది.

అతను అడ్డంగా తల ఊపి—"నేను నీకు చెప్పగలిగిందేమీ లేదు. గురువుల్ని నువ్వు చూడగలగడం అసాధ్యమని మాత్రం చెబుతున్నాను. ఈ ప్రాంతానికి వచ్చి ప్రమాదంలో తలదూర్చావు. నీకు చావు తప్పదు. అటువంటప్పుడు సునాయాస మరణంకోసం ఇక్కణ్నించి వెళ్ళిపో—లేదా చావు ఎంత క్రూరంగా, భయంకరంగా,

అవమానకరంగా వుంటుందో ఈ రాత్రి చూస్తావు....”
అన్నాడు వాకర్.

“అయితే గురువులి గురించి చెప్పవా?” అంది ఈశ్వరి.

“మిస్ ఈశ్వరీ!” అన్నాడు వాకర్ జాలిగా ఆమె వంక చూస్తూ—“ఇక్కడున్నది హృదయంలేని మనుషులు. మాకిక్కడ చాలా ఆధునిక సౌకర్యాలున్నాయి. గంగాపుర గ్రామంనుంచి ఇక్కడివరకూ జరిగేదంతా మేము అనుక్షణం టెలివిజన్లో గమనిస్తూనే వుంటాము. టెలివిజన్లో నీ రాక చూశాము. నువ్వు ఆడపిల్లవు. ఇక్కడి ఘోరావమానం నువ్వు భరిస్తానన్నా నేను భరించలేను. నిన్ను మించిన వాళ్ళిక్కడ మసైపోయారు.”

ఈశ్వరి అతడి మాట వినలేదు. ఆమె చుట్టూ పరిశీలిస్తోంది. మూరాన వున్న ఆలయం ఆమెను ఆకర్షించింది. చటుక్కున అటు పరుగిడబోయింది. వాకర్ ఒక్క ఊదుటున వెళ్ళి ఆమెను ఆపి—“నిన్నింక దేవుడుకూడా కాపాడలేడు....” అన్నాడు.

అతను ఈశ్వరి చేతులు వెనక్కి విరిచి కట్టాడు. దగ్గర్లో వున్న తిన్నెమీద ఆమెను కూర్చోబెట్టి కాళ్ళుకూడా దగ్గరగా కట్టేశాడు. ఆతర్వాత తన బాస్ గురించి చెప్పి ఆమెను భయపెట్టసాగాడు.

“చూడు—ఇవన్నీ నాకనవసరం. ప్రస్తుతానికి మీరు మనుషు లెందర్లో లేరని నా అనుమానం. లేకపోతే యింతగా నన్ను ప్రాధేయపడవు....” అంది ఈశ్వరి.

“ఇక్కడి వ్యవహారాలు చూసుకుంటుకు మేమిద్దరం చాలు. ఒక గదిలో కూర్చోని మీటనొక్కి యీ చుట్టుపక్కల జరిగే చాలా వ్యవహారాలను అదుపులో ఉంచగలం. అనుకున్న మనిషిని చంపగలం. కానీ నేను నా

చేతుల్తో హత్యలు చేయలేను. అందుకే మనుషుల్ని హెచ్చరించి యిక్కణ్నించి పొమ్మంటాను. కంట్రోల్ రూములోంచి మాటలు నొక్కి వాళ్ళను తుదముట్టిస్తాను. ఈ ఆలయపు ఆవరణపై కంట్రోల్ రూం ప్రభావం లేదు. అందుకే బయటకు పొమ్మని హెచ్చరించేది! మా బాస్‌ది జంతు ప్రవృత్తి. మనుషుల్ని భయంకరంగా హింసించి ఆనందించడం ఆయనకు సరదా. ఆయన సరదా తీరడం కోసం ఈ ఆవరణలోకి వచ్చిన మనుషుల్ని ఆయన కప్పగించడం నా బాధ్యత. ఆయన రాత్రి తొమ్మిది దాటేక ఏదో సమయంలో వస్తాడు....." అన్నాడు వాకర్.

* * *

"బాగుంది పిల్ల!" అన్నాడతను.

ఈశ్వరి అటు తిరిగి చూసింది. మనిషి తెల్లగానే వున్నాడు కానీ భయంకరంగా వున్నాడు. ముఖంనిండా స్ఫోటకపు మచ్చలు. ఉబికిన కళ్ళు.

"ఆయనే మా బాస్!" అన్నాడు వాకర్.

ఈశ్వరి చుట్టూ చూసింది. పాతికమంది సాయుధులైన పురుషులు తమచుట్టూ వున్నారు. బాస్ ఆమెను సమీపించి—"నీ అందానికి ఈ పురుష వేషం తగదు. చీర తెప్పిస్తానుండు....." అన్నాడు.

"అక్కర్లేదు....." అంది ఈశ్వరి.

"ఆ విషయం నువ్వు కాదు చెప్పాల్సింది. ఇలాచూడు." అన్నాడు బాస్. అతని చేతిలో మెరుస్తున్న నల్లనికొరడా ఆమెకు కనపడింది.

"నేను చెప్పినట్లు వింటే దీనికి పని వుండదు....." అన్నాడు బాస్.

అంతలో ఒకతను చీర తీసుకువచ్చాడు. చీరకు మ్యాచ్ అయే పరికిణీ, జాకెట్, బ్రా కూడా వచ్చాయి.

"బట్టలు మార్చుకో!" అన్నాడు బాస్.

"ఇక్కడా?" అంది ఈశ్వరి కుంచించుకుపోతూ.

"అవును. ఇక్కడే!" అన్నాడు బాస్ కొరడా ఝుళిపిస్తూ.

ఈశ్వరి బాస్ కొరడాకు పని తగలనివ్వకూడదనుకుంది. ముందు పరికిణీ వేసుకుని పాంటు జారవిడిచింది. ఆపైన చీర చుట్టబెట్టుకుని వొళ్ళంతా కప్పుకుంది. అప్పుడు బ్రా, జాకెట్ జాగ్రత్తగా మార్చుకుంది. చుట్టూ ఎంతో ఆత్రుతగా చూస్తున్న పురుష సమూహానికి నిరుత్సాహం కలిగింది.

"గడుసుదానివే!" అన్నాడు బాస్—"అయితే ఇది ఫస్టు రౌండ్ మాత్రమే. ఇంకా చాలా రౌండ్లున్నాయి. చీరలో నీ అందం ఇనుమడించింది...."

ఈశ్వరి పైకి ధైర్యంగానే కనబడుతున్నా మనసులో భయపడుతూనే వుంది.

బాస్ ఒకతన్ని పిలిచాడు. అప్పటి కప్పుడు అక్కడ ఒకే కేంద్రంగాగల అయిదు వృత్తాలు గీయబడ్డాయి. వృత్తానికీ వృత్తానికీ మధ్య ఒక మనిషి నిలబడేటంత చోటుంది. కేంద్రానికి దగ్గర్లో ఒక మనిషీ, మిగతా వృత్తాల మధ్య గల కాళీలలో ఒకొక్కరు చొప్పున నలుగురూ మొత్తం అయిదుగురు మనుషులు కొరడాలు చేత్తో పట్టుకుని నిలబడ్డారు. ఈశ్వరిని సరిగ్గా కేంద్రంవద్ద నిలబెట్టారు.

అప్పుడు వృత్తాకారం పైన సన్నని ధారలో కిరసనాయిలు పోశారు. అగ్గిపుల్లతో వెలిగించగా—మండుతున్న అయిదు వృత్తాలు-కేంద్రంలో ఈశ్వరి.... వున్నారు.

"నువ్విప్పుడు కేంద్రంలో బయల్దేరి అన్ని వృత్త మధ్య భాగాలనూ తాకుతూ బయటకు వెళ్ళాలి. ఏ వృత్త మధ్య భాగంలో నైనా అయిదంకెలకు పట్టే కాలం మించి ఉంటే కొరడా నీ వీపుమీద నాట్యం చేస్తుంది. చీర అంటుకుని మండినా నీ ప్రయాణం ఆగకూడదు. నాకు దయాదాక్షిణ్యాలు లేవు. వృత్త మధ్యభాగాలు దాటే వరకూ రూల్సు పాటించకపోతే నీ వంటిమీద కొరడా దెబ్బలు పడుతూనే వుంటాయి...." అన్నాడు బాస్.

ఈశ్వరి భయంగా చూసింది. కట్టుకున్నది సింథటిక్ చీరె. ఏమాత్రం మంట సోకినా అంటుకుంటుంది. తను ఒక్క వృత్తవలయ మధ్యభాగాన్నికూడా వదలకుండా బయటపడాలి. ఈలోగా తన శరీరం కాలిపోయినా సరే! బాస్ దుర్మార్గత్వం ఆమెకు అర్థమయింది. అతను తన్ను చీర కట్టుకోమనడంలోని అంతర్యమిదే!

కేంద్రానికి దగ్గరోని మనిషి అంకెలు లెక్కపెడు తున్నాడు. ఒకటి, రెండు, మూడు, నాలుగు....అయిదు. అతని కొరడా గాలిలోకి లేచింది, అదే వేగంతో ఈశ్వరి కూడా గాలిలోకి లేచింది.

సరిగ్గా ఇప్పుడామె మొదటి వృత్తానికీ రెండో వృత్తానికీ మధ్య వాలింది. ఆమె చీర ఇంకా అంటుకోలేదు. ఆమె కొద్దిగా ఆయాసపడుతోంది. అందరూ చప్పట్లు కొట్టారు.

రెండోమనిషి అంకెలు మొదలుపెట్టాడు....ఒకటి.... రెండు....

ఈశ్వరి గాలిలోకి లేచింది. రెండో వృత్తానికీ మూడో వృత్తానికీ మధ్య వాలింది. అయితే యీ పర్యాయం ఆమె

ఆగలేదు. అదే ఊపులో గెంతుకుంటూ అన్ని వృత్తాల నుంచీ బయటపడింది. చివరి వృత్తంనుంచి బయటపడగానే ఒక పెద్ద గండంనుంచి బయటపడ్డట్టు ఆమె సంతోషించింది. శ్రీకృష్ణపరమాత్మ ముందుచూపుతో తనకు ఇప్పించిన శిక్షణ సమయానికి తనకు బాగా వినియోగపడింది.

బాస్ అప్రయత్నంగా చప్పట్లు చరిచి - "ఈ గేమ్‌లో ఈ విధంగా నువ్వు బయటపడతావని నేననుకోలేదు. చాలా ఆశ్చర్యంగా వుంది! ఎవరున్నువ్వు?" అన్నాడు.

"ఒక ప్రేమికురాలిని. అపూర్వ నిధికోసం బయల్దేరి కనిపించకుండా పోయిన నా ప్రియుణ్ణి వెతుక్కుంటూ ఇలా వచ్చాను...." అంది ఈశ్వరి.

"బాస్! తన ప్రియుడి పేరు గురువులు అని ఆమె అంటోంది" అన్నాడు వాకర్.

"ఐసీ-" అన్నాడు బాస్.... "గురువులు సామర్థ్యం గురించి గంగాపురంలో విన్నాను. కానీ అతడి గురించి నాకు తెలిసేసరికి అతడు మృత్యులోయకు బలైపోయాడు."

"గురువులు చనిపోయాడా?" అంది ఈశ్వరి కంగారుగా.

"అపూర్వ నిధికోసం ప్రయత్నించిన అనేక మందికి పట్టిన గతే గురువులుకు పట్టింది. నువ్వు అందమైన ఆడపిల్లవి. నిన్ను క్రూరంగా హింసించడం నా కిష్టంలేదు. మా కిక్కడ ఆడపిల్లల కొరత చాలా ఎక్కువగా వుంది. మామాట వింటే ఆ లోటు తీర్చేనదాని వౌతావు——" అన్నాడు బాస్.

ఈశ్వరి మాట్లాడలేదు.

"ఒకసారి ఇక్కడకు వచ్చినవాళ్ళు ప్రాణాలతో బయటకు పోలేరు. నీకు ప్రాణాలమీద ఆశవుంటే నేను చెప్పినట్లు విను...." అన్నాడు బాస్.

ఈశ్వరి మాట్లాడలేదు.

"ఇక్కడున్న అందరికీ బాస్‌ను నేను. అందుకని మొదటి ఛాన్స్ నాది" అంటూ బాస్ వచ్చి ఆమె చేయి పట్టుకున్నాడు. ఈశ్వరి మృదువుగా ఆ చేయి విడిపించుకుంది.

"నేను నీ మాట వింటాను. కానీ ఒక చిన్న కోరిక. నేను గురువుల్ని గాఢంగా ప్రేమించాను. గురువులు చని పోయాక నాకీ శరీరంమీద మోజులేదు. ఇది మీ అందరికీ సంతోషాన్ని స్తుందనుకుంటే అందుకే వినియోగిస్తాను. అయితే నా చిన్న కోరిక తీర్చినప్పుడే నేను నీ మాట వింటాను. నా కోరిక తీరని పక్షంలో నువ్వెన్ని కఠిన శిక్షలు విధించినా భరిస్తాను కానీ నీ మాట వినను...." అంది ఈశ్వరి.

"ఏమిటి నీ కోరిక?" అన్నాడు బాస్.

ఈశ్వరి తల ఎత్తి బాస్ కళ్ళలోకి చూసి—"ఒక్క సారి గురువులు శవాన్ని చూడాలి!" అంది. ఆ మాట పూర్తి చేసేక ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఓస్ ఇంతేనా!" అని నవ్వాడు బాస్ — "రేపు రాత్రికల్లా గురువులి శవం ఇక్కడికొస్తుంది. ఈ రాత్రికే నువ్వు నన్ను కరుణించాలి. ఇంతవరకూ నిన్ను నా సరదాలతో రెండు రౌండ్స్ ఆడించాను. ఈ రాత్రి మూడో రౌండ్!"

"అలా కుదరదు. గురువులు శవాన్ని కళ్ళారా చూశాకనే నేను నువ్వు చెప్పిన మాట వింటాను. అంతవరకూ

నా వంటిమీద చేయివేసినా సహించను...." అంది ఈశ్వరి.

ఏ మూడ్‌లో వున్నాడో బాస్ ఆమె కోరికను మన్నించాడు. తన అనుచరుణ్నొకణ్ని పిలిచి చెవిలో ఏదో చెప్పాడు. ఆ తర్వాత వాకర్‌తో—"ఈమెను మన స్పెషల్ రూమ్‌లో వుంచు!" అన్నాడు.

వాకర్ ముందుకు వచ్చి—"పద!" అన్నాడు.

ఈశ్వరి, వాకర్‌ను అనుసరించింది. వాకర్ ఆమెను ఆలయంవరకూ తీసుకువెళ్ళాడు. ఆలయంలోనికి వెళ్ళాలని కోరిక కలిగినా బలవంతంమీద నిగ్రహించుకుంది ఈశ్వరి.

ఆలయం దాటివెళ్ళేక చిన్న తోట వచ్చింది. ఆ తోట దాటేక ఒక ఎత్తైన గోడ వుంది. అది జైలు గోడలా వుంది. ఆ గోడకో చిన్న ప్రవేశద్వారం వుంది. అక్కడొక కాపలావాడున్నాడు. వాడు వాకర్‌కు సెల్యూట్ చేశాడు. వాకర్, అతని వెనుకనే ఈశ్వరి లోపల ప్రవేశించారు. లోపల చాలా ఇళ్ళున్నాయి.

వాకరు ఒక ఇంటిముందు ఆగాడు. ఈశ్వరివంక చూసి "ఇదే స్పెషల్ రూం!" అన్నాడు.

"గదిలో అన్ని సౌకర్యాలూ వున్నాయి. చూస్తే నీకే తెలుస్తాయి. నేను వచ్చేవరకూ బయటకు రావాల్సిన అవసరముండదు...." అన్నాడు వాకర్.

అతను చెప్పింది నిజమే. బంగళా అంతా ఎయిర్ కండిషన్ చేయబడింది. ఇంట్లో లేని సదుపాయం లేదు. వండుకుందుకు వంటసామగ్రి, పదార్థాలు, చదువుకుందుకు పుస్తకాలు, వినడానికి సంగీత సాధనాలూ ఒకటేమిటి... అన్నీ వున్నాయి.

"చాలా థాంక్స్—...." అంది ఈశ్వరి. నిజం చెప్పాలంటే ఆమెకు చాలా అలసటగా వుంది. నిద్ర ముంచుకు వస్తోందామెకు.

"నీ అంత అదృష్టవంతురాల్ని నేనెక్కడా చూడ లేదు. మా బాస్ ఇచ్చిన శిక్షను తప్పించుకోవడమే కాక, ఆయన అనుగ్రహాన్ని కూడా సంపాదించుకున్నావు...." అన్నాడు వాకర్.

"ఆడవాళ్ళ అదృష్టానికీ మగవాళ్ళ అదృష్టానికీ తేడా వుంటుంది. చూస్తూ చూస్తూ ఆడపిల్లను కష్టపెట్టలేడు మగాడన్నవాడెవ్వడూ!" అంది ఈశ్వరి.

"అది నిజమే కావచ్చు. కానీ క్రీస్తు నిన్ను కాపాడాడు. క్రీస్తుపట్ల నీకున్న నమ్మకం నిన్ను రక్షించింది. నీ కథను మా మతప్రచారాని కుపయోగించుకోవచ్చు. అయినా ఇంత నమ్మకమున్న దానివి మా మతంలో ఎందుకు చేరిపోకూడదసూ?" అన్నాడు వాకర్.

"మతం మార్చుకుంటేనేగానీ మనుషుల్ని రక్షించని సంకుచితత్వం ఏ దేవుడికీ వుంటుందని నేననుకోవడంలేదు. నా మతంలో ఉండే నేను క్రీస్తుని విశ్వసిస్తాను.." అంది ఈశ్వరి.

వాకర్ ఏమీ మాట్లాడలేదు. అతను ఇంట్లోంచి బయటకు వెడుతూ—"అన్నట్లు చెప్పడం మరిచిపోయాను. ఈ ఇంటినుంచి బయటకు వెళ్ళడానికిదొక్కటే దారి! నేను తిరిగి వచ్చేవరకూ ఇది తెరుచుకోదు...." అని చటుక్కున తలుపుమూసి బయటనుంచి తాళం వేసి వెళ్ళిపోయాడు.

* * *

గురువులు ఊహించని సంఘటన అది. ఒక్క క్షణం పాటు అతడి బుర్ర పనిచెయలేదు. బుర్ర పనిచేసి అటు

తిరిగి చూసేసరికి పెద్దపులి అతడివంక గుర్రుగా చూస్తోంది.

గురువులుకూడా దానివైపు తీవ్రంగా చూశాడు.

ఇద్దరూ ఒకరివైపొకరు తీవ్రంగా చూసుకున్నారు. గురువులువద్ద చిన్న ఆయుధంకూడా లేదు.

పెద్దపులి ఆకారంలో పెద్దదిగా వుంది. బాగా బలిసి వుంది. మంచి ఆకలిమీద వున్నట్లుంది. గురువులు అలాగే దాని కళ్ళలోకి తీవ్రంగా చూస్తున్నాడు.

ఎంత క్రూర జంతువైనా తన యెదురుగా నిలబడి తన కళ్ళలోకి చూసేవాడిని చటుక్కున ఎదుర్కోదు. వీలుంటే వెనకడుగువేసి పారిపోవడానికి ప్రయత్నిస్తుంది. అయితే అటువంటి ఆశ ఇప్పుడు గురువులుకు లేదు. తనకుగానీ పులికిగానీ పారిపోయే అవకాశం లేదు. ఆ మృత్యులోయలో ఎవరో ఒకరు అంతం కావలసిందే!

గురువులు చేతుల్ని తొడలకు రాసి పదును పెట్టాడు. అతను ఎడమచేతిని గాలిలోకి లేపి కుడిచేతిని కొంచెం క్రిందుగా అడ్డంగా పెట్టి పులికేసి చూస్తూ ఒక్క అడుగు వెనక్కువేశాడు.

రామం అరుపు అతనికి వినబడుతోంది—"గురువులూ! దాన్నటు తప్పించి నువ్విటు వచ్చేయి. బోను తలుపులు తీస్తాను. ఇద్దరికి రక్షణ ఏర్పడుతుంది."

సమాధానంగా గురువులుకూడా అరిచాడు—"పొరపాటునకూడా బోను తలుపులు తియ్యకు. పులి జిత్తుల మారి. మనమిద్దరం మసి అయిపోగలం."

గురువులు వెనకడుగు వేయగానే పులి అదాటకంగా బుస్సుమంది. కదులుతున్నట్టే కదిలి వాయువేగంతో గురువులు మీదకు ఉరికింది.

గురువులు లాఘవంగా పక్కకు తప్పుకుని పులి నడ్డిమీద కోసినట్లుగా ఎడమచేత్తో దెబ్బవేశాడు.

ఆ దెబ్బకు పులి మొదలునరికిన మ్రానులా నేలకూలింది. గాండ్రుమంటూ దిశలు మార్మోగేలా అరిచింది. ఆ అరుపులో దెబ్బతిన్న పులి కంఠం గురువులు చెవులకు ధ్వనించింది. ఇప్పుడది రెట్టించిన శక్తితో తనమీదకు వస్తుంది. పొరపాటు చేయకుండా జాగ్రత్తపడుతుంది.

గురువులు మళ్ళీ చేతుల్ని తొడలపైన పడుసుపెట్టాడు. పులికోసం సిద్ధంగా వున్నాడు.

పులి వెనక్కు తిరిగి గురువులువంక చూస్తోంది కానీ కదలడంలేదు. అతను ఒక్కక్షణం అజాగ్రత్తను వహిస్తే అప్పుడు మీద కురకాలని చూస్తోంది. గురువులు దాని ఎత్తు గ్రహించాడు. ఇందాకటి దెబ్బకలిగించిన ఆయాసాన్నతనింకా పోగొట్టుకోలేదు. అందుకే దానికి తనమీద దూకే అవకాశమివ్వకుండా అలా తీవ్రంగా దాని కళ్ళలోకే చూస్తున్నాడు.

కాసేపటికి గురువులు ఆయాసం తీరింది. అలా ఎంతసేపో నిలబడడం అసాధ్యమని గ్రహించి, అతను ఒక్కక్షణం ఏమరినట్లు నటించాడు.

పులి శరవేగంతో అతనిమీదకు దూకింది. ఈ పర్యాయం గురువులు కాళ్ళతో పులి డొక్కల్లో బలంగా తన్నాడు. పులి ఆర్తనాదం లాంటిది చేసింది.

గురువులు పక్కకు తప్పుకుని చూశాడు. పులి నేల కూలింది. అది లేచే స్థితిలో వున్నట్లు లేదు. ఉన్నప్పటికీ కనీసం ఎగిరేశక్తి ఉండదు. గురువులు ఉత్సాహంగా గాలిలోకి యెగిరి పులి నడ్డిమీద వాలాడు. పులి చటుక్కున లేచింది.

ఇప్పుడు గురువులుకు పులిని లొంగదీయడం ఎంతో సేపు పట్టలేదు. కీలక స్థానాల్లో చేతి దెబ్బలుకొట్టి పులిని అశక్తురాలిని చేశాడతను. పులి కదలలేని స్థితిలో పడిపోయింది.

గురువులు బోను తలుపు తట్టి—"రామం! నువ్వింక బయటకు రావచ్చు!" అన్నాడు.

గురువులు కంఠం వినబడుతుందని రామం ఆశించలేదు. అతను ఉత్సాహంగా బయటకు వచ్చి - "నన్ను క్షమించు గురువులూ—నేను స్వార్థంతో నా ప్రాణం కాపాడుకుని నిన్ను పులికి వదిలిపెట్టాను...." అన్నాడు.

"చాలా మంచిపని చేశావు. లేకపోతే పులి నన్ను వదిలిపెట్టి నీ పని పట్టించేది. నిన్ను నువ్వు రక్షించుకున్నావు కాబట్టి, నన్ను నేను రక్షించుకోగలిగాను" అన్నాడు గురువులు.

రామం భయం భయంగానే పులివంక చూశాడు. అది కదలలేని స్థితిలో ఉండి మూలుగుతోంది. ఆ మూలుగు హృదయ విదారకంగా ఉంది.

"నోరు లేని జంతువు. చంపడానికి మనస్కరించడం లేదు. ఇప్పుడేం చేయాలా అని ఆలోచిస్తున్నాను...." అన్నాడు గురువులు.

రామం ఆశ్చర్యంగా గురువులు వంక చూశాడు. అతడి శరీరంపై చిన్న గాయంకూడా లేదు. మనిషి కొద్దిగా ఆయాసపడుతున్నాడు. అంతే! పెద్దపులిని చంపడానికి మనస్కరించడం లేదని గురువులు అంటే రామానికి ఆశ్చర్యంగానే వుంది. అతని కళ్ళముందు అమానుషంగా చంపబడ్డ గంగాపుర గ్రామ మునసబు మెదిలాడు.

"మనుషుల్ని చంపడానికి వెనుకాడని నువ్వు ఈ

క్రూర జంతువుపైన జాలి చూపడం ఆశ్చర్యంగా ఉంది" అన్నాడు రామం.

"మనిషికి మనిషిని చంపాల్సిన అవసరం లేదు. వాళ్ళకు నోరుంది. బ్రతకడానికి లక్ష మార్గాలున్నాయి. అయినప్పటికీ సాటి మనిషిని వాళ్ళు సాధిస్తారు, వేధిస్తారు. ఉన్న నోటిని, మెదడును ప్రమాదకర కార్యాలకు వినియోగిస్తారు. అందుకే నాకు శత్రువులైన మనుషుల్ని చంపిపారేస్తాను. కానీ క్రూర జంతువుల విషయం అలాకాదు. దానికి నామీద పగ లేదు. నేను దానికి సహజసిద్ధమైన ఆహారం. నన్నది తినాలనుకోవడం దాని తప్పు కాదు...." అన్నాడు గురువులు.

గురువులు వింత మనస్తత్వం రామానికి అర్థం కాలేదు. అతనికి తెలిసిన నైతిక విలువలు వేరు. గురువులుకు తెలిసినవి వేరు.

"అయితే ఇప్పుడేం చేస్తావు?" అన్నాడు రామం.

"నా దెబ్బలనుంచి కోలుకోవడానికీ పులికి రెండు మూడు రోజులు పడుతుంది. ఏ విషయమూ ఆటవికులకు వదిలేద్దాం. మనం ఈ పెట్టెలో విశ్రాంతి తీసుకుందాం" అన్నాడు గురువులు.

"ఈ బోనులో ఆహారపదార్థాలున్నాయి" అన్నాడు రామం.

ఇద్దరూ కడుపునిండా భోంచేశారు. భోజనాలయ్యాక రామం గురువుల్ని — "ఇందులో విషం కలపబడిందేమోనని భయం కలగలేదా?" అన్నాడు.

"ఆటవికులు రెండుమాటల మనుషులు కాదు. లోపల భోజనం ఉన్నదని వారు రాశారు. అంటే అది భోజనమే కానీ విషం కాదన్నమాట. ఎటొచ్చీ పెద్దపులి బారినుండి

మనం బ్రతికి బయటపడగలమని వారు అనుకోలేదు....”
అన్నాడు గురువులు.

మృత్యులోయలో ఆ బోనులో సుమారు ఇంకో రోజు గడిచేక—అది పైకి లేవసాగింది. బోను పైకి లేస్తూంటే పెద్దపులి నిస్సహాయంగా దానివైపే చూస్తోంది.

బోను పైకి రావడానికి ఎంతోసేపు పట్టలేదు. ఆ బోనును నేలమీద ఉంచగానే రామం, గురువులు తలుపు తెరుచుకుని బైటకు వచ్చారు. అక్కడ చేరిన ఆటవిక నాయకుడు, పదిమంది ఆటవికులు, రామం, గురువుల్ని ఆనందపరచిన ఇద్దరు ఆటవిక యువతులు ఆ దృశ్యంచూసి అమితంగా ఆశ్చర్యపడ్డారు.

ఆటవిక నాయకుడు ఒళ్ళు గిల్లి చూసుకుని “ఇది కలా, నిజమా?” అన్నాడు.

“మీ పెద్దపులిగూడా క్షేమంగానే ఉంది. నోరులేని జంతువును చంపడానికి మనసొప్పక అలా వదిలేశాను. అది కదలలేని స్థితిలో మృత్యులోయలో పడి ఉంది. మీరు వెళ్ళి దాన్ని రక్షించుకోవచ్చు....” అన్నాడు గురువులు.

“నువ్వు మనిషివా, దేవుడివా?”అన్నాడు నాయకుడు ఆశ్చర్యంగా.

“మనిషినే. అపూర్వనిధికి దారి చూపమని మిమ్మల్ని వేడుకునే అతి సామాన్యుణ్ని నేను....” అన్నాడు గురువులు.

“మా గూడానికే యిది అపూర్వ సంఘటన. ఇలా మృత్యులోయనుంచి బయటకు వచ్చిన మనిషి లేడు. ఇలా రాగలడని నే నూహించనైనా ఊహించలేదు. నువ్వు దేవుడివేనో కాదో నాకు తెలియదు. కానీ మా

దేవత అనుగ్రహం పొందినవాడివన్న మాట నిజం. నీకు సాయపడకపోతే మా దేవత ఆగ్రహిస్తుంది. నీకు అన్ని వివరాలు చెబుతాను. ఈ గోజుకు విశ్రాంతి తీసుకో—" అన్నాడు నాయకుడు.

తర్వాత నాయకుడు పెద్దపులిని రక్షించమని అక్కడున్న ఆటవికుల్లో వొకణ్ని ఆదేశించాడు. వాడు దాన్ని మచ్చిక చేసినవాడు. తన పులి యే స్థితిలో వుందోనని వాడు చాలా ఆతురతగా వున్నాడు.

వాడు అప్పటికప్పుడు బోనులో కూరాడు. నలుగురు ఆటవికులు బోనుని మృత్యులోయలోకి జారవిడిచారు. సుమారు ఇరవై నిముషాల్లో ఆటవికుడు పెద్దపులితోసహా పైకి వచ్చాడు.

కదలలేని స్థితిలో వున్న పెద్దపులిని చూసి అంతా ఆశ్చర్యపడ్డారు.

"నా ప్రాణాలకు ప్రాణంగా పెంచుకొంటున్నా నీ పులిని. దీన్ని నీ ప్రాణాలమీదకు ఉసిగొల్పాను. అయినా కోపగించుకోకుండా దీన్ని ప్రాణాలతో వదిలిపెట్టావు. నీ మేలును మరువలేను. నీకేం చేసినా ఋణం తీరదు. నీకు సాయపడడమే నా విధిగా భావిస్తాను...." అన్నాడు ఆ ఆటవికుడు.

ఈ పరిస్థితుల్లో రామానికో విషయం అర్థమయింది. తన తాత మృత్యులోయలోని మణుల దొంగతనాన్ని ఆపి రామార్‌ని రక్షించాడు. గురువులు ఒక క్రూర జంతువును కరుణించి ఆటవికుల మన్ననకు పాత్రుడయ్యాడు.

ఎటువంటి పరిస్థితుల్లోనూ కరుణ, మానవత్వం వదిలిపెట్టనివాడికి తలపెట్టిన అన్ని కార్యాలూ జయమవు

తాయా? గురువులు విజయంలోని రహస్యమిదేనా?అయితే గురువులు మానవత్వం గలవాడని అనుకోవాలా? అంత వరకూ అతను చేసిన హత్యలూ, కిరాతకాల సంగతి యేమిటి?

ఆటవిక నాయకుడు అక్కడున్న యువతుల నిద్దర్ని ఉద్దేశించి—"మలయా! మీరిద్దరూ వీళ్ళ ఆలనా,పాలనా చూసుకోండి—కొద్దిరోజులు వీళ్ళిక్కడ విశ్రాంతి తీసుకొంటారు. ఇప్పుడు వీళ్ళు మన అతిథులు కాదు. మిత్రులు. ఈ విషయం గుర్తుంచుకోండి—" అన్నాడు.

* * *

"ఇప్పుడు మనం గుడిసెకు వెళ్ళబోవడంలేదు—" అంది మలయా. అప్పటికి మరో ఆటవిక యువతి రామాన్ని వెంటబెట్టుకుని యెక్కడికో వెళ్ళిపోయింది.

"ఎక్కడికి వెడతాం?" అన్నాడు గురువులు.

"మాకు ప్రత్యేకమైన కొలనులున్నాయి. వాటిలో స్నానం చేద్దాం. ప్రత్యేకమైన తోటలున్నాయి. వాటిలో విహరిద్దాం. ప్రత్యేకమైన గుడిసెలున్నాయి. వాటిలో ఆనందిద్దాం. మనం గడుపబోయేది బందీ జీవితం కాదు. స్వేచ్ఛా విహారం—" అంది మలయ ఉత్సాహంగా.

"ఎందుకని?"

"నువ్వు అతిథివి కాదు. మిత్రుడివి. అదీ తేడా!" అంది మలయ.

"కానీ నాకే సుఖాలమీద మోజులేదు....అపూర్వ నిధి చేరుకొనేవరకూ నేనింకేమీ ఆనందించలేను. నా మనసంతా ఆ నిధి మీదనే ఉంది....—" అన్నాడు గురువులు.

"నువ్వు అపూర్వనిధిని తప్పక చేరుకొంటావు. అది చాలా ప్రమాదకరమైన పని. నీకే ప్రమాదమూ లేకుండా అక్కడికి పంపడంకోసం నాయకుడాలోచిస్తున్నాడను కొంటాను. ఆయనకు వ్యవధి అవసరం. నీకు విశ్రాంతి అవసరం—" అంది మలయ.

గురువులు మాట్లాడకుండా ఆమెను అనుసరించాడు.

కొలనులో స్నానాలూ, వనవిహారాలూ, గుడిసెలో పూలపాన్పుపై అమరసౌఖ్యాలూ అపూర్వంగా తోచా యతనికి. అయితే అతని మెదడులో నిధిని గురించిన ఆలోచనలు తెరలు తెరలుగా వస్తూనే ఉన్నాయి. ఆ విషయం పసిగట్టిన మలయ అప్పుడప్పుడు తను వొంటరిగా నాయకుని వద్దకు వెళ్ళి మాట్లాడి వస్తూం డేది.

రెండురోజులపాటు గురువులక్కడ అమరసౌఖ్యాల్లో మునిగి తేలాడు. మూడవరోజున మలయ నాయకుడినుంచి తిరిగివచ్చినపుడు ఆమె ముఖం విషాదంగా ఉండడా న్నతను గమనించి ఆశ్చర్యంగా—"ఏం జరిగింది....?" అన్నాడు.

"నిన్నింకా దురదృష్టం వదిలిపెట్టినట్లు లేదు—"అంది మలయ.

"యేమయింది — ....?" అన్నాడు గురువులు ఆతృతగా.

"నీ శవం కోసం కబురొచ్చింది...." అంది మలయ.

ఉలిక్కిపడ్డాడు గురువులు—"ఏమిటన్నావ్?"

"నీ శవం కోసం కబురొచ్చింది...." మళ్ళీ అంది మలయ.

"ఎవరికొకావాలి నా శవం....?"

"నిధి దగ్గర్నుంచి కబురొచ్చింది...."

"నిధి అంటే మనిషి పేరా?"

"కాదు. నువ్వు కోరే అపూర్వ నిధి అదే—దాన్ని కొంతమంది బలవంతులు వశపర్చుకొన్నారు. వాళ్ళు మాకు మిత్రులు...."

"వాళ్ళు నాగరుకు లనుకొంటాను.. వాళ్ళకూ మీకూ స్నేహం ఎలా కలిసింది?"

"ఆ నిధి వొక రహస్య స్థలంలో ఉంది. అక్కడికి చేరడానికి రెండే రెండు మార్గాలున్నాయి. గంగ పురం నుంచి బయల్దేరి ఊరిచివరి కొండపక్క కాలిబాట ననుస రిస్తే వచ్చేది దగ్గరి దారి. అలా వెళ్ళినవాళ్లను బ్రతక నివ్వరు వాళ్ళు. రెండవది చుట్టుదారి. మా గూడేనికి వచ్చి యిక్కణ్నించి వెళ్ళాలి. యిక్కణ్నించి ఓ పూట ప్రయాణం ఆ నిధి దగ్గరకు. సొరంగమార్గాన్ని వాళ్ళు నిర్మించారు.

నాగరకత బారినుండి మా జాతిని మేము కాపాడు కుంటూ వస్తున్నాం. నాగరకులు మాపై దాడి చేయ కుండా వాళ్ళు మమ్మల్ని కాపాడుతామున్నారు. నిధికి యెవ్వరూ చేరకుండా మేము సాయపడుతున్నాం. అందుకు ప్రతిగా అప్పుడప్పుడు మృత్యులోయకు సమ ర్పించుకోవడానికి మనుషుల్ని పంపుతూ వుంటారు వాళ్ళు...."

"వాళ్ళకూ మీకూ ఎలా పరిచయమయింది?" అన్నాడు గురువులు.

"అరణ్యంలోనే జరిగినట్లుంది. వాళ్ళు మత్తు పానీ యాలు బహుమతిగా యిచ్చి మా వాళ్లను లొంగదీసు కొన్నారు. మంచి చేసుకొన్నారు—...." అంది మలయ.

ఆటవికులు అమాయకులు కాబట్టి వీళ్లను సులభంగానే వాళ్ళు బుట్టలో వేసేసుకుని ఉంటారని గురువులు అనుకొన్నాడు.

"గంగాపురానికీ మీకూ సంబంధం యెలా వచ్చింది?"

"అదీ యీ నిధిమనుషులవల్లనే? అంతకు పూర్వం గంగాపురం పెద్దలతో మాకేమీ సంబంధం లేదు. ఈ నిధిమనుషులు వచ్చేక వాళ్ళకూ మాకూ కొన్ని ఒప్పందాలు కూడా వచ్చాయి. ఆ నిధిమనుషులు గంగాపురం పెద్దలకు బాగా డబ్బు యిస్తారు. చిత్రమేమిటంటే నిధి మనుషులు తమకు తామై నిధి ప్రాంతాలు దాటి యెక్కడకూ వెళ్ళరు. తమ పనులన్నీ గంగాపురం మనుషుల ద్వారా చేయించుకొంటారు...." అంది మలయ.

ఆ నిధి యెవరి స్వాధీనంలో ఉన్నదో కానీ, వారు చాలా పకడ్బందీగా వ్యవహరిస్తున్నారని గురువులు గ్రహించాడు. అవునుమరి—అంత డబ్బును అక్కణ్నించి తరలించడానికి చాలా పెద్ద ఎత్తున ఏర్పాటు చేసుకోవాలి. జాగ్రత్తగా వ్యవహరించాలి....

"ఇప్పుడేం చేద్దామనుకొంటున్నాడు నాయకుడు?" అన్నాడు గురువులు.

"ఆయనకేమీ పాలుపోవటం లేదు. నిధిమనుషులు చాలా ప్రమాదకరమైనవారు. మా గూడాన్ని వొక్క క్షణంలో నాశనం చేయగల శక్తి వారికుంది. వారి మాట కాదనడానికి లేదు. అలాగని రక్షణ యిచ్చిన మనిషిని చూస్తూ చూస్తూ చంపలేడు....వొకటి జాతి నాశనం, ఇంకొకటి జాతికి అవమానం....ఇదీ నాయకుడి సమస్య!" అంది మలయ.

"ఇందులో పెద్దగా ఆలోచించాల్సినది లేదు. ఏ జాతికైనా మనుగడ ముఖ్యం. అవమానం విషయం తర్వాత ఆలోచించవచ్చును...." అన్నాడు గురువులు.

"అంటే?" అంది మలయ.

"మీ జాతిని కాపాడడంకోసం నేను సిద్ధంగా ఉన్నానని మీ నాయకుడికి చెప్పు!...." అన్నాడు గురువులు.

సరిగ్గా అదే సమయానికి నాయకుడు అక్కడకు వచ్చి, "శభాష్ గురువులూ!" అన్నాడు.

గురువులు ఆశ్చర్యంగా—"మా సంభాషణ మీరు వింటున్నారా?" అన్నాడు.

"అవును. విన్నాను. సమస్య నీకు మలయ వివరించి చెప్పి ఉంటుంది. నీ నిర్ణయం కూడా నాకు నచ్చింది. ఎట్లాచ్చీ మా జాతి అవమానంపాలు కాకుండా ఉండేందుకు కూడా ఉపాయ మాలోచించాను...." అన్నాడు నాయకుడు.

"ఆ ఏలా?" అంది మలయ.

"చాలా సులభం—" అన్నాడు నాయకుడు— "గురువులుకు నిధిదగ్గరకు వెళ్ళాలనిఉంది. ప్రాణాలతో నే వెళ్ళాలని అతను కోరుకోలేదు. నిధిమనుషులకు గురువులు శవం కావాలి. ఇతడి శవాన్నక్కడ పంపడం ద్వారా మన మాట నిలబడుతుంది. మనకు ప్రమాదమూ తప్పుతుంది."

అందులో చమత్కారముండవచ్చు. కానీ అది ఆత్మవంచన అని మలయకు తోచింది. గురువులు దురదృష్టాన్ని తలచుకొంటే ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

* * *

"ఈశ్వరీ! ఇదిగో నువ్వు కోరిన గురువులు శవం" అన్నాడు బాస్.

ఈశ్వరి గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి.

గురువులు శవాన్ని కోరడంలో ఆమె అంతర్యం వేరు. అతనెక్కడో అక్కడ జీవించి ఉంటాడనే ఆమె ఆశ పడింది. ఆ కోరిక తీర్చడం బాస్ వల్ల కాదనే ఆమె అనుకొంది. అయితే ఇప్పుడు నిజంగానే గురువులు శవం వచ్చింది.

ఈశ్వరి యిప్పుడు స్పెషల్ రూంలో ఉంది. అక్కడ బాస్ కాక శవాన్ని మోసుకువచ్చిన ఇద్దరు బాస్ అనుచరులు ఉన్నారు.

శవాన్ని నేలమీద పడుకోబెట్టారు. ఒళ్ళంతా ముసుగు కప్పి ఉంది. ఆఖరి ఆశగా ఆమె గుడ్డను తొలగించింది. అది గురువులు శవం కాకూడదని దేవుణ్ణి ప్రార్థించుకొంటూ శవాన్ని చూసిందామె.

దేవు డామె కోరిక మన్నించ లేదు. అది గురువులు శవమే!

ఈశ్వరి పెద్దగా అరుస్తూ ఆ శవంమీద పడిపోయింది. ఆమె బిగ్గరగా విలపిస్తూంటే—బాస్‌కు కూడా జాలి వేసింది.

"ఈశ్వరీ! చచ్చిపోయినవాడికోసం యేడ్చి యేం ప్రయోజనం? జరిగింది మరిచిపోయి కొత్త జీవితం ప్రారంభించు...." అన్నాడు బాస్.

"మేమిద్దరమూ ప్రేమించుకొన్నాం. కానీ కనీసం వొకరినొకరు తాకనైనా తాకలేదు. ఇంతలో....ఇంతలో యిలా మూడుతుందనుకోలేదు—" అంటూ ఘొల్లుమంది ఈశ్వరి.

"నువ్వు చాలా దుఃఖంలో ఉన్నట్లున్నావ్. నీ ప్రియుణ్ని ఆఖరుసారిగా లనివితీరా చూసుకో. నేను ఓ గంట పోయాక వస్తాను. అప్పటికి నీ మనసు సర్దుకొం టుంది" అన్నాడు బాస్.

ముందుగా బాస్, ఆ తర్వాత యిద్దరు అనుచరులూ బయటకు వెళ్ళిపోయారు. తలుపులు బయటనుంచి తాళం వేయబడ్డాయి.

ఈశ్వరి గురువులు ముఖం తడుముతూ ఏడుస్తోంది. హఠాత్తుగా ఆమె ఏడుపు ఆగిపోయింది. ఆమె కళ్ళలో ఆశ్చర్యం, భయం ఒక్కసారిగా కనబడ్డాయి.

గురువులు కదులుతున్నాడు.

ఈశ్వరి కళ్ళు నులుముకొంది. గురువులు పూర్తిగా కదిలి చటుక్కున లేచి కూర్చున్నాడు.

ఈశ్వరి భయంతో అరవబోయింది కానీ చటుక్కున గురువులు ఆమె నోరు మూశాడు.

"నువ్విక్కడకెలా వచ్చావు ఈశ్వరీ?" అన్నాడు గురువులు ఆశ్చర్యంగా.

"అయితే నువ్వు చచ్చిపోలేదా?" అంది ఈశ్వరి తడబడుతూ.

"లేదు. కాసేపు ఊపిరి బిగబట్టాను...." అన్నాడు గురువులు.

ఇద్దరూ వొకరి అనుభవాలొకరికి చెప్పుకొన్నాక ఈశ్వరితో గురువులు అన్నాడు—"ఆటవికులు తనను మోసగిస్తారని బాస్ అనుకోవడంలేదు. అందుకే శవాకారంలో వచ్చిన నన్ను నిజమైన శవంగా నమ్మారు...."

"అయితే ఇప్పుడేం చేయాలి? ఇది చాలా ప్రమాదకరమైన చోటు...." అంది ఈశ్వరి.

"ఇంతవరకూ అన్నీ ప్రమాదాలే వచ్చాయి. ఎలాగో ఒన్ని తప్పించుకున్నాను. సువ్విక్కడుండడంతో నాకు కొండంత బలం వచ్చినట్లుంది. దేవుడు మన పక్షాన ఉన్నాడనే భావిస్తున్నాను...." అన్నాడు గురువులు.

"6 గంటల్లో మళ్ళీ బాస్ యిక్కడికి వస్తాడు. 'ఏం చేయాలో చెప్పు...." ఈశ్వరికి విపరీతమైన సంతోషంతో పాటు ఆత్రుత, భయం కూడా ఎక్కువగా కలుగుతున్నాయి.

"ఇక్కడి విశేషాలు త్వర త్వరగా చెప్పు...." అన్నాడు గురువులు.

"ఆలయంలోకి వెళ్ళే అవకాశం నాకింకా కలగలేదు. బాస్ రాత్రిళ్ళు మాత్రమే కనబడతాడు. పగలు యిక్కడ కేవలం వొక యువకుడు, యువతి మాత్రం బైట ఉంటారనుకొంటున్నాను. మిగతావాళ్ళంతా ఎక్కడుంటారో ఏం చేస్తుంటారో తెలియదు. నేను తెలుసుకోవలసింది చాలా ఉంది. నీ విషయం రహస్యంగా యెలా ఉంచాలో నాకు తెలియడంలేదు...." అంది ఈశ్వరి.

"ఈశ్వరీ—నువ్వు నాకు వరప్రదాయనివి. ఏదో ప్లాన్ వేసి రప్పించినట్లు నన్నిక్కడికి రప్పించావు. ఈ అవకాశాన్ని మనం బాగా ఉపయోగించుకోవాలి...." అన్నాడు గురువులు.

"బాస్ రాగానే యేం చేస్తావ్?"

"తిరిగి శవంగా మారతాను!........" అన్నాడు గురువులు.

"అప్పుడు నిన్ను బాస్ దహనం చేయిస్తాడు...."అంది ఈశ్వరి.

"అయితే ఏం చేయాలంటావ్?"

"శవాన్ని నా వద్ద నే ఉంచుకుంటానంటాను...." అంది ఈశ్వరి.

"అలా ఎన్నాళ్ళు? శవం వాసన రాకపోతే బాస్‌కు అనుమానం రాదూ!"

"అయితే ఏం చేయాలంటావ్?"

గురువులు, ఈశ్వరికూడా ఆలోచనలో పడ్డారు. ఇద్దరికీ ఏం చేయాలో తోచలేదు.

"ప్రస్తుతానికి నాకో పని చేయాలనిపిస్తోంది...." అంది ఈశ్వరి కాసేపాగి.

"ఏమిటది?"

ఈశ్వరి చటుక్కున అతన్ని కౌగలించుకుని ముద్దు పెట్టుకుంది.

గురువులామెను మృదువుగా విడిపించుకుని చిరునవ్వు నవ్వి—"ఏమిటీ ఆవేశం? అందుకు సమయం ముందుంది" అన్నాడు.

"నాకు మళ్ళీ భయం వేస్తోంది...." అంది ఈశ్వరి.

"ఏం?"

"రేపట్నించీ నేను బాస్‌తో గడపాలి!" అంది ఈశ్వరి.

"కార్యసాధనకోసం ఏం చేసినా తప్పులేదు. నేను అరణ్యంలో మలయను మనస్ఫూర్తిగా అనుభవించాను" అన్నాడు గురువులు.

"నువ్వు మగాడివి. నీ బుద్ధులు వేరు!"

"మలయ ఆడదే మరి! ఆమె కూడా...."

"అది ఆటవికురాలు...."

"మనం వానికంటె ఎక్కువవాళ్ళ మనుకోవడం మన తక్కువతనాన్ని తెలియజేస్తుంది" అన్నాడు గురువులు.

"ఏం మగాడివి నువ్వు? ఆడదాని అవినీతిని సమర్థిస్తావ్!"

గురువులు నవ్వి — "నీతి, అవినీతి అంటూ మడికట్టుకూర్చున్నచోటు కాదిది. కత్తిమీద సాము ఇక్కడి జీవితం. అవతలివాడి కనుమానం వచ్చిందా మన ప్రాణాలు పోతాయి. నువ్వేం చేస్తున్నావన్నది ఇక్కడ ముఖ్యం కాదు. ఏం సాధించావన్నదే ముఖ్యం! బాస్ తిరిగిరాగానే నేను శవంగా మారతాను. నువ్వతనితో వెళ్ళిపో — ఈ వేళ్టికి నన్నిక్కడ ఉండనీ!" అన్నాడు.

"అలాగే చేస్తాను...." అంది ఈశ్వరి.

సరిగ్గా గంటకు తిరిగివచ్చాడు బాస్. అప్పటికి ఈశ్వరి దుఃఖం తగ్గడం చూసి అతడికి కాస్త తృప్తి కలిగింది.

"పోయినవాళ్ళతో మనమూ పోలేముగదా — నువ్వు అన్నమాట నిలుపుకున్నావు. నేనూ అన్నమాట నిలుపుకుని నీతో వస్తున్నాను. కానీ ఈ శవాన్ని ఇప్పుడే ఏమీ చేయవద్దు. నా తనివితీరా గురువులు శవాన్నైనా ఒకటి రెండు రోజులు చూసుకోనీ" అంది ఈశ్వరి.

"రెండుమూడు రోజుల్లో శవం కుళ్ళి వాసనవేస్తుంది. నీ గురువులుకలా జరిగితే బాగుంటుందా?" అన్నాడు బాస్.

"పరిస్థితి నంతవరకూ రానివ్వను...." అంది ఈశ్వరి.

"సరే-మనం పోదామా!" అన్నాడు బాస్.

"ఊఁ" అంది ఈశ్వరి. ఈ రాత్రి తను ఇక్కడికి సంబంధించిన విశేషాలు చాలా తెలుసుకోవాలి. అందుకోసం ఏమైనా చేయాలి....

బాస్, ఈశ్వరి కలిసి అక్కణ్నించి బైటకు వచ్చారు

బాస్ గదితలుపులు తాళం వేశాడు. ఈశ్వరి టైము చూసు కుంది. ఇప్పుడు రాత్రి పదకొండు గంటలయింది.

ఇద్దరూ ఆ ఆవరణలోంచి బైటకు వచ్చారు. అక్క డ్నించి కొంతదూరం నడిచేక ఆలయం వచ్చింది. ఆల యాన్ని చూస్తూనే—"ఈ ఆలయం చూడాలని ఉంది నాకు" అంది ఈశ్వరి.

బాస్ నవ్వి — "ఇక్కడున్న రహస్యమంతా ఈ ఆలయంలోనే ఉంది. ఇక్కణ్ణించి బైటపడలేనివారు మాత్రమే దీన్ని చూడవచ్చు...." అన్నాడు.

"ఏముంది ఈ ఆలయంలో...." అంది ఈశ్వరి.

"పద-చూద్దాం!" అన్నాడు బాస్.

ఇద్దరూ ఆలయంలో ప్రవేశించారు. ఒక్కసారిగా ఈశ్వరి కళ్ళు చెదిరిపోయాయి. ఎక్కడ చూసినా బంగారం....గోడలకు, విగ్రహాలకు,....ఒకచోట ఏమిటి ....అది ఒక బంగారు ఆలయంగా కనబడుతోంది....

"ఏనాటిదో ఈ ఆలయం?" అంది ఈశ్వరి.

"ఆలయం పాతదే కానీ బంగారం కొత్తది...." అన్నాడు బాస్ నవ్వుతూ.

"అంటే?" అంది ఈశ్వరి ఆశ్చర్యంగా.

"అది బంగారమనుకుని దొంగిలించే ప్రయత్నాలు చేయకు. ఇక్కడున్నదంతా బంగారం పూత పూసిన ఇత్తడి...." అన్నాడు బాస్.

ఈశ్వరికి అర్థంకాలేదు....

"ఇక్కడికి రావడానికి మేము మరీ ఎక్కువ అడ్డం కులు పెట్టలేదు. మావిూద యెవ్వరికీ అనుమానం కలగ కూడదని మా ఉద్దేశం. ఎప్పుడేనా పొరబాటున యిక్క

డికి ఎవరైనా రావడం జరిగితే మొదటి చూపులో వారు గ్రహించగలిగేది అపూర్వనిధి అని మాత్రమే! అందుకే మేము ఈ ప్రాంతానికి అపూర్వనిధి అన్న సంకేతపదాన్ని పెట్టాము. గంగాపురం పెద్దలుకూడా ఇక్కడ అపూర్వనిధి ఉన్నదనే భావిస్తున్నారు. కానీ నిజానికిక్కడ ఉన్నది వేరు....చూస్తావా?" అన్నాడు బాస్. ఈశ్వరి తల ఊపింది.

ఇద్దరూ ఆలయం లోపలకు వెళ్ళారు. గర్భగుడిలో విగ్రహానికి వెనుకగా ఒక చిన్న సొరంగ మార్గముంది. అక్కడ క్రిందకు దిగడానికి మెట్లుకూడా ఉన్నాయి. ఇద్దరూ మెట్లు దిగి లోనికి వెళ్ళారు.

అక్కడ ఒక విశాలమైన హాలు ఉంది. సుమారు పాతికమంది మనుషులున్నారక్కడ. కాంతివంతమైన దీపాలతో హాలు ప్రకాశవంతంగా ఉంది. అక్కడ రకరకాల ఆధునిక పరికరాలున్నాయి. బాస్ ఈశ్వరిని ఒక టెలివిజన్ ముందుకు తీసుకువెళ్ళాడు.

"గంగాపురం కొండ దగ్గర కాలిబాటలో ఎవరైనా అడుగుపెడితే ఈ టెలివిజన్ తనంతటదే ఆన్ అవుతుంది. అవతలపక్కన ఉన్నది కంట్రోల్ మిషన్. ఆ ప్రాంతంలో ఎవరైనా ఉంటే ఒక్క మీటనొక్కి తుదముట్టించవచ్చు. దీనికీ టెలివిజన్‌కూ సింక్రొనైజేషన్ ఉంది...."అన్నాడు.

"ఇక్కడేం చేస్తున్నారు మీరు?" అంది ఈశ్వరి.

"ఇదొక అంతర్జాతీయ గూఢచారి శాఖ. భారతదేశానికి సంబంధించిన ముఖ్య రహస్యాలను సేకరించి కావాలనుకున్న దేశాలకు అమ్ముతాము. మాకు సమాచారం అందజేసేవారు మంచి ప్రతిఫలం పొందుతారు. ఈ దేశం

లోని స్మగ్లర్సూ, చాలామంది వ్యాపారస్థులూ, ప్రముఖులూ, ధనవంతులూ మాకు సాయపడుతూంటారు. ట్రాన్స్‌మీటర్ల ద్వారా వారూ మేమూ సంభాషించుకుంటూంటాం...."

"ఈ విషయం ఎవరికీ తెలియదా?" అంది ఈశ్వరి.

"మాకు మాత్రమే తెలుసు. మాకు తప్ప ఎవరికి తెలిసినా వాళ్ళు ప్రాణాలతో తిరగపోలేరు...." అన్నాడు బాస్.

"ఇంతవరకూ ఎవరైనా ఈ హాలు చూసిన వాళ్ళున్నారా?"

"ఓసారి అయిదుగురు వచ్చారు. బంగారాన్ని చూసి అంతటితో ఆగకుండా గర్భగుడిలోకి వెళ్ళి ఈ హాలు చూసినవాళ్ళు ఆ అయిదుగురే! వాళ్ళను క్రూరంగా హింసించి చంపేశాను. ఆ కథ వింటావా?" అన్నాడు బాస్.

"చెప్పు!" అంది ఈశ్వరి. అతడు చెబుతూంటే వింటూ భయాన్ని నటించింది ఈశ్వరి. ఆమె కళ్ళలోని భయాన్ని చూస్తూ అతను తృప్తిగా తలాడించి, అక్కడున్న విశేషాలొక్కొక్కటే ఆమెకు చూపించాడు.

అక్కడున్న పాతికమందిలో ఇరవైమంది విదేశీయులు. ఉదయం నాలుగు గంటలవరకూ వారక్కడ ఉంటారు. రాత్రి ఎనిమిది గంటలకు వారి పని ప్రారంభమవుతుంది. ఆ తర్వాత తమకోసం నిర్మించబడిన బంగళాల్లో హాయిగా విశ్రాంతి తీసుకుంటారు.

బంగళాల్లో వారికి స్త్రీ సుఖం లభించడంకోసం సుమారు వందమంది ఆడవాళ్ళ నక్కడ ఉంచారు. ఎవ

రైనా ప్రమాదకరంగా మారితే వాళ్ళను చంపేసి ఆ స్థానంలో కొత్తవాళ్ళను తీసుకొస్తూంటారు....

ఈ వివరాలన్నీ ఆశ్చర్యంగా వింది ఈశ్వరి. అక్కడి వివరాలన్నీ చూశాక ఆమెకు ఒక విషయం తెలిసింది. ఇక్కడి మొత్తం విశేషాలన్నీ ఈ హాల్లో ఉన్నాయి. ఈ హాలును సాధిస్తే వీళ్ళందర్నీ జయించినట్లే....

"ఇక్కడున్న ఈ పాతికమందిలో ఏ ఒక్కరైనా ఎదురు తిరిగితే...." అంది ఈశ్వరి.

"అసాధ్యం. మేమంతా పార్ట్నర్స్. అందరమూ ఒక అంతర్జాతీయ గూఢచారి శాఖ తరఫున పని చేస్తున్నాము. మాలో మాకు మోసాల్లేవు. నేను పేరుకు బాస్‌ను. అన్ని వ్యవహారాలను కలిపి చూస్తూంటాను కాబట్టి. అయితే మాది సమిష్టి బాధ్యత!" అన్నాడు బాస్.

"ఒకవేళ బంగళాల్లోని ఆడవారుగానీ, ఇతరులుగానీ తిరగబడితే...."

"ఆ ప్రమాదం ఉంది. ఎందుకంటే మా దగ్గర చాలా మంది టెక్నీషియన్సున్నారు. అన్ని సౌఖ్యాలూ సమకూర్చుతున్నప్పటికీ ఇక్కడ గడపడం ఇష్టంలేని వారో పాతికమంది ఆ బంగళాల్లో ఉన్నారు. కానీ ఆ బంగళాల్లోంచి తప్పించుకోవడం అసాధ్యం. ఆ సంగతి నువ్వూ కనిపెట్టి ఉంటావ్!"

"లేదు. నేను ప్రయత్నించలేదు...." అంది ఈశ్వరి.

"అయితే తెలుసుకుంటావ్‌లే. నీ కివన్నీ ఎందుకు చూపించానంటే నీ కుతూహలం తీర్చడానికి. ఇకమీదట నీ జీవితం ఆ బంగళాల్లోకి మారబోతోంది. బైటి ప్రపంచం సంగతి అటుంచి ఈ ఆలయాన్ని చూసే అవకాశంకూడా నీకుండదు...." అన్నాడు బాస్.

ఈశ్వరి తడబడినా బయటకు తేలలేదు — "చాలా థాంక్స్! నామీద అభిమానంతో ఇవన్నీ చూపించావు" అంది.

"నీమీద అభిమానానికి కారణం నీకూ తెలుసు. అయితే ఈ రోజుకు నేను నీ జోలికి రాను. ఎందుకంటే అవతల గురువులు భౌతిక దేహం ఇంకా అలాగే ఉంది. నీ మనసులోని మనిషి భౌతిక దేహం బూడిదయ్యేవరకూ నిన్ను తాకలేను. కానీ ఎన్నాళ్ళో ఆగలేను. ఆ దహన కాండ రేపు మధ్యాహ్నం జరుగుతుంది! రేపు మధ్యాహ్నం నీ రూంకు నా మనిషి వస్తాడు...." అన్నాను బాస్.

* * *

బయట ఎవరో తాళం తీస్తున్న చప్పుడయింది. గురువులు చటుక్కున బిగుసుకుపోయాడు. ఈశ్వరి మోకాళ్ళ మీద తల పెట్టుకుని కూర్చుంది.

ఒక మనిషి వచ్చాడు. ఈశ్వరిని సమీపించి-"ఇదేనా శవం?" అన్నాడు గురువుల్ని చూపిస్తూ.

"అవును" అంది ఈశ్వరి.

"దీన్ని తగలబెట్టడానికి వచ్చాను...." అన్నాడతను.

"ఎక్కడ, ఎలా?" అంది ఈశ్వరి అతన్ని పరీక్షగా చూస్తూ. మనిషి ముఖం గుర్తు తెలియడంలేదు. జీబురు గెడ్డం, పెద్దపెద్ద మీసాలు అతని రూపురేఖల్ని చాలా వరకూ కప్పేస్తున్నాయి.

"చూపిస్తాను, పద!" అంటూ అతనొక గదిలోకి నడిచాడు. అక్కడొక పెద్ద పెట్టె ఉంది. అతనా పెట్టె తెరిచి—"దీంట్లో శవం పారేసి దీనికి కరెంట్ కనెక్షన్ యిచ్చి పెట్టె మూత వేసేస్తే....లోపలున్న శవం అయిదు నిముషాల్లో బూడిద, ఎముకలుగా మారిపోతుంది...."

అన్నాడు. అని వెనక్కి తిరిగాడు.

ఈశ్వరి అక్కడే ఆగిపోయింది! తెరిచి ఉన్న ఆ పెట్టె చూస్తూంటే ఆమెకు చాలా బెంగగా ఉంది. మానవ శరీరపు విలువ ఇంతేనా? అనిపించిందామెకి.

సరిగ్గా అయిదునిముషాల్లో ఆ పెట్టెలో వొక శవం పడింది. పెట్టె మూతపడింది. ఈశ్వరి ఉలిక్కిపడి పక్కకు చూసింది. ఇందాకా శవాన్ని కాల్చడానికి వచ్చిన మనిషి మౌనంగా పెట్టెపక్కకు వెళ్ళి ఎలక్ట్రికల్ కనెక్షన్ యిస్తున్నాడు. కెవ్వుమని కేకపెట్టింది ఈశ్వరి. ఆమె పరుగున వెళ్ళి పెట్టె మూత తెరవబోయింది కానీ ఆ మనిషి ఆమెను చటుక్కున వెనక్కి లాగి—"ఏమిటీ కంగారు, ఈశ్వరీ!" అన్నాడు.

ఈశ్వరి ఆ కంఠాన్ని గుర్తుపట్టింది—"నువ్వా, గురువులూ?" అంది.

"అవును—ఇక రంగంలో దిగుతున్నాను. వ్యవధి లేదు...." అన్నాడు గురువులు.

"ఎలా మార్చావ్ వేషాన్ని!" అంది ఈశ్వరి.

"ఈ స్పెషల్ రూంలో చాలా సదుపాయాలున్నాయి. బాస్ నిన్నిక్కడుంచడం నేనిక్కడికి రాగలగడం మన అదృష్టం—" అన్నాడు గురువులు. అతను నిన్నరాత్రి శోధించగా అక్కడ వొక అలమారాలో మారువేషానికి అవసరమైన సామాన్లున్నాయి.

"ఒక్క దెబ్బతో పడగొట్టేసి పీక నొక్కి చంపేశాను. వాడి గెడ్డం మీసాలు నాకు మంచిదే! వేషం మార్చుకోవడం మరింత సులభమైపోయింది—"అన్నాడు గురువులు.

ఈశ్వరి ఆశ్చర్యంగా అతడివంక చూసి—"నీ చేతులు కత్తి కంటె పదునైనవనుకొంటాను" అంది. అంటూనే ఆప్యాయంగా అతని చేతుల్ని ముద్దాడింది.

ఇద్దరూ బంగళాలోంచి బయటకు వచ్చారు. గురువులు టైము చూసుకొన్నాడు — మధ్యాహ్నం వొంటి గంటయింది.

"ఏం చేసినా ఏడు గంటల్లోపల చేయాలి!" అన్నాడు గురువులు.

"అవును. మన అదృష్టంకొద్దీ యీ ఆలయం ఆవరణ టెలివిజన్ రేంజిలో లేదు. ఇక్కడేం జరిగినా వాకర్ దృష్టికి పోదు.... దాన్నిబట్టి యిప్పుడేం చేయాలో ఆలోచించుకోవాలి...."

గురువులు ముందడుగు వేశాడు. బయట యెక్కడా మనుష్య సంచారం లేదు. ఏ విధమైన అలికిడీ లేదు. అతను, ఈశ్వరి కలిసి గోడదగ్గరకు వచ్చారు. గోడ చాలా ఎత్తుగా ఉంది. వాళ్ళకు కాస్త దూరంలో ద్వారం కనబడుతోంది. ద్వారానికి బయట కాపలావాడుంటాడు.

"మనం వొక పని చేయాలి. ఈ గోడ వలయాకారంలో ఉంది. ఇక్కణ్నించి యెలాగో అలా బయటపడినప్పటికీ మనం కాపలావాడి కళ్ళబడతాం. అందుకని అటువైపు నుంచి ప్రయత్నించుదాం—" అన్నాడు గురువులు. అతని ప్రయత్నమేమిటో అర్థం కాకపోయినా ఈశ్వరి అతన్ననుసరించింది.

"యిప్పుడు మనం ప్రయత్నించాలి!" అన్నాడు గురువులు.

"ఎలా?" అంది ఈశ్వరి.

"ఈ చెట్టు చూడు...." అన్నాడు గురువులు—

"నువ్వు చెట్టెక్కగలవా?"

ఈశ్వరి ఆ చెట్టును చూసింది. శ్రీకృష్ణపరమాత్మ తనకు యిచ్చిన శిక్షణలో చెట్లెక్కడం కూడా ఉంది. ఆ చెట్టు సన్నగా పొడుగ్గా గోడకు ఆనుకొనే ఉంది. అప్పుడే ఈశ్వరి గమనించింది—అలాంటి చెట్లు అక్కడ చాలా ఉన్నవని. ఎటొచ్చీ వాటి నుపయోగించుకోగల మన్న ఆలోచనే ఆమెకు రాలేదు.

ముందు గురువులు ఆ వెనుక ఈశ్వరి చెట్టు ఎక్కడం మొదలుపెట్టారు. అతి కష్టంమీద యిద్దరూ గోడ పై భాగం చేరుకోగలిగారు. ఆ ప్రయత్నంలో ఈశ్వరి చేతులు బాగా కొట్టుకుపోయాయి.

"ఇప్పుడేం చేయాలి?" అంది ఈశ్వరి. క్రిందకు చూస్తూంటే ఆమెకు కళ్ళు తిరుగుతున్నా యనిపించింది. సన్నని గోడమీద తనూ, గురువులూ!

"నేనైతే దూకేస్తాను...." అన్నాడు గురువులు.

"అమ్మ బాబోయ్!—" అంది ఈశ్వరి అప్రయత్నంగా.

"వేరే దారిలేదు. ఇలాంటి యెత్తులు దూకడం నాకు కొత్తకాదు. నేను క్రిందకు దూకి తమాయించుకొన్నాక రెడీ అంటాను. అప్పుడు నువ్వు దూకు....నిన్ను నేను కాసుకుంటాను. ఈ పరిస్థితుల్లో అంతకుమించి గత్యంతరం లేదు. ఈ గోడమీద యెక్కువసేపు నిలబడి ఉండడం ప్రమాదకరం—" అంటూనే గురువులు అక్కణ్ణించి క్రిందకు దూకేశాడు.

ఆ దృశ్యం చూడలేనట్లు కళ్ళు మూసుకొంది ఈశ్వరి. గురువులు సామర్థ్యంచూసినప్పటికీ అక్కణ్ణించి దూకడం ప్రమాదరహితమని ఆమె అనుకోలేకపోయింది. రక్తపు

మడుగులో ఉన్న గురువుల్ని చూడాలని ఇష్టంలేనట్లు కళ్ళు మూసుకొని నిలబడ్డ ఆమె చెవులకు "గడీ!" అన్న పిలుపు వినబడింది.

ఈశ్వరి కళ్ళు తెరిచి చూసింది. క్రింద గురువులు —చేతులు చాచి నిలబడి ఉన్నాడు. ఈశ్వరి కళ్ళు మూసుకుని మరాలోచన లేకుండా క్రిందకు దూకేసింది. గురువు లామెను చేతుల్తో ఒడిసిపట్టుకొన్నాడు కానీ ఆ విసురుకు యిద్దరూ నేలమీద పడి దొర్లక తప్పలేదు. నేలంతా పరచుకొని ఉన్న పచ్చగడ్డి వారికేవిధమైన శ్రమ కలిగించలేదు.

ఇద్దరూ కాసేపు కూర్చుని ఆయాసం తీర్చుకొన్నారు.

"మన వ్యవహారం ఇంత సులభంగా అయిపోతూంటే నాకేదో అనుమానంగా ఉంది—" అంది ఈశ్వరి.

"సులభంగా జరిగిందనుకోవడం నీ భ్రమ. ఎంతో కష్టపడితేగానీ మన మిక్కడికి రాలేకపోయాం. అదీగాక యెన్నో పరిస్థితులు మనకు కలిసివచ్చాయి. ఇక్కడికి శత్రువులు రావడం అసాధ్యమని తెలుసు కాబట్టి, ఇక్కడి వాళ్ళు నిశ్చింతగా ఉన్నారు. నేను శవాకారంలో రావడమే యింతవరకూ నన్ను రక్షించింది. అప్పుడే మనం జయించామనుకోవడంలేదు. ఇంకా ఏముందో చూడాలి" అంటూ గురువులు లేచాడు.

ఇద్దరూ అక్కడ ప్రదక్షిణం చేసి కాపలావాడి కళ్ళబడకుండా అక్కణ్ణించి ఆలయ ప్రాంతం చేరుకొన్నారు. అక్కణ్ణించి చూస్తుంటే దూరంగా వాకర్, మోనికా కనబడ్డారు ఈశ్వరికి. అంటే వాకర్ బయటే ఉన్నాడు. కంట్రోల్ రూంలో ఇంకా ఎవరైనా ఉన్నారా? ఉంటే యెంతమంది ఉంటారు?

ఈశ్వరి, గురువులుకు వాకర్ గురించి చెప్పింది.

"మనం ముందు ఆలయంలోకి వెడదాం—ఎందుకంటే వాకర్ బయటనుంచి మననేమీ చేయలేడు. కానీ అతనికి కంట్రోల్ రూంతో కనెక్షన్ ఉండి ఉంటే మనకు ప్రమాదం. ముందుగానే అక్కడకు వెళ్ళడం మంచిది" అన్నాడు గురువులు.

ఈశ్వరి దారి చూపిస్తూంటే గురువులు ముందుకు నడిచాడు. ఇద్దరూ ఆలయం గర్భగుడిలోకి వెళ్ళారు. అక్కడ మెట్లు దిగడం అరంభించారు. కొంతదూరం దిగగానే గురువులు ఆగిపోయాడు. కంట్రోల్ రూంలో కూర్చుని ఉన్న వొక మనిషి అతనికి కనబడ్డాడు. ఇంకా ముందుకు వెడితే అతనికి తనూ కనిపిస్తాడు.

"ఒక్కడే మనిషి ఉన్నాడు. కానీ వాడిదగ్గరేమేం ఉన్నాయో తెలియదు. ముందు వాడు మనల్ని కుక్కని కాల్చినట్లు కాల్చిపారేయొచ్చు...." అన్నాడు గురువులు నెమ్మదిగా.

"అయితే ఏం చేద్దాం?" అంది ఈశ్వరి.

"చూద్దాం. ఒక్కక్షణం ఆలోచిద్దాం...." అన్నాడు గురువులు.

అలా ఆలోచించి అతను మెట్లమీద రవంత శబ్దం చేశాడు.

కంట్రోల్ రూంలోని మనిషి లేచి మెట్లవైపు చూశాడు. అతనికెవ్వరూ కనబడలేదు. అందుక్కారణం గురువులు వొక అడుగు వెనక్కు వేయడం. కంట్రోల్ రూంలోని మనిషి ఉన్న స్థానంలోంచి కదిలి మెట్ల వైపుగా వస్తున్నాడు. అతని కళ్ళలో రవ్వంత భయం కూడా లేదు.

గురువులు దూరాన్ని మనసులోనే గణించుకొన్నాడు. మనిషి పాతికగజాల దూరంలో ఉన్నాడనగా తన శక్తి నంతటినీ కూడగట్టుకొని ఆ మనిషిమీదకు లంఘించాడు. అతడి తెగువకు ఈశ్వరి ఆశ్చర్యపడింది.

ఊహించని ఈ ఆఘాతానికి ఆ మనిషి వెల్లకిలా పడ్డాడు. గురువులుకూడా మోకాళ్ళమీద దెబ్బ తగిలింది. అతనా బాధను ఓర్చుకొంటూనే తన చేతిని ప్రయోగించి ఆ మనిషికి స్పృహ పోగొట్టాడు.

ఈశ్వరి వేగంగా అతన్ని సమీపించింది.

కంట్రోల్ రూంను ఆపరేట్ చేసేది ఒక్కడు కాదు. షిఫ్టులమీద రోజుకొకరు చొప్పున మారుతూ ఉంటారు. వారి సౌకర్యార్థం అక్కడ ఆపరేషన్ విధానాలన్నీ స్పష్టంగా ఒక పుస్తకంలో రాసి ఉన్నాయి.

దేశానికి సంబంధించిన యెందరో పెద్దమనుషులతో ట్రాన్స్‌మీటర్ ద్వారా సంభాషించడానికి వివరాలున్నాయి అందులో. గురువులు గబగబా ఆ పుస్తకం తిరగేసి తను ఆఖరిసారిగా దొంగతనం చేసిన యింటి యజమాని విశ్వేశ్వరరావు పేరు కూడా అందులో ఉండడం చూసి ఆశ్చర్యపడ్డాడు.

"ఇప్పుడేం చేయాలి?" అంది ఈశ్వరి.

"శ్రీకృష్ణపరమాత్మతో మాట్లాడాలి. నీకు నెంబరు గుర్తుందా?" అన్నాడు గురువులు.

"నెంబరు తెలియదు నాకు. నా దగ్గరొక ట్రాన్స్మిటర్ ఉండేది. అందులో రహస్యపు మీట ఉంది. అది నొక్కి-రేడియోను విజయవాడ ట్యూన్ చేస్తే ఆయనతో సంభాషించవచ్చు. కానీ అది నా దగ్గర్నుంచి వాకర్ లాక్కున్నాడు...." అంది ఈశ్వరి.

"అదెక్కడుందో?" అన్నాడు గురువులు.

"వాకర్ని అడిగితే చెప్పకపోవచ్చు. ఇక్కడే వెదికితే దొరకొచ్చు...." అంది ఈశ్వరి. అయితే వారెంత వెతికినా ఆ ట్రాన్స్‌మిటర్ దొరకలేదు.

గురువులు మరోసారి పుస్తకం చూసి—"ఇప్పుడీ ప్రాంతమంతా మన అదుపులో ఉంది. ఇంక మనవాళ్ళకు యీ వార్త పంపడమే తరువాయి...." అన్నాడు.

"అది నిజమే—కంట్రోల్ మిషన్ చేతిలో ఉంటే ఆ మనిషిని యెవ్వరూ తేరిపార చూడలేరు. ఆ ఆలయం ఆవరణనుంచి, గంగాపురం గ్రామం వరకూ ఆ మనిషి అదుపు చేయగలడు. ఎటొచ్చీ తను త్వరపడాలి. బంగళాలో విశ్రాంతి తీసుకొంటున్నవాళ్ళు అక్కణ్ణించి బయటపడి యిక్కడికి వచ్చేలోగా తనవాళ్ళను పిల్చుకోవాలి.

గురువులు ఆలోచించి ట్రాన్స్‌మిటర్ ఉపయోగించి వాకర్‌ని పిలిచాడు. వాకర్‌నించి రెస్పాన్స్ రాగానే ఉత్సాహంగా—"మోనికాను కూడా తీసుకునిరా, నీకు అర్జంటుగా ఓ విషయం చెప్పాలి—" అన్నాడు.

అప్పటికి ఈశ్వరి స్పృహతప్పిన కంట్రోల్ రూం మనిషిని తాళ్ళతో కట్టేసి ఓ మూలగా యీడ్చేసి నోట్లో గుడ్డలు కుక్కేసింది. తర్వాత ఆమె పక్కకు తప్పుకొంది. గురువులు వెళ్ళి ఇందాకా కంట్రోల్ రూం మనిషి కూర్చున్న పద్ధతిలో కూర్చున్నాడు.

కాసేపటికి మెట్లమీద మనుషులు వస్తున్న అలికిడి అయింది. గురువులు ఊపిరి బిగబట్టాడు. అతనివీపు మెట్ల వైపుగా ఉంది. అతను అడుగుల చప్పుణ్ణిపట్టి అంచనా వేస్తున్నాడు.

వాకర్ తనను సమీపించా డనిపించగానే చటుక్కున వెనక్కు తిరిగి ఊహించని వేగంతో వాకర్ రెండు భుజాలమీదా కొట్టి కాళ్ళతో డొక్కలో తన్నాడు. వాకర్ కుప్పలా కూలిపోయాడు. ఈశ్వరి వెనుకనుంచి మోనికాకు అదే ట్రీట్ మెంట్ ఇచ్చింది.

వాకర్ జేబులో ఈశ్వరి చెప్పిన ట్రాన్స్‌మిటర్ కనబడింది. ఈశ్వరి వెంటనే శ్రీకృష్ణపరమాత్మను కంటాక్ట్ చేసింది. ఆ సమయానికి శ్రీకృష్ణపరమాత్మ గంగాపురం సమీపంలానే ఉన్నాడు తన మనుషులతో.

"మీకేమీ ప్రమాదంలేదు. కంట్రోల్ రూం మా చేతిలో ఉంది. వెంటనే బయల్దేరి రండి. రాత్రి ఎనిమిది కాకుండా యిక్కడకు వచ్చేయాలి...." అంది ఈశ్వరి.

"బయల్దేరుతున్నాం—" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ. ఎలాంటి అడ్డదిడ్డ ప్రాంతాల్లోనైనా ప్రయాణం చేయగల జీపొకటి తనవద్ద ఉందనీ ఓ గంటలో తనక్కడికి వచ్చి చేరగలననీ ఆయన అన్నాడు. ఈశ్వరి నాయన యెంతగానో అభినందించాడు. గురువులు ప్రతిభను కొనియాడాడు.

ఆమె యీ పనుల్లో ఉండగా గురువులు వాకర్ని, మోనికాను కూడా కాళ్ళూ చేతులూ కట్టి, నోళ్ళలో గుడ్డలు కుక్కి ఓ మూలకు లాగేశాడు. ఇద్దరూ ఆత్రుతగా టెలివిజన్ ముందు కూర్చున్నారు. ఎప్పుడేం జరుగుతుందా అని ఎదురుచూస్తున్నారు.

చూస్తూండగా టెలివిజన్లో కాంతి వచ్చింది. ఒక జీపు —అందులో శ్రీకృష్ణపరమాత్మ— ఇంకా పదిమంది మనుషులు—అందరివద్దనూ ఆయుధాలున్నాయి.

ఈశ్వరి ఆశ్చర్యంగా టెలివిజన్ వంక చూసింది. ఒక

ప్పుడు తను యిదే విధంగా కంట్రోల్ రూం మనిషి కళ్ళ బడి ఉంటుంది. తను చాలా రహస్యంగా వస్తున్నానని భావించి యెన్నో జాగ్రత్తలు తీసుకొంది. అదెంత హాస్యాస్పదమో యిప్పుడర్థమవుతోంది.

జీపు భయంకరాకారాన్ని సమీపించి ఆగింది. శ్రీకృష్ణపరమాత్మ అందులోంచి దిగి ఆకారం వెనక్కు వెళ్ళాడు. అక్కడ ఏం జరుగుతున్నదీ కనపడలేదు కానీ ఆకారం చేయి లేచి వొక పక్కగా తిరిగింది. శ్రీకృష్ణ పరమాత్మ ఆ వైపుగా జీపును పోనిస్తున్నాడు.

"గురువులూ! నువ్వు గుహ దగ్గరకు వెళ్ళి ఆయన్ని రిసీవ్ చేసుకో—నే నిక్కడి వ్యవహారం చూస్తూ ఉంటాను—...." అంది ఈశ్వరి.

గురువులు లేచాడు. తన కార్యం ముగిసినట్లే అతనికి తోస్తోంది. అతనికి ఉన్న బెంగల్లా వొక్కటే—ఇక్కడేదో అపూర్వనిధి ఉన్నదన్న ఆశతో వచ్చాడు తను. అలాంటిదేదీ దొరకలేదు. తనకు అంతా నిరుత్సాహమే మిగిలింది. ఇంత కష్టపడి ఓ దుండగుల ముఠాను పట్టుకొన్నాడు. తను చెయ్యాలనుకొన్న దొక్కటి—జరిగిన దొక్కటి!

కొండ గుహదగ్గర శ్రీకృష్ణపరమాత్మను చూసినప్పుడు గురువులు కళ్లు చెమర్చాయి. నిజానికి తను యెన్ని కష్టాలు పడి యీ ప్రాంతం చేరాడు? తన శక్తిసామర్థ్యాలకు యేదో అపూర్వశక్తి తోడుకాకపోతే ఇంతవరకూ జీవించి ఉండేవాడు కాడు.

"శభాష్ గురువులూ! నీ సాహసా న్నభినందిస్తున్నాను...." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"రండి....కానీ యిక్కడ నిధి యేమీ లేదు....అంతా మోసం!" అన్నాడు గురువులు.

శ్రీకృష్ణపరమాత్మ పెద్దగా చలించలేదు-"ఆ విషయా లన్నీ తర్వాత చూసుకొందాం——ముందు నన్నక్కడికి తీసుకెళ్ళు——" అన్నాడు. ఆయన్ని అనుసరిస్తూ మిగతా పదిమందీ వచ్చారు.

ఆలయంలో అడుగు పెట్టి అక్కడున్న బంగారం చూసే సరికి ఆయనకు మతిపోయింది——"ఇంత బంగారం దగ్గ రుంచుకొని——నిధి లేదంటావేమిటి??" అన్నాడు.

గురువులు నవ్వి——"ఇదంతా నకిలీ బంగారం. నిధి అన్నది వొక అంతర్జాతీయ గూఢచారి ముఠా కల్పించిన భ్రమ. ఇక్కడ వారి రహస్య కలాపాలు కొనసాగిస్తు న్నారు——" అంటూ అన్నీ వివరంగా చెప్పాడు. అంతా గర్భగుడి ద్వారా భూమిలోపల ఉన్న హాల్లోకి వెళ్లారు. హాల్లో ఈశ్వరి వీరికి స్వాగతం యిచ్చింది.

శ్రీకృష్ణపరమాత్మ త్వరగా అక్కడి విశేషాలన్నీ ఆకళింపు చేసుకొన్నాడు....ఆయన ముఖం వెలిగి పోయింది——

"నిధి లేదంటావేమిటి గురువులూ! మన దేశంలోని ప్రముఖుల జాతకాలు మన చేతుల్లోకి వచ్చాయి. ఒకటి రెండుకాదు, కొన్ని వందల నిధులు మనకు దొరికినట్లు లెక్క. ఇది నేనూహించని అద్భుత విశేషం" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ. ఆయన పరుగున వెళ్ళి గురువుల్ని ఆప్యా యంగా కౌగలించుకొన్నాడు.

గురువులు ముఖం ఉత్సాహంగా లేదు—"నాకెక్కడవల

సింగి ప్రముఖుల జాతకాలు కాదు. డబ్బు. అందుకే యీ పనికి ఒప్పుకున్నాను. నా గత జీవితాన్ని వదిలిపెట్టి పవిత్రంగా మామూలు జీవితం గడపాలని నా ఆశ. అది నెరవేరనప్పుడు యింతవరకూ నేను పడ్డ శ్రమంతా వృథా" అన్నాడు నీరసంగా.

"ఏమీ వృథా కాదు. నువ్వేం విచారించనవసరం లేదు. నువ్వు చేసిన సాయానికి నీకు నేను అడిగినంత డబ్బు యిస్తాను. నీ శ్రమ వృథా కాలేదు——...." అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

"ఇక్కడికి దరిదాపుల్లో ఉన్న కాలనీని మనం స్వాధీన పర్చుకోవాలి. కంట్రోల్ రూంనుంచి ఆ కాలనీని పేల్చేయడానికి ఏర్పాట్లున్నాయి. ముందుగా ఒక మీట నొక్కితే కాలనీలో అలారం మ్రోగుతుంది. ఆ తర్వాత ఇంకో మీట నొక్కితే యిక్కణ్నుంచి మనం యే హెచ్చరిక చేసినా వినపడుతుంది-ఆ వివరాలన్నీ ఆ పుస్తకంలో ఉన్నాయి" అన్నాడు గురువులు.

"అయితే ఆ విషయం నువ్వే చూడు!" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

గురువులు కంట్రోల్ రూంవైపు కదలబోగా హఠాత్తుగా టెలివిజన్లో మళ్ళీ కాంతి కనబడింది. చూస్తూ ఉండగా గంగాపుర కొండ ప్రాంతాన ఉన్న సన్నని కాలిబాటలో కొందరు మనుషులు కనబడ్డారు. ఒకరి వెనకగా ఒకరు వస్తున్నారు. చాలామంది ఉన్నారు.

"పోలీసులు!" అన్నాడు శ్రీకృష్ణపరమాత్మ.

గురువులు చటుక్కున కంట్రోల్ మిషన్ వద్దకు వెళ్ళి ఒక మీట నొక్కాడు.

(సశేషం)

## "ముఖచిత్ర వ్యాఖ్యలల పోటీ"

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు (అట్టమీది బొమ్మ, అట్టచివరి బొమ్మ) పరిశీలించండి. రెండు ముఖచిత్రాలకు సంబంధం వుండేటట్లుగా ఒక్కమాటలోగాని, చిన్న వాక్యంలో గాని, పోస్టుకార్డు సైజు తెల్ల కాగితంపై వ్రాసి, ఈ నెల 7 వ తేదీ లోపు మాకు చేరేటట్లు పంపండి.

'హోమ్ డెలివరీ' సభ్యులు తమ పూర్తి చిరునామాతో పాటు, తమ నెంబర్ కూడా వ్రాయాలి. సభ్యులు కానివారు తమ వ్యాఖ్యలతో 50 పైసల స్టాంపులు పంపాలి.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 25/- నగదు బహుమతి పంపురాము.

## "హోమ్ డెలివరీ

మీరు 'హోమ్ డెలివరీ' సభ్యులుగా చేరితే, నెల నెలా పత్రిక మరియు సప్లిమెంట్ రెండూ కలిపి రు. 8/-లకే మా ఏజెంట్ ద్వారా గాని, వి.పి. ద్వారాగాని మీ ఇంటిదగ్గర అంద జేస్తాము. ఇందుకు అయ్యే ఖర్చులన్నీ మావే.

మీరు చేయవలసిందల్లా రు. 5/-లు పంపి 'హోమ్ డెలివరీ' సభ్యత్వము పొందటమే.

'హోమ్ డెలివరీ' వల్ల మీకు కాపీలు నెలనెలా గ్యారంటీగా, త్వరితంగా చేరుతాయి. మీ ఇంటిదగ్గరనే డబ్బు చెల్లించి కాపీలు పొందవచ్చును. కాపీల కోసం మీరు ఏజెంట్ చుట్టూ తిరగనవ సరం వుండదు. కాపీలు దొరకలేదనే నిరాశ, పోస్టులో పోయే సమస్య, ఎంతమాత్రం లేదు.

నెల నెలా వి. పి. తీసుకోవటం కష్టమనుకునేవాడు ఏడాది పైకము రు. 90/-లు ముందుగా పంపవచ్చును.



# క్రైమ్‌లో తమాషాలు

[ఈ శీర్షికలో ప్రచురించబడే ప్రతి రచనకు రు. 5 లు పారితోషికం ఇవ్వబడును—ఎడిటర్]

## "రెండు ఐదులు"

బస్‌స్టాప్‌లో బస్సుకోసం ఎదురుచూస్తున్న రామారావు దగ్గరకు ఒకతను వచ్చి, "ఈ పదిరూపాయల నోటుకి రెండు ఐదులు వుంటే యివ్వండి" అన్నాడు.

"నా దగ్గర లేవండి" అన్నాడు రామరావు.

"సరే....ఐతే ఈ క్రిందపడిన రెండు ఐదునోట్లు మీవి కాదని తేలిపోయింది" అంటూ వొంగి, ఆ రెండు ఐదు రూపాయల నోట్ల మడతను తీసుకుని జేబులో పెట్టుకుని వెళ్ళిపోయాడు.

రామారావుకు ఏడుపొచ్చినంత పనైంది.

—శ్రీలక్ష్మి, సూర్యాపేట.

## జోడు కుదిరింది?

ముగ్గురు విద్యార్థినులు కాలేజినుండి వస్తున్నారు. వారి వెంట కొంతమంద విద్యార్థులుపడ్డారు. వారికి వినపడేట్లుగా ఒకడిలా అన్నాడు.

"మేం ఆరుమంది—వారు ముగ్గురే వున్నారా ఎలా?"

అది విన్న ఓ విద్యార్థిని వెంటనే వెనక్కి తిరిగి ఇలా

అంది. "ఏం ఫర్వాలేదు. మేం ముగ్గురమే వున్నా—మా సాండిల్స్ ఆరున్నాయి" అని.

—చాగాపురం నాగేశ్వరరావు, మల్దకల్.

## తెలివిగల ప్రజలు??

అమెరికాకు, ఇండియాకు సంబంధించిన పేరు మోసిన హంతకులు ఇద్దరు చాలాకాలం తర్వాత కలుసుకున్నారు.

అమెరికన్ హంతకుడు తన విశేషాలు చెబుతూ 'మొన్న ఒకడ్ని నడివీధిలో చంపేయవలసి వచ్చింది' అన్నాడు.

'మరి వాడ్ని నడివీధిలో యెలా చంపేశావు' అడిగాడు ఇండియన్ హంతకుడు.

'రెండంతస్తుల మేడమీది నుంచి, ముసుగు వేసుకుని, సైలెన్సు తుపాకితో చంపేసి పారిపోయాను.'

'ముసుగు వేసుకుని యెందుకు హత్యచేశావు?'

'అమెరికా ప్రజలు నన్ను గుర్తుపడితే, చూసినవారంతా కోర్టులో సాక్ష్యం చెబుతారు' అన్నాడు.

దానికి ఇండియా హంతకుడు 'నేను కూడా మొన్న ఇలాంటి హత్యే చేసాను గాని, యిలా చెయ్యలేదు' అన్నాడు.

'మరెలా చేసావు'

'నేను చంపవలసిన వాడ్ని నడివీధిలో నిలబడి తుపాకితో కాల్చి చంపేసాను. అది చూసి ప్రజలంతా పారిపోయారు. నేను కారులో వెళ్ళిపోయాను.'

'మరి నిన్ను చూసిన ప్రజలు కోర్టులో నువ్వు చంపావని సాక్ష్యం చెప్పరూ?' అంటూ అడిగాడు.

దానికి ఇండియా హంతకుడు పగలబడి నవ్వి 'మా ప్రజలకి మా కోర్టులసంగతి బాగా తెలుసు. కేసులు కూడా కొన్ని ఏళ్ళవరకూ తేలవు. కాబట్టి అటువంటి పిచ్చిపనులు మా ప్రజలు చేయరు' అన్నాడు.

—అశోక్.

## యవ్వనం!!

ఓ లాబరేటరీలో ఆఫీసరు, సైంటిస్టను అడుగుతున్నాడు.

ఆఫీసరు: ఈ లాబరేటరీలో ముసలాళ్ళకి తిరిగి యవ్వనము రావటానికి కావల్సిన ఔషధము తయారుచేయాలనుకుంటున్నారు. సాధ్యమౌతుందంటావా?

సైంటిస్టు: యవ్వనం రావటానికి అనవసరంగా డబ్బు తగలెయ్యటమెందుకు సార్, మన భారతదేశంలోనే ముసలాళ్ళని యువకులుగా తయరుచేస్తున్నారు కదా!

ఆఫీసరు: (ఆశ్చర్యంతో) ఎక్కడ?

సైంటిస్టు: "పిటీఫీల్డ్"లో సార్!

—చందర్, విశాఖపట్టణం.

## క్రికెట్ కూర??

హైదరాబాద్, ఆంధ్ర జట్లమధ్య జరుగుతున్న క్రికెట్ పోటీ ప్రత్యక్షవ్యాఖ్యానం ప్రసారం అవుతుంది. దానిప్రక్క స్టేషన్‌లోని స్త్రీల కార్యక్రమంలో వంకాయ "వేపుడు చేయడం" గురించి చెప్తున్నారు. అయితే ఈ రెండు స్టేషన్‌లు పక్కపక్కనే వుండటం వలన రెండు కార్యక్రమాలు కలిపి యీ విధంగా వినపడుతున్నాయి:

"వేగంగా వచ్చిన బంతిని తీసుకొని నీళ్ళల్లో నానబెట్టి

ఎండబెట్టవలెను. బ్యాట్స్‌మెన్ కొట్టిన బంతిని తీసుకొని ముక్కలు ముక్కలుగా కోసి ఉప్పుకారం చల్లి రెండు పరుగులు చేయాలి. అప్పుడు స్కోరు 3 వికెట్లకు 144 వంకాయలు. ఆ తరువాత ఔటయిన బ్యాట్స్‌మన్‌ను ముక్కలుగా కోసి వంకాయ ముక్కలుతో కలిపి నూనెలో వేయించవలెను.

నూనెలోంచి ముక్కలు తీసి బౌలింగ్ చేయవలెను. వాటిమీద వికెట్లను కోసి పొడిచేసి చల్లవలెను. వాటిని బ్యాట్స్‌మన్ తింటే విటమిన్లవల్ల బలంవచ్చి సిక్సర్ కొట్టారు. ఈ క్రికెట్ ఆటను జాడీలో దాచి యెన్నిరోజుల తర్వాత అయినా నోట్లో కొడితే 4 పరుగులు చేస్తారు. ఇంతవరకు మీరు 150 పరుగులకు 4 వంకాయలను బౌలర్ సహాయంతో ఎంపైర్‌ను వేయించడం ఎలా అని క్రికెట్ ఆడుతూ వేపుడుచేసి చూడండి.

—బి. ఇందుసేన్, ఖమ్మం.

## తాగుబోతు ?

ఇన్‌స్పెక్టర్ తన చేతిలోని స్టిక్‌ను ఊపుకుంటూ, తీవ్రమైన ఆలోచనలతో పరధ్యానంగా ముందుకు నడుస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్‌కి యెదురుగా ఒకవ్యక్తి తాగిన మైకంతో ఫుట్‌పాత్‌పై అటు ఇటు తూలుతూ తృళ్ళుతూ వస్తున్నాడు.

ఇన్‌స్పెక్టర్ ఏమి తాగకుండానే పరిసరాలను మరిచి ముందుకు నడుస్తున్నాడు.

ఒకరికొకరు చేరువైయ్యారు. ఒకరిధ్యాస ఇంకొకరు పట్టించుకొనుటలేదు.

అంతే! ఒకరికొకరి యెదురుగా గుద్దుకొన్నారు.

పరధ్యానంగా నడుస్తున్న ఇన్‌స్పెక్టర్ ఒకపక్క, తాగినవ్యక్తి మరోపక్కకు పడ్డారు.

ఇన్‌స్పెక్టర్ యీ హఠాత్ పరిణామాన్ని తట్టుకోలేదు. మోకాళ్ళు, మోచేతులు బాగానే కొట్టుకుపోయాయి. లేచి బట్టలు దులుపుకొంటూ "ఏరా! తాగుబోతు వెధవ! చూచి నడవలేవా?" అన్నాడు కళ్ళెర్రజెట్టి క్రూరంగా చూస్తూ.

తాగినవ్యక్తి ఇదేమి పట్టించుకోకుండ "ఓహ్" అని లేచి నిలబడి ముందుకు వెళ్ళబోయాడు.

తనను క్రింద పడగొట్టి క్షమాపణలు కూడా చెప్పుకోకుండా నిర్లక్ష్యంగా ముందుకు పోబోయిన తాగుబోతుని తన స్టిక్‌తో ఒక పోటుపొడిచాడు కడుపులో "గుడ్డివాడివా ఏమిటి? కండ్లు కనబడటంలేదా?" అంటూ ఇంకా నాలుగు వీపుమీద బాదాడు ఇన్‌స్పెక్టర్.

"ఎవడ్రా నన్ను కొడుతుంది?" అంటూ బండబూతులు తిట్టసాగాడు అతని నోటికొచ్చినట్లుగా.

ఇన్‌స్పెక్టర్‌కి కోపం హద్దులు మీరింది. ఒక రిక్షాని పిలిచి, ఆ తాగుబోతుని అందులో కెక్కించి పోలీస్‌స్టేషన్ తీసుకెళ్ళి లాకప్‌లోకి నెట్టేశాడు.

తెలతెలవారుతుండగా తాగుబోతు మైకం పూర్తిగా వదిలింది. తానువున్న స్థలాన్ని గమనించగానే పైప్రాణాలు పైనేపోయాయి.

ఆ మర్నాడు తాగి అసభ్యంగా ప్రవర్తించిన నేరానికి కేస్ బుక్‌చేసి ఆ త్రాగుబోతును కోర్టుకు పంపించాడు.

వాదోపవాదాలనంతరం "నీవు చెప్పేది ఏమైనా ఉందా?" అడిగాడు జడ్జి.

తాగుబోతు చేతులు కట్టుకొని, "అసలు రాత్రి నేను

తాగలేదుసార్! కానీ యీ ఇన్‌స్పెక్టర్‌గారే బాగా తాగి, మైకంతో రోడ్డు కడ్డదిడ్డంగా నడుస్తున్నాడు. పరిసరాలలో ఏం వుందో? ఏం జరుగుతుందో? పట్టించుకొనే స్థితిలోలేరు.

ఇన్‌స్పెక్టర్‌గారు నడుస్తున్న రోడ్డుప్రక్కనే ఒకపాత ఎత్తైన ప్రహరీగోడ వుంది. అది ఏ సమయంలో కూలుతుందో తెలియదు. సరిగ్గా ఇన్‌స్పెక్టర్‌గారు అక్కడికి చేరే సమయానికి ఆ గోడ కూలసాగింది. ఇటుకలు ఇన్‌స్పెక్టర్‌గారి తలపై పడబోతుండగా ఆయన్ని బలంగా ప్రక్కకు తోశాను. ఒకపెద్ద ప్రమాదం నుండి ఆయనను రక్షించడానికి ప్రక్కకు తోశాను. ఇది నా యొక్క అసభ్య ప్రవర్తనా?'' అని ముగించాడు.

ఆ మాటలు వినగానే ఇన్‌స్పెక్టర్‌కి బుర్ర గిర్రున తిరిగి పోయింది.

వెంటనే జడ్జిగారు ఆ స్థలాన్ని పరీక్షించి తాగుబోతు చెప్పిన మాటలు నిజమా? కావా? అన్నది చూడమని ఉత్తర్వుని జారీచేశారు.

నిజంగానే ఆ స్థలంలో ఒక పాత ప్రహరీగోడ అధ్వాన్న స్థితిలో వుంది. ఇటుకలు చెల్లాచెదురుగా క్రిందపడినవి కనిపించాయి అధికారులకు.

విషయం తెలియపర్చారు జడ్జిగారికి.

ఇంకేముందీ! తాగుబోతు బయటకు. ఇన్‌స్పెక్టర్‌కి నాలుగు చివాట్లు తప్పలేదు.

—జి. వెంకటి, నిజామాబాదు.

## బరువు ఎత్తే పని?

ఒకరోజు వుదయమే ప్రముఖ పారిశ్రామికవేత్త పాపారావుకు ఫోన్ వచ్చింది.

"హల్లో....పాహెరావ్ స్పీకింగ్....!"

"చూడండి...రెండువందల కేజీల బరువును అవలీలగా వొక్కచేత్తో యెత్తి, ఫర్లాంగుదూరం వరకు విసిరేయ గలను...." అవతలి నించి వొక మగకంఠం పలికింది.

"అయితే ఏమిటి....? ఇప్పుడు నా దగ్గర బరువులు యెత్తేపని వొక్కటి కూడా ఖాళీలేదు...."

"ఉంది! నా చెల్లెలు రేఖను, మీ అబ్బాయి ఇక ముందు యెప్పుడైనా వెంటపడి అల్లరిచేశాడో....మీ అబ్బాయి శరీరం మున్సిపాలిటి డ్రైనేజిలోకి విసిరికొట్టగలను జాగ్రత్త....!"

—యం. వీరాస్వామి, మల్కాజిరిగి.

## దోమలకు ఆశ్రయం

"నువ్వు మనిషివేనా అని అనుమానం వస్తుంది నాకు." చిరునవ్వుగా అన్నాడు శ్రీరాములు.

"ఎందుకు?" అన్నాడు సంశయంగా మధు.

"గంటనుండీ అదే పనిగా దోమలు కుడుతున్నాయని నేనొక్కడ్నే అరుస్తున్నాగానీ, నువ్వు చప్పుడు చేయడం లేదుగా? అందుకు!"

"మైడియర్! దోమలు చెత్తా చెదారం మీదా, మురికి గుంటలమీదే వాలుతాయి. ఆ సంగతి తెలియదూ!" అన్నాడు నవ్వుతూ మధు.

—సుంచు కృష్ణస్వామి, నిజామాబాద్.

## గొడుగుల దొంగ?

ప్రొఫెసర్ రామనాథం గారికి నాలుగు గొడుగు లున్నాయి. కానీ నాలుగుకు నాలుగు విరిగిపోయాయి.

ప్రొఫెసర్‌గారి భార్య యెన్నిసార్లు చెప్పినా గొడుగులను రిపేరు చేయించుకుని రావడానికి మర్చిపోయేవాడు.

ఒకరోజు ప్రొఫెసర్. బస్సులో ఒక స్త్రీ గొడుగును పొరపాటున చేతపట్టుకుని దిగబోయాడు. ఆమె ప్రొఫెసర్‌ను 'దొంగ' అని అదీ యిదీ తిట్టింది.

రామనాథం 'పొరపాటున తాను ఆమె గొడుగును తీసుకున్నానని-క్షమించమనీ' అడిగాడు. ఆమె చివరకు ఎలాగో ఊరకుండిపోయింది.

ఆ సంఘటన తర్వాత రామనాథం, తన గొడుగుల్ని తప్పకుండా రిపేరు చేయించుకోవాలని గట్టిగా నిర్ణయించుకొని. మరుసటి రోజు తన నాలుగు గొడుగుల్ని రిపేరు చేయించుకోవడానికి తీసుకెళ్లాడు.

బస్సులో నిన్నటి స్త్రీ ప్రొఫెసర్ను-అతని చేతిలోని నాలుగు గొడుగుల్ని చూసి "ఓ ఈ రోజు నలుగురి గొడుగుల్ని కొట్టేశారన్న మాట," అంటూ ఆశ్చర్యపోయింది.

— చాగాపురం నాగేశ్వరరావు, మల్దకల్.

## డిటెక్టివ్ ది గ్రేట్!

డిటెక్టివ్ అయోమయము అయోమయంగా ఇంట్లో ప్రవేశించి. వీధి బయట గేటుకి వ్రేలాడుతున్న 'డిటెక్టివ్' అన్న బోర్డు తీసికెళ్ళి పెట్లో దాచేసి, తాళం బిగించేశాడు.

ఆయన భార్య అయోమయంగా, "అదేమిటండీ, బోర్డు తీసేశారు" అంది.

"అది కాదే, వెర్రిదానా! వాడెవరో కిల్లర్ పట్టణంలో ప్రవేశించి, డిటెక్టివ్ అన్నవాడినల్లా చంపుతానని ప్రతిజ్ఞ చేశాట్ట. అందుకని, బోర్డు యింట్లో దాచేశాను. వాడ్ని

పోలీసులు పట్టుకున్న తరువాత మళ్ళీ తగిలించొచ్చు."
అంటూ భార్యకేసి గర్వంగా చూశాడు అయోమయం.

పాపం, బిత్తరపోయిందా ఇల్లాలు.

— చందర్, విశాఖపట్నం

## కులవృత్తి

"నీవు కూడా బాగా చదివి, ఆ యిన్‌స్పెక్టర్‌లా అవాలిరా," అంది తల్లి సినిమానుంచి రాగానే పదేళ్ళ కొడుకుతో.

"అమ్మా ఆ యిన్‌స్పెక్టరు లాగా అయితే.... రెండు ఉద్యోగాలు చేయాలికదమ్మా!"

"పోలీసు ఆఫీసరు ఉద్యోగమే కదరా!" అందా తల్లి ఆశ్చర్యంగా.

"అదేమిటమ్మా.... అటు దొంగతనం నాన్నలాగా.... యిటు ఆఫీసరులాగా...."

తల్లి ఏం మాట్లాడలేకపోయింది. అయినా తండ్రిలాగా దొంగతనాలు చేయడం యిష్టంలేదు. తన కొడుకు బాగా చదువుకొని పెద్ద ఉద్యోగం చేయాలని ఆవిడ కోరిక.

"అమ్మా....ఆ పోలీసాఫీసరు ఉద్యోగం నేను చేయనమ్మా...." అన్నాడు.

ఆవిడ నోరెళ్ళబెట్టింది. "యెందుకు చేయలేవు?"

"అంతేనమ్మా. నేను పోలీసాఫీసరు అయితే నాన్నను పట్టుకోవాలి ... అపుడు నువ్వు "నాయినా! నీ తల్లినిరా" అంటావు. వదిలేశాను అనుకో. ప్రజలు ప్రభుత్వం వూరుకోరు. అందుకని పోలీసాఫీసరు ఉద్యోగం కంటె ఈ దొంగతనమే హాయి! అదీగాక మన కులవృత్తికూడా...." అన్నాడు ధైర్యంగా కొడుకు.

— మన్నవ రామారావు, విజయవాడ-13

## మారిన ఉద్యోగం

వాచ్‌మాన్ వాజయ్య రెండు గంటలు ముందుగానే ఇల్లు చేరుకున్నాడు. వాకిట్లోంచే పడగ్గదిలో నిద్రిస్తున్న భార్యను కేకేసి, దుస్తులు మార్చుకుని మంచంవద్దకు నడిచాడు-చీకట్లో.

అతని భార్య అంది. "తలపోటుతో నిద్రే లేదండి. సారిడన్ మాత్ర కాఫీ తెచ్చిపెట్టండి."

వాజయ్య ఆందోళనతో తిరిగి దుస్తులేసుకుని ఆ వీధి చివర వున్న హోటల్‌కి పరుగు తీశాడు-మరచెంబు తీసుకుని.

హోటల్ అతను వాజయ్యకి, మాత్రలిచ్చి, కాఫీ పోయించి, అతన్ని తేరిపారాచూస్తూ అడిగాడు-"మీరు.... నైట్‌వాచ్‌మాన్ కదూ?"

"అవును ఏం?!"

"సాయంత్రం చూశాను నిన్ను వాచ్‌మాన్ దుస్తుల్లో మరి, నీవీ ఎస్. పి. దుస్తుల్లోకి యెలా వచ్చావో అర్థం కాలేదు!"

తన దుస్తులకేసి చూసుకుని ఆలోచనలో పడ్డాడు వాజయ్య. పొరుగింటి ఎస్. ఐ. గుర్తుకువచ్చి ఉలిక్కిపడి ఇంటివైపు పరుగు దీశాడు.

— యన్. సత్యానంద్, బెల్లంపల్లి.

## దొంగకు గుర్తింపు

జడ్జి: (దొంగతో) ఈ కోర్టులో నీ వైపు సాక్ష్యం చెప్పేవారెవరైనా ఉన్నారా? ఉంటే నీ మంచితనం గురించి చెప్పమను.

దొంగ: ఉన్నారండి. హెడ్ కానిస్టేబుల్‌గారే!

హెడ్‌కానిస్టేబిల్: నేనీ మనిషిని ఎరుగను.

దొంగ: చూశారా ఇంతకంటె మంచిసాక్ష్యం ఏముంది? ఇరవై ఏండ్లనుండి వీరున్న వీధిలోనే ఉన్నాను? కానీ నేను వీరికి తెలియనట. నా మంచితనానికి అదే ఆధారం కాదా?

—చాగాపురం నాగేశ్వరరావు, మల్దకల్.

## "బెడ్‌పై వెంట్రుక"

ఓ హొటల్ యజమాని తన హోటల్ గదులన్నీ శ్రద్ధగా పరిశీలిస్తున్నాడు. హఠాత్తుగా అతనికి ఓ గది బెడ్డుపై ఓ నల్లని పొడవైన వెంట్రుక కనిపించింది. ఆ వెంట్రుక తీసుకొని అటూ-ఇటూ పరీక్షగా చేస్తూ, ప్రక్క-నున్న నౌకరును అడిగాడు-ఏమిటని!

నౌకరు వినయంగా, "అయ్యా దీని explanation చెప్పమంటారా" అన్నాడు.

"వెధవ explanation యెవరికి కావాలి! దీని Interduction చెప్పరా" అన్నాడు.

— బొకె హమీమిల్లా, అనంతపురం.

## ఆలోచన - ?

సముద్రటొడ్డున బీచ్‌లో, ఏదో ఆలోచిస్తూ కూర్చున్నాడు సుబ్బారావు.

అది చూసి ప్రక్క-నే వున్న మిత్రుడు "ఏమిటి భాయ్.. ఏమిటాలోచిస్తున్నావు." అడిగాడు.

"నువ్వాలోచిస్తున్న సంగతే!" విసుగ్గా సమాధానం ఇచ్చాడు సుబ్బారావు.

"అయితే, నువ్వుకూడా భార్యను చంపాలనుకుంటు న్నావా!" ఆశ్చర్యపోయాడా మిత్రుడు.

— యం. వీరాస్వామి మాల్కాజిగిరి.

## చెవిటి ఆఫీసర్?

"అదిగో పోతున్నాడే గళ్ళషర్టు అతనే మా ఆఫీసర్."

"అతనా! అతనిని నేనెప్పుడో, యెక్కడో చూచాను. అతనితో మాట్లాడాను కూడ."

"అరే అదెప్పుడు?"

"అతనికి చెముడు కదూ?"

"ఛ! చెముడు లేదు. గిముడు లేదు."

"వాట్? అతనే చెప్పాడు తనకు చెముడు అని."

"అసంభవం!"

"ఒకసారి అతనిని పలుకరించాను. ఎన్నిసార్లు పిలిచినా జవాబులేదు. చేత్తో కుదిపాను. అప్పుడు చెప్పాడు చెముడు అని."

"తమాషాగా వుందే! అతనిని యెందుకు పలుకరించావు?"

"ఎప్పుడో సినిమాకు వెళ్లినపుడు అతని ప్రక్కనకూర్చు న్నాను. డైలాగాలు అర్థం కాకుంటే అతనిని అడిగాను."

"ఏ సినిమా రా అది, నీకు అర్థం కానిది?"

"అదేదో ఇంగ్లీషు పిక్చరులే."

"అదీ కథ."

"ఏంటా కథ?"

"అతనికీ అర్థమైయుండదు."

— దామెర్ల కృష్ణమూర్తి, నెల్లూరు.

